

సంపుటము 18
సంచిక 5

భారతి

వృష వైశాఖము
మే 1941

# ఆముక్తమాల్యదకర్త కృష్ణరాయడే

శ్రీ చిలుకూరి నారాయణరావు

ఆముక్తమాల్యదాకర్తృత్వమునుగురించి సందేహము లెందుకు కలుగుతవో నాకు బోధపడకుండా ఉన్నది. "నేను వ్రాసినానయ్యా!" అని కృష్ణరాయడు నోరువిడిచి చెప్పకొంటూ ఉండగా, "ఛా! ఊరుకో! నీవు ఎక్కడ, ఎప్పుడు, ఎందుకు, ఏసందర్భములో వ్రాసినావు? నీవు యుద్ధాలే చేస్తావా? రాజ్యాలే ఏలుతావా? దేవేరుల జగడాలే తీరుస్తావా? వేటలకే పోతావా? కావ్యాలు వ్రాయడానికి నీకు తీరిక ఎక్కడ ఉంది? అసలు నీ వేమి చదువుకొన్నావు?" అని అతనిని నిలబెట్టి సాగతీసి అడగడ మేమి బాగుంటుంది? అతని పరోక్షములో, అతని సమకాలికుల పరోక్షములో ఇటువంటి ప్రశ్నలు వేస్తున్నారుగనుక సరిపోతున్నది గాని?—

"అని యిష్టదేవతావందనంబుఁ జేసి మున్నొకఁ గళింగదేశవిజిగీషామనీషం దండెత్తిపోయి ...... శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రి చతుర్థయామంబున ... ఆంధ్రజలజాక్షుఁడు ... కృతి వినిర్మింపుము... మాకుఁ బ్రియముగాఁగ... ప్రియాపరిభుక్తభాక్కథన్ జెప్పుము...దానిని వేంకటపతికంకితము సేయుము పాత్రమిటు సేయ నీకుత్తరోత్తరాభివృద్ధి" అన్నాడు. నిండోలగమున విద్వజ్జనములు "సాహితీసమరాంగణసార్వభౌమ...కృతి వినిర్మింపుము" అన్నారు. కృష్ణరాయడు "ప్రహృష్టాంతరంగుండనై ...నావిన్నవింపంబూను నాముక్తమాల్యదామహాప్రబంధంబునకు కథాక్రమం బెట్టిదనిన" అని ఎత్తుకొన్నాడు. "కృష్ణరాయమహీకృన్నామాస్మదాముక్తమాల్యద" (ఆశ్వా. ౨); "కృష్ణరాయ నృపసంజ్ఞాస్మత్కృతాముక్తమాల్యద" (ఆశ్వా. 3, ౪, ౫, ౬) అని ఏ డాశ్వాసాలలోని ఐదాశ్వాసాలలో అంతమందు కంఠోక్తిగా చెప్పకొన్నాడు. అన్నివ్రాతప్రతులలోను కృతి కృష్ణరాయప్రణీతముగానే ఉన్నది.

కవి ననుకొని అప్పకవి నని పేరుపెట్టుకొన్న అప్పన్న వ్రాసిన తప్పడువ్రాత నాధారముగా చేసుకొని ఇటీవలివారు ఆముక్తమాల్యదను పెద్దన్నకు తగిలిస్తే నిలుస్తుందా? ఆముక్తమాల్యదవంటి ప్రబంధమును వ్రాయడానికి మెరుగులుమేన త్తపని చేసిన పెద్దన్నవంటివా డెన్నాళ్లు తపస్సుచేయవలెను? పెద్దన్నకవిత్వాని కా కటుత్వమూ లేదు, ఆ పటుత్వమూ లేదు. అతని కా పాండిత్యమూ లేదు, ప్రౌఢత్వమూ లేదు. ఆమాటల విసరూ లేదు, తలపుల ఉసురూ లేదు. ఆ లోకానుభవమూ లేదు, ఆ రాజసభావమూ

లేదు. ఆతలతిరుసుక్కూ లేదు, ఆవినయసంపదా లేదు. కల్పనలలో ఆ రాకడా లేదు, ఆ పోకడా లేదు. అల్లసానివాడల్లా ఇల్లా అల్లుకపోయినవాడు. ఆముక్తమాల్యద ప్రత్యేకవైశిష్ట్యముగల కావ్యము. మనుచరిత్రాముక్తమాల్యద లేకముఖ వినిస్సృతము లంటే నమ్మ వీలులేని మాట. కాదు కూడదు పెద్దన్నయే ఆముక్తను వ్రాసినా డని హఠముపట్టితే, పెద్దన్న మనుచరిత్రను వ్రాయలేదని మొండికి పడవలసివస్తుంది. ఎందుకీ తగాదాలు?

పులిమీద పుట్ర అన్నట్టు ఇప్పుడు జగద్గురు పులవారొకరు బయలుదేరినారు. ఆముక్తను కృష్ణరాయడూ వ్రాయలేదట, పెద్దన్నా వ్రాయలేదట! ఎవడో అనామధేయుడు సాత్తానివైష్ణవుడు వ్రాసినాడట! ఏమి విడ్డూరము! ఈ పేరులేని సాత్తాని వైష్ణవునికి విశిష్టాద్వైతసంప్రదాయ మంత సమగ్రముగా ఎక్కడ పట్టుపడినదో! అనుభవమూలకమైన ఆ రాజనీతి ఎక్కడ అలవడినదో! సంస్కృతాంధ్రములం దంతటి కూలంకషపాండిత్య మెట్లబ్బినదో!...పిచ్చిమాటలు!!

దానిమాట కేమిగాని, పండితులు కొందరు పెద్దన్నకు ఆముక్తకర్తృత్వమును ఎట్లా అయినా పులుమడానికింకా ప్రాకులాడుతున్నారు. రాజేమిటి, కావ్యము వ్రాయడ మేమిటి అని వారి సందేహము. రాజు కుండవలసిన లక్షణా లేమిటో, కృష్ణరాయనికి వానిలో నేమేమి ఉండడముచేత దక్షిణహిందూదేశము తురుష్కాక్రాంతము కాకుండా వరాహధ్వజ మెగరడానికవకాశము కలిగినదో రాయవాచకము చదువుతే తెలుస్తుంది. అతని ఆస్థానకవులందరున్నూ అతనిని విద్యాభోజునిగా, కావ్యకళాదక్షునిగా వర్ణించినారు. అతడు తీరిక ఉన్నప్పుడెల్ల విద్వద్గోష్ఠిలోనే రాజకార్యములవల్ల కలిగే తొందరలను కొంతకాలము మరచేవాడు. అతనికి విద్యాబుద్ధులు కరపించినవాడు తిమ్మరుసుమంత్రి-అప్పాజీ. కృష్ణుని సార్వభౌమునిగా దిద్ది తీర్చనెంచి కృతకృత్యుడైన అప్పాజీ అతడు కవిసార్వభౌముడౌతేనేకాని అతని సార్వభౌమత్వానికి వన్నె రాదని ఊహించకుంటాడా?

కృష్ణరాయడు ఆముక్తను వ్రాయడము సత్యము. దాని నాతడు మనుచరిత్రమును పెద్దన్న వ్రాయకముందే వ్రాసినాడు. ఆముక్తలోని కృష్ణరాయని వంశవర్ణనపద్యములు, అవతారపద్యములు మొదలయినవి మనువులోని కొక్కనవి; రాజు మొగమెచ్చుకోసము. రాయలరచనను పెద్దన్న కొన్నికొన్ని పద్యములలో అనుకరించినాడు. చూడండి — విలుబుత్తూరివర్ణన, అరుణాస్పదపురవర్ణన, విలుబుత్తూరి భాగవతులవర్ణన, ప్రవరుని తీర్థసంవాసిసేవావర్ణన, విష్ణుచిత్తునను నిష్ఠానిధి గేహసీమ "నడురే యాలించినన్ వ్రైయము...కృప నూభోక్తవ్య" మన్నట్టు "వండ నలయదు వేవురు వచ్చిరేని వన్నపూర్ణకు నుద్దియౌ నతని (ప్రవరుని) గృహిణి అతిథు లేతేర నడికిరేయైనఁ జెట్టు"—ఇటువంటివి మరి కొన్ని ఉదాహరించవచ్చును. రాక్షసవృత్తాంతము రెండుగ్రంథములకున్నూ కొంతపోలికను కలిగిస్తున్నది. ఇంతకుమించి వీటికి మరెట్టి పోలికా లేదు. కృష్ణరాయడు పెద్దన్నకు కొంచెము దారిచూపినాడు. కాని, అతడు దాని నవలంబించలేకపోయినాడు. ఆముక్తమాల్యదను చదువుతే పుణ్యమూ, పురుషార్థమూకూడా కలుగుతవి. మనుచరిత్రను చదువుతే రెండున్నూ లేవు.

వేదము వెంకటరాయశాస్త్రులవా రసమానపండితులు; కాని తృతీయపంథావారు. వా రాముక్తను కృష్ణరాయని పేరనే ప్రకటిస్తూ పెద్దన్ననే పెద్దచేసి, రాజును త్రోసిరాజుచేసి అతని మొగమునకు కొంచెము రంగు పులిమినారు. వారి జీవితమువలెనే ఈ ప్రతిపాదనముకూడా అత్యంతవిషాదకర మైపోయినది.

ఆముక్తమాల్యద ప్రత్యేకవైశిష్ట్యముగల కావ్య మనడానికి సందేహము లేదు.

గ్రంథము పేరులోనే ఆవైశిష్ట్యము కనబడుతుంది. సంస్కృతాంధ్రవాఙ్మయములలోనే అనడ మెందుకు, ప్రపంచవాఙ్మయములో మరెక్కడా ఇట్టి గ్రంథనామకరణము కనబడదు. గ్రంథముపేరు 'విష్ణుచిత్తీయము' కాదు. అట్లని కవి యెక్కడా వ్రాయలేదు. విష్ణుచిత్తీయ మనడానికి గ్రంథమున కెంతటి అర్హత ఉన్నదో గోదామునీయ మనడానికికూడా అంతే అర్హత ఉన్నది. అట్లే ఖాండిక్యకేశిధ్వజీయ మని

కాని, మాలదాసరికథ అనికాని కూడా చెప్పవచ్చును. ఈకథల కన్నిటికిన్ని గ్రంథములో సమప్రాధాన్యమే ఉన్నదికదా! ఆముక్తమాల్యద అయిన గోదాదేవిని శ్రీరంగభర్త పెండ్లాడడముతో కథ అంతమొందుతున్నది కాబట్టిన్ని, ముక్తమాల్యముల నిచ్చిన పిన్నదానిని పెండ్లాడడమే విశేషముగా కవి తలంచి దానిని మనస్సులో ప్రధానముగా ఉంచుకొని గ్రంథమును వ్రాసినాడు కాబట్టిన్ని 'ఆముక్తమాల్యద' అనే పేరే కవి ఉద్దేశించినదని నిస్సందేహముగా చెప్పవచ్చును.

'ఆముక్తమాల్యద' అనే పేరు కర్థమేమిటి? "ఏ మును దాల్చిన మాల్య మిచ్చు నప్పిన్నది రంగమందయిన పెండిలి చెప్పుము", "ప్రియాపరిభుక్త భాక్కథన్ చెప్పుము" అని ఆంధ్రవిష్ణు వానతిచ్చినది. మొదటి దానికి "ఏను, మునుదాల్చిన మాల్య మిచ్చు నప్పిన్నదియగు రంగములో (శ్రీరంగములో) అయిన పెండిలిని గురించి చెప్పుము" అని వెంకటరాయశాస్త్రిల వారున్ను, ఇతరులున్ను అర్థము చెప్పినారు. కాని, ఇది చాలా దూరాన్వయముగా కనబడుతున్నది. 'ఏను' పదమునిమీదను, 'పిన్నది' అనే పదమునిమీదనుకూడా సముచ్చయచిహ్నము లోపించడముచేత ఈ అవస్థ పట్టినది. లేదా, "ఏను మున్ను దాల్చిన మాల్యమిచ్చు నాపిన్నది (పిన్నదానికి) రంగమందయిన పెండిలిని గురించి చెప్పుము" అని అయినా అర్థము చెప్పవచ్చును. వాక్యవిన్యాసము ననుసరించి యిట్లే అర్థము చెప్పవలసి ఉన్నది. మరేవిధముగా చెప్పినా క్లిష్టదూరాన్వయము సంభవించి దోషము కలుగుతుంది. ఆపిన్నది మాల్యమును శ్రీరంగభర్తకు సమర్పించిన విషయ మిచ్చట ప్రధానము. కాని, గ్రంథములో ఆమె అట్లు సమర్పించిన విషయానికి కవి ప్రాధాన్యము నివ్వలేదు. ఆమె శ్రీరంగభర్తను పూజించిన విధానమును కొంత వివరించి చెప్పినా దానిలో మాల్యదానమును ప్రత్యేకించి చెప్పలేదు. ఆమె యర్చావిధాన మిది:

"బోటిగట్టిన చెంగల్వపూపుటుత్తుఁ,
దరుపరిణతోరుకదళమంజరియుఁ గొనుచుఁ
బోయి, గుడి నంబి విజనంబుఁ జేయఁజొచ్చి,
మ్రొక్కి, వేదికఁ బలువన్నెముగ్గు వెట్టి,
కపిలగవిసర్పిఁ బృథుదీపకళికఁ దీర్చి,
ద్వయముతో వక్షమునఁ గల్వదండ సేర్చి,
యగరుధూపంబు లిడి శర్కరాజ్యయుక్త
హృద్యకదళీఫలాళి నైవేద్య మొసగి,
ఖండితపూగీ నాగర
ఖండంబులు ఘనశశాంకఖండంబులచే
హిండితమగు తాంబూల మ
ఖండస్థిరభక్తి నొసగి కదలి చెలులతోన్,
చెలువ గర్భగృహప్రదక్షిణముఁ జేసి
వినతయై శఠకోపమును ధరించి
చరణతీర్థముఁ గొని, తత్ప్రసాదలబ్ధ
మయిన మాల్యముఁ దాల్చి గేహమునకరుగు.
ప్రతిదినము నిట్లు చని య
చ్యుతపూజ యొనర్చి వచ్చి సుదతి వియోగ
చ్యుతధైర్య యగుచు నయ్యదు
పతిగుణములు ద్రవిడభాషఁ బాడుచు
నుండున్"

పై పద్యములలో శ్రీహరివక్షమున ఆమె కల్వదండను చేర్చినట్లున్ను, తత్ప్రసాదలబ్ధమయిన మాల్యమును దాల్చినట్లున్ను మాత్రమున్నది. శ్రీహరి 'ప్రియాపరిభుక్తభాక్' ఎట్లయినాడో, గోదాదేవి 'ఆముక్తమాల్యద' ఎట్లయినదో యిచ్చట వివరింపబడలేదుగదా! 'ప్రియాపరిభుక్తభాక్' అంటే 'ప్రియాపరిభుక్తమాల్యభాక్' అని అర్థమును కవి ఉద్దేశించినట్లు కనబడుతుంది. లేదా, 'పరిభుక్తప్రియాభాక్' అనబోయి అత డిట్లన్నాడా? తాను ముందుగా ధరించిన మాల్యమును గోదాదేవి శ్రీహరికిచ్చినదని కవి యెక్కడా చెప్పలేదు. లేదా, ముందుగా శ్రీహరి ధరించిన మాల్యమును తాను ప్రసాదముగా గ్రహించి దానినే తిరిగీ ఆమె శ్రీహరికి సమర్పించేదా! "ఏ మును దాల్చిన మాల్య మిచ్చు నప్పిన్నది" అనేదానినిబట్టి ఈ అర్థము స్ఫురిస్తున్నది. కాని, పూజావర్ణన సందర్భములో "తత్ప్రసాదలబ్ధ

మయిన మాల్యముఁ దాల్చి గేహమున కరుగు" నని మాత్రమే చెప్పబడినదిగాని దానిని తిరిగి శ్రీహరి కిచ్చినట్లు లేదు. కాని, పూజావర్ణనానంతర మున్నట్లుండి కవి —

"మొదల నాముక్తమాల్యద మదనతాప
తరణి వెనువెట్ట వేఁగిన దక్షిణాశ
మత్కృతోష్మకుఁ దుదముట్టమాఁడుననుచుఁ
దొలఁగెనన నుత్తరాశకుఁ దొలఁగె తరణి"

అని వసంతర్తువర్ణనము నెత్తుకొన్నాడు. ఇక్కడ నేమయినా గ్రంథపాతి మున్నదేమో అని నాకు సందేహము. లేకుంటే ఇంతటి అవ్యవస్థ యేర్పడదు.

గోదాదేవి 'ఆముక్తమాల్యద' అనిన్ని, రంగేశుడు 'ప్రియాపరిభుక్త (మాల్య) భోక్త' అనిన్ని కవి ఉద్దేశించినట్లు స్పష్టమే. ఆమె పరిభుక్తమై, ఆముక్తమైన మాల్యమును రంగభర్త కిచ్చినదని మన మనుకోవలెను. అంటే, తాను బాగుగా అనుభవింపగా, వాడిపోయి పనికి రాకపోవుటవల్ల సంపూర్ణముగా త్యజించిన మాల్యము నామె సమర్పించిన దన్నమాట. పరి, ఆఙ్ అనే ఉపసర్గలవల్ల ఈ అర్థము తేలుతున్నది. అట్టి మాల్యము నిచ్చినా, మున్నొకమగవాడు (సుదాముడు) చక్కని, పరిమళిస్తూ ఉన్న, వాడని నవ దండ నివ్వగా దానిని 'ఏవాతో' గ్రహించినవాడు, ఇప్పుడొక ఆడుది, యౌవనవతి, సుందరి, ప్రియురాలు, తనకోసము పసమైనది, ద్రావిడి, ఇచ్చినది కాబట్టి, ఒక మగవాని చేతినుంచి పూలమాలను గ్రహించిన అరసికతాదోషమును, కొదువను తీర్చుకొనడానికి 'రంగేలా' అయిన రంగనాయకుడు 'శింగరంగా' అని ఆపూలమాలనే కాకుండా పూబోడినికూడా పరిగ్రహించినాడు. అదీ, ఆమెకూడా అప్పుడు 'పరిభుక్త' లయినారు.

అయితే మాల్యదానకథకోసము కృష్ణరాయడు కావ్యమును వ్రాయలేదు. కథావిన్యాసమువల్ల రసోత్పాదనము చేయుడానికి కూడా అతడు ప్రయత్నించలేదు. ఆముక్తలోని రసము శృంగారమా? కాదు. విష్ణుచిత్తునిలో ఏమి శృంగార మున్నది? యామునునిలో ఏమి శృంగారమున్నది? ఖాండిక్యకేశిధ్వజులలో ఏమున్నది? మాలదాసరిలో ఏమున్నది? బ్రహ్మరాక్షసునిలో ఏమున్నది? గోదాదేవి విరహతాపవర్ణనమును చేసినంతమాత్రమున శృంగారరస ముట్టిపడిం దనవచ్చునా? ఆమెమీద రంగేశునికి గల మక్కువవర్ణన మేదీ? ఒక సీసపద్యములో అత డామెఅంగసౌందర్యమును వర్ణించినంతమాత్రమున సరిపోతుందా? పోనీ, వైష్ణవసంప్రదాయములో భక్తి శృంగారమునకు పర్యాయవాచకము కాబట్టి గ్రంథములో భక్తిరసము ప్రధానమైన దందామా అంటే, అదికూడా సుస్పష్టముగా కనబడదు. విష్ణుసర్వోత్తమత్వ స్థాపనముకోసము చేసిన తర్కవాదము భక్తిరసస్ఫోరకము కాజాలదు.

ఆముక్తమాల్యదలో నాయికానాయకనిర్ణయము కూడా సందిగ్ధవిషయమే. కవి అన్నాడుకాబట్టి చూడికొడుత్తనాంచారున్ను, రంగమన్నారున్ను నాయికానాయకులని అనుకోవలసినదే కాని, కావ్యమును బట్టి యీవిషయమును నిర్ణయించలేము. కథలో వస్త్వైక్యము కుదురలేదు. ఈ విషయములో మనుచరిత్రకు పట్టిన అవస్థే ఆముక్తకున్ను పట్టినది. రెండు గ్రంథములున్ను వేర్వేరు చిన్నకథల సంపుటులే. ఆ చిన్నకథలను చెప్పేతీరులో మనుచరిత్రకారు డెక్కువ నేర్పు చూపినాడు. ఆముక్తమాల్యదాకర్త కానేర్పు లేదనే చెప్పవలెను.

ఆముక్తమాల్యదా వైశిష్ట్యమునకు కారణము దాని నామకరణ మొకటి అని చెప్పినాను. కూలంకష సంస్కృతపాండిత్యప్రకటనము, తెలుగునుడికారపుసొగసు, శాస్త్రోక్తులలో లోకోక్తుల విన్యాసము, వర్ణనముల ఉన్నతి, అద్భుతానల్ప కల్పనల శిల్పము, అలంకారముల లాలిత్యము, లోకానుభవ సమృద్ధి — ఇవి గ్రంథములోని చక్కని విశిష్టగుణములు. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదనము, రాజనీతివిస్తరము అనేవి కథతో ఆనుషంగికముగా ప్రసక్తములయి రాయల అపూర్వజ్ఞాన ప్రత్యేకతను తెలిపే విషయములు. వీటినిగురించి మరిఒక వ్యాసములో ముచ్చటింప ప్రయత్నిస్తాను.

క్రిందటి-ఏప్రిలు భారతిసంచికలో శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారు వ్రాసిన వ్యాసమునకు ప్రముఖస్థానము నిచ్చి పత్రికాధిపతులు ప్రకటించడముచేత,

ఈవిషయమై ఇంకా చర్చచేయవలసినదిగా తద్విషయాభిమానుల నాహ్వానించిన తలంచి ఈవ్యాసము వ్రాయ నుపక్రమించినాను. ఏమైనా ఆవ్యాసమును చదువగానే నామనస్సునకు చురుక్కుమన్నది.

కృష్ణరాయడా, పెద్దన్నయా ఆముక్తను వ్రాసినది అనే చర్చ క్రొత్తది కాదు. కృష్ణరాయడా గ్రంథము వ్రాయలేదన్నవారికి గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమ 'కవిజీవితముల'లో చక్కని సమాధానముల నిచ్చినారు. చర్వితచర్వణముగా ఇంకను దంపడమువల్ల ప్రయోజనము లేదు. శ్రీనీలకంఠశాస్త్రిగారి ఇప్పటి క్రొత్తవాదములోని ముఖ్యవిషయాలనుమాత్రము పరామర్శించవలసి ఉన్నది:

ఆముక్తమాల్యద వీరవైష్ణవతత్త్వ ప్రతిపాదకము. పెద్దన్నకాని, కృష్ణరాయడుకాని వీరవైష్ణవులు కారు. అందుచేత ఎవడో మరోవాడు వీరవైష్ణవుడు దీనిని వ్రాసిఉండవలెనని శాస్త్రిగారు వ్రాసినారు.

ఆముక్తలో ప్రతిపాదింపబడినది విశిష్టాద్వైత సిద్ధాంత వ్యతిరిక్తమైన వైష్ణవమేమో తరువాత విచారింతాము. కాని, సంపూర్ణముగా వైష్ణవుడైనవాడే వైష్ణవకావ్యమును వ్రాయవలెనా? రామకృష్ణాదుల కథలను, వైష్ణవపురాణములను రచించిన వైష్ణవేతరకవులు లేరా? వారు విష్ణుసర్వోత్తమత్వమును తమ గ్రంథములందు స్థాపింపలేదా? ఆముక్తలో విష్ణుభక్తి మహిమ వివరింపబడినదేకాని, శివనింద ఎచ్చటనైనా ఉన్నదా? వైష్ణవకథను వ్రాస్తూఉన్నప్పుడు తత్సంప్రదాయానుసారముగు వర్ణనములనుమాత్రము చేయడమువల్ల దోషముకలుగుతుందా? గ్రంథరచనవల్లనే తత్కర్త మతము నూహింపవచ్చునా? ఆముక్తను పెద్దన్న రచింపలేదని అతని శైవ, వైష్ణవాభిమానము మూలముగాగాక ఇతరవిషయములుగా రుజువుచేయవచ్చును. కృష్ణరాయడు దానిని రచించినాడనికూడా ఇతరవిషయములుగానే రుజువుచేయవచ్చును. కృష్ణరాయనికి శైవక్షేత్రములమీద ఎంత గౌరవమో వైష్ణవక్షేత్రములమీద కూడా అంత గౌరవమున్నదనడాని కాతని దానశాసనములే ప్రబలసాక్ష్యములుగా ఉన్నవి. రాయలకు శైవ వైష్ణవక్షేత్రములు రెంటిమీదను సమానమైన గౌరవమున్నదని రాయవాచకములోని ఈ క్రింది యాత్రాచర్యవల్ల తెలియవస్తున్నది:

"తిరుపతికి వచ్చి అలమేలుమంగాసమేతులైన కల్యాణవేంకటేశ్వరుల దర్శనంబు చేసి, రొఖ్ఖరూపాయలు కానుకచేసి, సకలభూషణములున్ను స్వామికి సమర్పించి, ఆస్థలాన షోడశమహాదానాలున్ను చేసి సన్నిధిని నిత్యసేవగా అంజలిపుటులై పూర్వద్వార మండలి పుభయపార్శ్వములా తిరుమలదేవీ చిన్నాదేవీ సహితంగా వుండేటట్టుగా తామ్రశాసన ప్రతిబింబమును చేయించి స్వామికి రెదురుగా నిలిపి, (౨) అందుండి కాళహస్తికి వచ్చి, స్వామిని దర్శించి, కానుకలున్ను నవరత్నాభరణములున్ను సమర్పించి, శ్రీముఖసంవత్సరం ఆశ్వీజ శుద్ధ ౧౨ దినములు రాదిగాగల వస్త్రములున్ను గ్రామాదులున్ను సమర్పించి, స్వామిసన్నిధిని షోడశమహాదానాలున్ను చేసి, అవ్వారిగా సత్రములున్ను కలుగచేసి, (3) అక్కడుండి త్రిపురులచేత పూజకొన్న త్రిపురస్థలాలకున్ను పోయి స్వామిదర్శనంచేసి, నంద్రీశ్వరదర్శనంచేసి, (౪) అళగరుగుడిక్కివచ్చి, మీనాక్షీదేవినిన్ని చొక్కనాథస్వామినిన్ని త్రిసంధ్యలయందున్ను సేవించ్చి కానుకలుచేసి, అనేకభూషణములు సమర్పించ్చి, అమ్మవారిక్కి వజ్రాలకమ్మలున్ను వైడూర్యపుపతకములున్ను పచ్చలకమ్మలున్ను ముత్యపుముక్కరాలున్ను సమర్పించి, త్రిరాత్రుల్లుపవాసము చేసి, (౫) శ్రీవల్లిపుత్తూరికి వచ్చి చూడుకొడుత్తునాచ్చారు సమేతముగా సంపెంగిమన్నారుస్వామిని సేవించి తిరుముక్కు కెంపుల వొడ్యాణం బంగారునూపురములున్ను, నవరత్నకీలితమైన సిహ్మాసుఖం ప్రభలున్ను సమర్పించి, గుంటతోవ్వించి, రాతికట్టానకున్ను నడిమి మంటపానకున్ను లక్ష మాళ్లు యిప్పించి, (౬) కరువనల్లూరికి వచ్చి..."

కృష్ణరాయనికి మాల్యదానకథ మనస్సునకు వచ్చింది. అందుచేత దానిని వ్రాసినాడు. అంతేకాని వీరవైష్ణవుడు కావడముచేత వ్రాయలేదు.

ఆముక్తమాల్యదలో వర్ణింపబడిన వైష్ణవమునకు వీరవైష్ణవ మని ఎందుకు పేరు పెట్టుతున్నారో తెలియదు. దానిని నిందించడానికై ఉంటుంది. పన్నిద్దరాళ్వారులస్తుతిని వీరవైష్ణవులే చేయరు; వైష్ణవు లందరున్నూ చేస్తారు. సిద్ధాంతవిషయములో వైష్ణవము నకున్నూ, వీరవైష్ణవమునకున్నూ భేదములేదు.

విష్ణుచిత్తు డజ్ఞాతకులశీలుడు కాడు. అతడు విప్రవరుడు.

"అనిన వడవడ వణఁకి సాష్టాంగ మెఱఁగి
సమ్మదాశ్రులు పులకలు ముమ్మరింప
వినయవినమితగాత్రుఁడై విప్రవరుఁడు
వెన్నునకు భక్తి నిట్లని విన్నవించె"

[ఆ. ౨-౮౯]

అనే పద్యమును వీలకంఠశాస్త్రిగారే ఉదాహరించి, విష్ణుచిత్తు డజ్ఞాతకులు డని యెందు కన్నారో తెలియలేదు. అతడు చదువుకోననివాడు కూడా కాడు. అతడు "ఉరు, చ్ఛందోబృందతదంతవాగపరనా సంజాత తజ్జన్య ని, ష్పందద్వైత సుసంవిచాలయుఁడు." అంటే, కష్టపడి చదువుకో నక్కరలేకుండానే అతనికి చక్కని జ్ఞానము సహజముగా కలిగినది. అతడు "అశ్రాంతయోగాండూబద్ధముకుంద్వపద్వరదుఁడు." ప్రహ్లాదునివంటివా డన్నమాట. కవి యిట్లన్నాడని అతడు మూర్ఖుడు, గురుముఖతః ఏమీ చదువుకో లేదని నిందింపవచ్చునా ?

గోదాదేవికూడా అజ్ఞాతకులశీల కాదు. ఆమె సత్యభామ అపరావతారము :

"......... ఎఱుక
మొదఁ గలిగెనేని యెఱిఁగింపుఁ డేను మొదల
నెవ్వతె"

నని ఆమె సఖుల నడుగగా,

"దివిజద్రుప్రసవంబుఁ గాంచిన సప
త్నిం జూచి, చూపోప, కిం
తవు జిల్గుంబని యంత నేసి, మది నీ
ష్యాక్రోధముల్ సందడిం
ప, విరింబోక, ద్రుమంబుఁ గైకొని, పతిన్
మందన్న ప్రామానెల్లఁ దే
నవధింబెట్టిన సత్య వీవహహా! కా
వా, భామినీ! ..."

అన్నారు.

ఇక మాలదాసరికి కైశికీరాగగానముచేత భగవదనుగ్రహము కలిగినదంటే, శాస్త్రిగారికి ఓర్వలేమి ఎందుకో? మాలదాసరియే కాదు, అంత్యజాతివాడయినా, కైశికీరాగాలాపనచేతనే కాదు, కూనురాగాలాపనచేతనయినా, నిజమయిన భగవత్ప్రపత్తి గలవానికి తప్పకుండా భగవదనుగ్రహము కలుగుతుందని వైష్ణవ సంప్రదాయప్రసిద్ధము. కృష్ణుడు చాయకు సుదాముల ననుగ్రహించ లేదా ? జగన్నాథుడు కుబ్జనుకోరథము నీడేర్చలేదా ? ఇది శాస్త్రిగారి కిష్టమే. మాలదాసరి ననుగ్రహిస్తేనేనా కోపము ?

బ్రహ్మరాక్షసుని కథమూలముగా కవి బ్రాహ్మణ నింద చేసినాడని శాస్త్రిగారి అపవాదము. ఎట్టి బ్రాహ్మణుని నిందచేసినాడో మాత్రము వారెత్తుకోన్నారుకారు. చూడండి: శాస్త్రిగా రెట్టి బ్రాహ్మణుని పక్షము వహించి, కృష్ణరాయని నిందించినారో! —

"ఉండుదుఁ జోళభూమి నొక
యూరఁ గళల్ పదునాల్గు నేర్చి, వా
క్చండిమఁ జర్చ గెల్తు ఘట
శాసుల, శ్రోతులఁ దప్పపట్టుదుక్,
ఖండలముష్టి విప్పఁ గని
నవ్వుదు, వెండి ప్రయోక్తలక్ సుధీ
మండలి గ్రాంథికత్వ మవ
మానము సేయుదు జల్పవాదినై.

మదాంధుండనై — యల్పవిద్యాలబ్ధి..
...అచ్చదువె పరబ్రహ్మంబై, పెద్దలం జెనకి మోడియు సరిమైతిననియును, సరిపోయి

జయించితినని యసబద్ధంబులాడి, చిల్లర ప్రభువులం భ్రమియించుచుండి, దీక్షితులం జూచి యీసు పొడమి, ద్రవ్యభిక్షార్థినై మధురకుం బోయి, యప్పురంబున—

బహిఃపద్ధద్విజాన కల్పపుఁ బూచితం బిడి,
పసిఁడికై తా వాని బంతిఁ గుడిచి,..."

ఎంతటి అచ్చమైన బ్రాహ్మణుఁడు! ఇతనిని నిందించినందుకా శాస్త్రిగారి కింతటి యాగ్రహము? ఇందుకా కవి వీరవైష్ణవుడు కావడము?

మాలదాసరిమూలముగా ఈ బ్రాహ్మణబ్రువుడు భాగవతశ్రేష్ఠుడై, బ్రాహ్మణశ్రేష్ఠుడై వెలసినాడు.

"స్నిగ్ధత్రిభాగముండితశిరశ్శిఖతోడ
హేమధవళోపవీతములతోడఁ
బుణ్యపద్ద్వితయోర్ధ్వపుండ్రవల్లులతోడఁ
దులసికాబ్జస్రగావళులతోడఁ
గాపీనకటిసూత్రకాషాయయుగితోడ
జలపూర్ణశుభకమండలువుతోడఁ
బాణిస్థదివ్యప్రబంధసంపుటితోడ
నుత్తరవాక్పూర్వకోక్తితోడఁ
బసిఁడిజిగితోడ బ్రహ్మవర్చసము వొల్చు
భాగవతలక్ష్మితో ధూమపటలినుండి
వెడలు శిఖవోలె నమ్మేను వెడలి, చూడఁ
జూడ వైష్ణవుఁడై నిల్చె సోమశర్మ."

మాలదాసరిమూలముగా అతడు బ్రాహ్మణత్వము నొందినాడని మనము వగవ నక్కరలేదు. వాల్మీకి మూలముగా లోకము తరించలేదా?

ఆముక్తమాల్యదలో ప్రతిపాదింపబడినది వీరవైష్ణవము కాదు; విశిష్టాద్వైతసిద్ధాంతము. అది శ్రుతినిబద్ధము.

"విద్వద్వందితుఁ డాతఁ డిట్లు సుఖసం
విత్తత్త్వబోధైకచుం
చు ద్వైపాయనసూత్రసచ్ఛ్రుతుల నీ
శున్ మున్నిరూపించి, పైఁ
దద్విష్ణుత్వము, దాని కన్యదవిప
ద్వ్యావర్తనంబున్, విశి
ష్టాద్వైతంబును దేఁటగాఁ దెలుప మా
టాడెం బ్రమాణంబులన్"

ఎవరు? విష్ణుచిత్తుఁడు, కృష్ణదేవరాయనినోట, ఇక నీ వీరవైష్ణవవాదము మళ్లీ లేవదనుకొంటాము.



# నవ్వువచ్చింది

శ్రీమతి వట్టికొండ విశాలాక్షి

నాలోన నా కెంతో నవ్వు వచ్చింది,
న వ్వేల నని నేనె నవ్వుకొన్నాను.

ప్రణయగీతము నల్ల పాడుకొనుసమయాన
సరసమున పావురాల్ సౌధాగ్రభాగాన
మోము మోమున జేర్చి ముద్దులాడుచునుండ
నాలోన నా కెంతో నవ్వు వచ్చింది,
న వ్వేల నని నేనె నవ్వుకొన్నాను.

పావురాలే ఇంత ప్రణయమహిమము నెరుగ
ప్రేమనే కాంక్షించి ప్రేమనే నిరసించు
మనుజలోకము నాడు మదికి స్ఫురియింపగా
నాలోన నా కెంతో నవ్వు వచ్చింది,
న వ్వేల నని నేనె నవ్వుకొన్నాను.

ఆడువా రెవరైన అతిపరిచయముతోడ
సంచరించెడుచారి సంకుచితదృష్టితో
పాడులోకములోన ప్రజలు చూచుచునుండ
నాలోన నా కెంతో నవ్వు వచ్చింది,
న వ్వేల నని నేనె నవ్వుకొన్నాను.

గంపంత ఆశతో గగనాంతరాళాన
అసదృశంబైన సౌధాళి నిర్మింపగా
గాలి వీచినతోనె గబగబా పడిపోవ
నాలోన నా కెంతో నవ్వు వచ్చింది,
న వ్వేల నని నేనె నవ్వుకొన్నాను.

---

సాహిత్య విమర్శనము:



# ఉత్తరా పరిణయము: తిక్కన తత్తరపాటు

శ్రీ కోరాడ రామకృష్ణయ్య

ఇది యొక సంధియుగము. ప్రాతక్రొత్తల కలయిక. ప్రపంచ మెల్లెడల వెనుకటి భావములు, ఆదర్శములు మారుచున్నవి. క్రొత్తక్రొత్త భావములు తలలెత్తుచున్నవి. అట్టిసమయముల వీనికి గొంత సంఘర్షణము తప్పదు. మన దేశమున మతాచారముల లోను, ఆర్థిక సాంఘిక జీవిత పరిస్థితులలోను, రాజకీయాది విషయములలోను వెనుకటిభావములకును, ఆధునిక భావములకును సంఘర్షణము బయలుదేరి వానిలో ననేకవిధములగు మార్పులు కాలానుగుణముగ కలుగుచున్నట్లే మన సాహిత్యరచనారీతులలోను, తద్విమర్శన పద్ధతుల విషయములోనుగూడ కొంత సంఘర్షణము, కాలానుగుణమగు మార్పు పొడసూపుచునే యున్నవి. మనకు పాశ్చాత్య విద్యాసంపర్గము కలిగిన తరువాత సాహిత్యాభివృద్ధి మార్గములందునవలెనే సాహితీ విమర్శన పద్ధతులందును నూతనఫక్కి యవలంబింపబడుచున్నది. ప్రాతపద్ధతుల కలవాటుపడిన పండితకోటికి కాలానుగుణముగ నాంగ్లవిద్యతో వచ్చిన నవ్యసాహిత్యవిమర్శనరీతు లన్నను, దానిని ప్రతిపాదింపజాలు నాంగ్లవిద్యాపట్టభద్రు లన్నను ఒకవిధమగు ననాదరభావము, నసహిష్ణుతయు కలుగుటలో నాశ్చర్యము లేదు. కాని పలువు రీరీతుల సమన్వయమార్గము నారయ యత్నింతురు. కొందరు భేదబుద్ధిచే ముందు వెనుకలు కానలేకుందురు. సాహిత్యము సామాన్యముగా నాలంకారికనియమానుబద్ధ మగునా, కాదా యను పరిశీలనముతోనే తృప్తినందుట వెనుకటిపద్ధతి. ఆయా దేశకాలములందలి జాతివ్యక్తుల జీవితపరిస్థితు లాయా వాఙ్మయములందు,కృతులందు నెట్లు ప్రతిబింబించినవో, ఆయాకవుల మహత్త్వ మెట్టిదో, వారి జీవిత

చరిత్రకును, వారి కృతిరచనకును గల సంబంధ మేమో పరిశీలించుచు, తత్తద్విశేష సమన్వయపూర్వకముగనే సాహిత్య విమర్శనమును నడుపవలయు నను భావము లిటీవల ప్రబలుచున్న వనుటకు సందేహము లేదు. దీనినే చారిత్రాత్మకము, తులనాత్మకము నను విమర్శనమని చెప్పుచున్నారు. ఇంకను సాహిత్యవిమర్శనమునకు (శాస్త్రజ్ఞానముతోపాటు) సహృదయత్వ మత్యావశ్యకము. కవిహృదయమును గ్రహింపగల సత్త్వము, విశాలహృదయము, సుహృద్భావము పెంపొందించుకొనవలయును గాని, సద్విమర్శకుడు స్వేష్టానిష్టములకు లొంగిపోయి దురాగ్రహపూరితుడు, దోషైకదృక్కు కాగూడదు. స్వీయానుభవపరిపాటికి భిన్నములై తన దృష్టికి గోచరింపని విషయములను గూర్చి కవిపై నెపము పెట్టరాదు. ఒకకవి యొక విషయమున గొప్పవాడు కావచ్చును. మఱియొకడు మఱియొక విషయమున మఱింత గొప్పవాడు కావచ్చును. ఆయా కవుల మహత్త్వము, విశిష్టగుణములు నెట్టివో పరిశీలించి దేశకాలానుగుణముగ వారివారి జీవిత తత్త్వమున కనుకూలముగ చారిత్రకదృష్టితో వానిని సమన్వయించి వివరించుటయే సద్విమర్శకుడు చేయదగినపని. ఈతడు స్వేష్టానిష్టములకుగాని, యహంభావమునకుగాని చోటిచ్చినచో కవిహృదయమును గ్రహించుట కష్టతరము కాకమానదు. విమర్శకుడు ఎదుటివాని భావమును గ్రహింపక యహంభావమునే ప్రకటింపజూచినచో సాహిత్యప్రపంచమున సద్విమర్శనము కొఱవడుననుటకు సందేహము లేదు. సద్విమర్శనమనునది స్వీయేష్టానిష్టప్రకటనము కారాదని సాహిత్యతత్త్వవేత్తలమతము. కవిహృదయమును గ్రహించుటకు వలయు సహృదయత్వమే ఒక సాహిత్య విమర్శకుని విమర్శన పద్ధతిని, అతని దృక్పథమును గని పట్టుటలోగూడ మిగుల నావశ్యకమగుచుండును. ఒక విమర్శకుని భావములు తనకు నచ్చనంతమాత్రమున నా విమర్శకునికేకాక యామహాకవినిగూడ దెగనాడు కొందరు సాహిత్య విశారదుల సహృదయత్వము నేమన వలెను? అట్టి విమర్శనలు కొన్ని యిటీవల సాహితీ పత్రికలలోనే పొడసూపుచుండుట మిగుల శోచనీయమగు విషయము. ఉత్తరా పరిణయ కథారచనా సందర్భమున *తిక్కనార్యుని కాపాదింపబడిన తత్తరపాటెందులకో నిదర్శనము కాగలదు.

ఆంధ్రభారతము విరాటపర్వమున ఉత్తరా వివాహవర్ణనము నాటకకళాశోభితమై తనరారుచున్నదనీ, ద్రౌపదీపాణిగ్రహణరంగమున నన్నపార్యుడట్టి విన్నాణమును బ్రదర్శింపలేదనీ ఒక సోదరుడన్నాడట. ఆ మాట విన్నతోడనే సాహిత్యవిశారదుడగు మఱియొక సోదరున కావేశము కలిగినది. వెంటనే దీని సారము నరయుటకై పరిణయద్వయమును మఱియొకమారు సావధానముగా తరచి చూచినారట సాహిత్య విశారదులు. తరవగా తేలిన దేమంటే 'తిక్కనార్యుని తత్తరపాటు.' ఆంధ్రావళి యెల్లను ఆదరభావముతో చిత్తగించండి!! ఖేదమో, మోదమో అవలీలగా

ఒక సత్య విమర్శక సోదరుడు చేసిన దేమిటంటే, తిక్కన ఉత్తరావివాహవర్ణనఘట్టాన్ని నన్నయ ద్రౌపదీవివాహ సందర్భముతో సరిపోల్చ యత్నించి నన్నయ రచనా సందర్భములో లేని ఆంధ్రదేశీయ వైవాహికాచారములను గొన్నిటిని మూలములో లేకున్నను తిక్కన విశేషముగా వర్ణించి తన జాతీయాభిమానమును వ్యక్తపఱచినాడు అని అన్నాడు. దీని కర్థము తీసినారు సాహిత్య విశారదులు — "ఒకటి (తిక్కన రచన) గగనరంగమునకును, వేఱొకటి (నన్నయరచన) పాతాళకుహరమునకును ప్రయాణము చేయుచున్నట్లు" తెలిపినాడని. దీనివలన వీరు సాధింపనెంచిన దేమి? ఆ విమర్శకుడు నన్నయ నసమానుడగు కవినిగా జేసి తిక్కన వాక్యాళరంగమున కత్తినేయుచున్నాడు చూచినారా అని చదువరుల కొక దురభిప్రాయమును కలిగించుటయే. దేశకాలపరిస్థితులనుబట్టిగాని, ఆయా కవుల దృక్పథములందలి భేదమునుబట్టిగాని సమాన ఘట్టములలోనే కవుల వర్ణనారీతులు భిన్నములై యుండవచ్చును. ఈ వర్ణనారీతులను బట్టియే వారి దృక్పథముల నొకప్పుడు మనము

* ఉత్తరాపరిణయము. ఆం. సా. ప. పత్రిక. ౨౭ సం. ౬ సంచిక.

గ్రహింపవలసియుండును. ఆయాకవుల రీతులయందును, మహత్త్వమునందును గల భేదమును నిరూపించినంత మాత్రమున నొక కవి యధముడనిగాని, మఱియొక డుత్తము డనిగాని చెప్పిన ట్లగు ననుకొనుట సాహసము. సాహిత్యవిమర్శనమునకు ప్రధానలక్షణము కవి హృదయావిష్కరణము, కవిమహత్త్వమును గనిపట్టుటయు నే గాని, గుణదోషోచ్చారణము సల్పి తీర్పు చెప్పుట గాదు. సుప్రసిద్ధకవులలో నొక్కొక్క రొక్కొక విషయమున దన మహత్త్వమును జూపిన మఱియొకడు మఱియొక విషయమున మహత్తరుడు గావచ్చును. నన్నయ రచనాప్రాగల్భ్యము నొకడు ప్రశంసింపవచ్చును. తిక్కన కళావైదగ్ధ్యమున కొకడు ముగ్ధుడు గావచ్చును. పోతనభక్తిపారవశ్యమున నొకడు మైమఱువవచ్చును. శ్రీనాథుని పాండిత్యప్రకర్ష కొకడు పరవశుడు గావచ్చును. సూరనకల్పనాశిల్పమున కొకడు మురిసిపోవచ్చును. ఎవరి గొప్ప వారిది. సమానఘట్టములను బోల్చి చూచినపుడు ఎవ్వ రేవిషయమున నెట్టి చాతుర్యమును గనబరచిరను విషయమును బరిశీలించి వారివారి మహత్త్వముల నెన్నవలసినదే గాని, యొక డుత్తముడు, ఒక డధముడు నని యింతమాత్రముచే నిర్ణయింప సాధ్యమగునా? తిక్కన దేశీయాచారములను గొన్నిటిని విశేషముగా వర్ణించినా డన్నంతమాత్రమున నన్నయ కంటె గొప్పవా డని చెప్పిన ట్లెంచవలెనా? తిక్కన నన్నయకంటె దేశీయపదప్రయోగమును విశేషముగా జేసినా డన్న, నది యాతని దేశీయపదాభిమానమును చాటునే గాని నన్నయకు లోప మాపాదించినట్లుగాని, అతడు తిక్కనకంటె తక్కువవాడని చెప్పినట్లు గాని యెట్లగును? నన్నయ సంస్కృతపు పలుకుబడిని విశేషముగ నాదరింప, తిక్కన తెలుగుపలుకుబడియందు విశేషాభిమానము చూపెనని చెప్పినచో నది వస్తుస్థితికథనమే యగును గాని తారతమ్యపరీక్ష కెట్లు సహకారి కాగలదు? దానివలన నన్నయమహనీయతకు లోపము ఎట్లు వచ్చును? నన్నయ ప్రయోగించిన కొన్ని తెలుగు పలుకుబళ్లను, తిక్కన ప్రయోగించిన కొన్ని దీర్ఘ సంస్కృత సమాసములను చూపినంతమాత్రమున నా వస్తుస్థితిని ప్రత్యాఖ్యానము చేసినట్లగునా? ఇతర కారణములచే నొకరియందు మనకు గలుగు ప్రత్యేకాభిమానము యథార్థమగు వస్తుస్థితినిగూడ గుర్తింపలేనంతటి యంధులనుగా మనలను జేయనీయగూడదు. ఆదికవి యగు నన్నయయందు, ఆతనిరచనయందు ప్రత్యేకాభిమాన ముండుట యాంధ్రుల కెల్ల సహజమే. కాని యది యితరకవుల మహత్త్వమును గుర్తింపనీయనంతటి దురభిమానముగా పరిణమింపగూడదు. కొందఱియెడల నిది తిక్కనార్యునికి దత్తరపాటు తెచ్చిపెట్టుటకు దగిన కారణమగుట మిగుల శోచనీయము.

ఈ తత్తరపాటునకు గారణమైన తిక్కనరచితోత్తరాపరిణయకథను సావధానముగా బఠింపగా మన సోదరునకు దొలుత పొడకట్టినది 'అనవసర విషయ కల్పనము.' అదేమిటయ్యా అంటే? విరటు డుత్తరను విజయున కిచ్చి గారవింప మంత్రులనుమతముగా నామెను కొలువునకు రప్పించుటయట. "అసలీభాగము వ్యాసభారతమున లే" దట. "తిక్కన కవివరునిచే క్రొత్తగా సృష్టింపబడిన తిక్కయే యి"దట. "అందు లేకున్నను పసందుగా నుండుటచే నిందు బొందుపఱచె నందుమా అట్టి యందమేదియు బొడకట్టుటలే"దట వీరికి. "పైగా నీకల్పన మనవసర ప్రసంగముగా జూపట్టుచున్న"దట. "మూలచ్ఛేదీ తన పాండిత్యప్రకర్షః" అన్నట్లున్నది.

తిక్కనార్యుని పొడవడగింప యత్నములో నున్న వీరి కాతని రచనలోని యంద మెట్లు పొడగట్టును? తిక్కకవికి తత్తరపాటు నాపాదింపదలచినపుడే వీరికిని దత్తరపాటు గదిరినది. వ్యాసభారతమును సావధానముగా వీరు జూచినారా? చూచియే యున్నచో వీరికదె కనబడకపోవు టేమిటి? దృష్టి కందనపుడు చేయదగినదేమి? తర్కమే కదా? కావుననే వీరిదృష్టిలో నిది తిక్కకవిసృష్టియగుట తటస్థించినది.

వాస్తవముగా నిందు తత్తరపాటుగదిరినది వీరికే గాని తిక్కనకు గాదు. ఏల యనగా, నిది సమూలమే గాని తిక్కనసృష్టి కాదు గనుక. ఆతడు చేసిన అనవసరకల్పనముకూడ లేదు.

ఇక్కడ నొకవిషయము గమనింపవలసియున్నది. వైవాహికపర్వములో తొలుత విరటు

డుత్తరను పాండవులందరు నున్న కొలువునకు రప్పించినది వివాహసందర్భమున గాదు. పాండవులు ప్రచ్ఛన్నులై యుండియు తమకుచేసిన మహోపకారమును దలచియు, తాము తెలియకయే వారియెడల జేసిన యపచారములకు బరిహారముగను ఉత్తరయను స్త్రీరత్నమును గానుకగా సమర్పించి క్షమింపుడనివేడుకొని వారియనుగ్రహము పడయుటకు. వ్యాసభారతమున నసలే లేదన్నారే మన సాహిత్యవిశారదులు. అచట నెట్లున్నదో చూతుము. పాండవులు తమ్మెఱిగించుకొనినపిదప, నుత్తరుడు తండ్రి కర్జునుజూపి యిట్లనెను:

"అనేన విజితా గావో నిర్జితాః కురవో యుధి
అయం భీతం ద్రవంతం మాం దేవపుత్రో న్యవారయత్.
అస్య బాహుబలేనైవ జీవన్ ప్రత్యాగతః పురం...
ప్రసాదనం ప్రాప్తకాలం పాండవస్యాభిరోచయే
తేజస్వీ బలవాన్ శూరో రాజరాజేశ్వరః ప్రభుః
ఉత్తరాంచ వరారోహాం పార్థస్యామిత్రకర్శన
ప్రణిపత్య ప్రయచ్ఛామః తస్యశిష్యా భవామహే (తతః శిష్టా భవామహే)
ఏతేషాం బాహువీర్యేణ గావశ్చ విజితాస్త్వయా
ఆర్యాః పూజ్యాశ్చ మాన్యాశ్చ ప్రత్యుద్గమ్యాశ్చ పాండవాః
తస్మాచ్ఛీఘ్రం ప్రపద్యామః కుంతీపుత్రం యుధిష్ఠిరం
ఉత్తరామగ్రతః కృత్వా శిరస్స్నాతా మలంకృతాం"
(వావిళ్ల ప్రతి, విరా. ప. ౭౮౬. పేజీ)

అప్పు డుత్తరునిమాటలు విని, తానుచేసినదానికి దుఃఖించి, అమాత్యకళత్రబాంధవసహితముగా, శిరస్స్నాతయై యలంకరింపబడిన యుత్తరను ముందిడుకొని వచ్చి, కృతాంజలియై సాష్టాంగపడి, ధర్మజుని, అనుగ్రహింపు మని వేడుకొని ఉత్తరను ధనంజయుడు పరిగ్రహించు గాక యని ప్రార్థించెను. ధర్మజు డాతని నోదార్చి పార్థుని వంక జూడ నాతడు విరటునితో "నీరాజ్యము మా కక్కఱలేదు. దుర్యోధనుని రాజ్యమే మేము గ్రహించెదము. నీకుమాత్రము స్నుషగా గ్రహించెదను. మాత్స్యభారత వంశముల కీరీతిగా సంబంధము కలుగగలదు" అని పలుకగా "నీవు నాకూతును భార్యగా నేల గ్రహింప"వని విరటు డాతని నడిగెను. "నృత్యగీతాదులను నేర్పుచుండుటనుబట్టి యామె న న్నాచార్యునిగా జూచుచుండినది. మఱియు లోకమున మిథ్యాపవాదము కలుగకుండుటకు గాను నీకూతును స్నుషార్థము గ్రహించెద"నని యర్జునుడు బదులు చెప్పి యారీతిగా తన వృత్తాంతమును, శీల శౌచ సమాచారమును లోకమున ప్రకటించినాడని మూలమున గలదు.

"ఉత్తరాత్పాండవాన్ శ్రుత్వా విరాటో దుఃఖమోహితః,
ఉత్తరాం చాపి సంప్రేక్ష్య ప్రాప్తకాలమచింతయత్.
తతో విరాట స్సామాత్య స్సపుత్ర స్సబాంధవః,
ఉత్తరా మగ్రతః కృత్వా శిరస్స్నాతాం కృతాంజలిః.
భూమౌ నిపతితో మూర్ధ్నా పాండవస్య సమీపతః......
ప్రసీదతు మహారాజో ధర్మపుత్రో యుధిష్ఠిరః...
ఇదంచ రాజ్యం నః పార్థా యచ్చాన్యద్వసు కించన
ప్రతిగృహ్ణాతు తత్సర్వం కౌంతేయ అవిశంకయా
ఉత్తరాం ప్రతిగృహ్ణాతు సవ్యసాచీ ధనంజయః"
(వి రా. పు ౭౯౧)

"........................................
ప్రతిగృహ్ణామి తే రాజన్ స్నుషాం దుహితరం తవ
యుక్తో హ్యావాంచ సంబంధో మాత్స్యభారతవంశయోః,
అంతఃపురేఽహ ముషితః సదా పశ్యన్ సుతాం తవ
రహస్యంచ ప్రకాశంచ విశ్వస్తా పితృవ న్మయి
ఆచార్యవచ్చ మాం నిత్యం మన్యతే దుహితా వ.
అభిషంగా దహం భీతో మిథ్యాచారాత్ పరంతప!
స్నుషార్థ ముత్తరాం రాజన్ ప్రతిగృహ్ణామి తే సుతాం
........................................
శీలశౌచసమాచారం లోకస్యావేద్య ఫల్గునః"
(పు. ౭౯-౩)

దీనినిబట్టి ఉత్తరను కొలువులోనికి రప్పించిన దెందులకో వ్యాసభారతమునందే సువ్యక్తము చేయబడినట్లు వ్యక్తమగుచున్నదిగదా. ఇది యంతయును నవవభర ప్రపంచ మెట్లాయినదో తెలియదు. తిక్కనసృష్టి కాదనుటయు స్పష్టమేగదా. ఇది మనసాహిత్యవిశారదులదృష్టి కగపడ లేదా, లేక యీసంస్కృతమూలగ్రంథము వారి

కర్థము కాలేదా? సాహిత్యవిశారదుల గూర్చి యిట్లనుట సాహసమందురేమో? కాని విరటుడుత్తరను పాండవుల యొద్దకు దీసికొనిపోవుటకు గల కారణములను గూర్చి వారు ప్రకటించిన కుతర్క వైభవమును వారి మాటల లోనే స్మరించి యానందింతురు గాక.

"పైగా ఈకల్పన మనవసర ప్రసంగముగా జాపట్టుచున్నది గాని వస్తుపోషకమగు సంగతిగా గన్పట్టుట లేదు. ఉత్తరను గిరీటికి జూపిన మోహితు డగునని యా ఱేఁడు తలంచె నందమా? సంవత్సర కాలము నృత్యము నేర్పిన కవ్వడి కుత్తర క్రొత్తది యగునా? ధర్మరాజాదులకు జూప నెంచె నందుమా? వా రా యిందుముఖి యందము నింతకుమున్న బహువారము కన్నులార గాంచినవారె. కావున నుత్తర నిటకు (తిక్కన) రప్పించుట పట్టి తత్తఱపాటుగాని మఱొక్కటి ప్రాశస్త్యమును గానరాదు."

"ఇదియునుం గాక రాజాంతఃపురముల యందు యువతులను ముస్తాబుచేసి, ముత్తయిదువలో, లేక కులపరిచారికలో తోడ్కొనివత్తురు గాని మంత్రిపుంగవులు పిలిచికొని వత్తురా? మత్స్యదేశమున నిట్టిది మర్యాదయై యుండునా? ఇక నొక వింత— మంత్రు లా మదవతిని దోడ్కొనివచ్చిరే గాని తిరుగదీసికొని వెళ్లలేదు. తీసికొని వచ్చునపు డాదరమును, బంపునపు డనాదరమును సొంపుగ నుండునా? అంతఃపుర యువతుల నలంకరించుటయు, వివాహమండపములకు గొని వచ్చుటయు రాణివాసపుఁ జేడియల పని కాని రాజకార్యాసనాసీనులగు నమాత్యసింహుల పని కాదు. కాని యమాత్య కులాలంకారుడగు కవివరుడు రాణివాసపు దీఁగబోడుల సింగారింపజేసి మంత్రులు రచ్చకుఁ దోడ్తెచ్చిరని తెలుపుచుండ వేయి వితర్కములతోఁ బనిలేదు"

"శిరీషకుసుమ శరీరయగు పూబోడిని దీసికొని వచ్చుటకు ప్రజ్ఞగలయొక్క ప్రెగ్గడ వెడలిన జాలదా? మంత్రివరు లందరును బరుగిడ నేల? మంత్రులన బ్రభుతుల్యులగు నుద్యోగులు గాని పల్లకిని మోయు బోయీలు కారే. వీరంద రెందులకు బోయిరో?"

ఇట్లున్నది విశారదుల సాహిత్యవిమర్శనము! ఇట్టి ప్రశ్న లెంత పేలవములో వీనికి సమాధానము చెప్ప జూచుటయు నంత అసంగతము.

వినుడు సాహిత్యకళా విశారదులే! ఇట్టి యసంగత ప్రశ్నలను వేయుట కెట్లు పాల్పడిరోయను విషయము మాత్రము విచారింపదగ్గదే. ఈ సందర్భమున వీరి మనస్తత్వమును మనము కనిపెట్టిన గాని దీనికి గారణము గోచరింపదు. వీరి వాదసరణిని కొంచెము పరిశీలింతము. మొదట సంస్కృతమూలము చూచిరో, చూడకయో "అసలీభాగమే వ్యాసభారతమున లేదు" అని ధైర్యముతో బొంకినారు. తరువాత నిది తిక్క కవివరుని తిక్కసృష్టియని, అనవసర ప్రసంగమని తూలనాడినారు. అందులో "అంతఃపుర యువతుల నలంకరించుట, వివాహ మండపమునకు గొనివచ్చుట అమాత్యసింహుల పనికా"దని వెక్కిరింపబోయినారు. వెల్లకిలబడినారు. ఇప్పు డమాత్యు లుత్తరను దీసికొని వచ్చినది వివాహమండపమునకు గాదే రాజసభకు. వివాహప్రసక్తి యింకను రానేలేదుగదా. అది తరువాత. ఇది వారికి దెలియదా? తా నిదివరలో తెలియకచేసిన యపచారమును గురించి పాండవుల యనుగ్రహమును బడయుటకై తన రాజ్యముతోపాటు ఈ స్త్రీరత్నమును కానుకగా నర్జునున కివ్వదలచి విరటు డామెను అమాత్యుల మూలమున రప్పించినాడు. ఇది రాచకార్యము గనుకనే యమాత్యులకు పని కల్పించినాడు తిక్కన. పాణిగ్రహణసమయమున నామె చెలికత్తియలే గొని తెచ్చిరని మన విమర్శకులే చెప్పియున్నారే తరువాత. కావున అమాత్యు లుత్తరను వివాహమండపమునకు గొనివచ్చి రనువ్రాత తెలిసియు నాడిన బట్టిబొంకా? అమాత్యకులాలంకారుడను కవిని వెక్కిరించుటకై తీసికొన్న పెద్దగోతిలో వారే పడిపోయినారే! మఱొకటి : ఒక కన్యను తీసికొనివచ్చుటకు ఇంతమంది మంత్రులు పరుగెత్తవలెనా యని ప్రశ్నించుచు, పాండవులను గుర్తించిన వెనుక విరటునికి గలిగిన తొందరపాటును తమ తత్తరపాటులో గమనింపలేక పోయినారు. అంతఃపుర యువతుల నలంకరించుట యమాత్యుల పని యని అమాత్యకులాలంకారుడను కవి

వరుడే తెలిపినాడని మీరు ఘోష పెట్టుచున్నారే, పుస్తకము చదివా, చదువకనా? తిక్కనార్యుని రచనలో నుత్తర నలంకరించిన దెవరో చూడుడు:

"తత్కార్యశ్రవణ సంప్రీతయగు సుదేష్ణయను మతంబున —

పదనికి రాఁ బులు గడిగిన
మదనాస్త్రము రేఖ గలిగి మానిని మెయి చె
న్నొందఁ గయిసేసి రప్పుడు
ముదితాజనములు ప్రమోదమున లలితముగన్"

ఇట్లు ముదితాజనము శృంగారంబు సేయఁగా నమ్ముద్దియకు "ముక్తాఫలప్రాలంబమాలికలతోడి గొడుగు పట్టించి యత్యాదరమున" దోడ్తెచ్చినవా రమాత్యులు. అప్పుడు విరాటుం డెదురుపోయి పురోహితులు, బంధుజనంబులు, దానును దోడ్కొని పాండవాగ్రజునగ్రభాగంబునకు దెచ్చి నిలిపి దండప్రణామంబు సేసి చేతులు మొగిడ్చి యిట్లనిరి. (ఇన్నట తిక్కనార్యు డెంత వినయాదు లుట్టిపడునట్లు చెప్పించినాడో చూడుడు!)

"ఎఱుఁగమిఁ జేసి మీ పె
ద్దఱికంబు దలంప నేమితప్పు గలిగినన్
మఱచి దయఁజూడు మిట్లం
దఱు మీకుం బనులు సేయఁ దగుదురు మీరల్."

వ. అని నిజానుజతనూజాలం జూపి మఱియును

ఇమ్ముద్దియ నర్జునునకు
ని మ్మ్యాపని బంధుజనుల కిందఱకుఁ గడున్
సమ్మతి యెల్లప్రజకు నే
నిమ్మెయి నినుఁ జేరి బ్రదుకు టిష్టంబధిపా!"

అని సర్వము నాతనియధీనము చేసినట్లు చెప్పినాడు. "ప్రతిగృహ్ణాంతు తత్సర్వం కౌంతేయా అవిశంకయా" అనిమూలము. దీనినిబట్టియు, దీనినిగూర్చి మీరు చేసిన యసందర్భపు ప్రశ్నలనుబట్టియు చూడగా మీరు సంస్కృతములో నీ సందర్భ మున్నదో, లేదో యని కూడ చూడకయే చదువరులను మోసపుచ్చదలచిన పండిత ప్రకాండులనియేగాక, తిక్కనగ్రంథమునుగూడ చదువకయే ఆ యమాత్యకులాలంకారుని నెక్కిరింప మొదలుపెట్టిన వెట్టివైదికాగ్రేసరు లనికూడ స్పష్టమగుటలేదా?

వెంటనే పూర్వోత్తరవిరోధముగల మతియొక వ్రాతను గమనింపుడు: "అప్పుడుత్తరను దోడ్తెచ్చుటకు నమాత్యుల నంపిన విరటుఁడిపుడేల (పాణిగ్రహణ సమయమున) చెలికత్తియల నంపెనో తెలియకున్నది." అని ప్రశ్నించి దానికి సమాధానము నూహించినారు సాహిత్యకళావిశారదులు — చూడండి: "ఉదాత్తాభిరతాదివస్తుతతి నీయవలసియుండుటచే మంత్రుల విశ్వసింపకయా యీ చెలికత్తియల బంపుట?" అని. ఏమియుక్తి! ఏమియూహ! ఏమిసాహిత్యకళ! అప్పుడమాత్యులను, ఇపుడు చెలికత్తియలను విరటు డేలపంపెనో పుస్తకము శాంతచిత్తతతో జదివినచో తెల్లము తెలిసికొనుట సులభమే. కాని అమాత్యవైదిక ద్వేషాసూయాపిశాచగ్రస్తులై మైమఱచినవారికి ఉన్నది లేనట్లు, లేనిదున్నట్లు నగపడునేగాని వ్యాసభారతములోనే మున్నదో, తిక్కకవి తిక్కయేమనెనో, మంత్రివరులు రాజకన్యకను రాజసభకు దోడితెచ్చుటలో గల యౌచిత్యమేమో యెట్లు తెలియగలరు? ఆ మైకములో "రాణివాసంపుతీగబోడులను సింగారింపజేసి వారిమంత్రులు రచ్చ కీడ్చుకొని వచ్చి"నట్లు మాత్రము గోచరించును. వైదికదృష్టికి గోచరమగు కావ్యకళ యిందే గలదు. సాహిత్య విమర్శకాగ్రేసరులు గ్రహించండి!

మతియొకవిశేషము—ఇట్లు తిక్కనకు గలిగిన తత్తరపాటు నన్నయకుమాత్రము కలుగలేదట! ఎందుచేత ననగా, "నన్నపార్యుడు కన్యకావయవమును మంత్రుల శిరమున నిడక నిపుణులగు నలివేణులపై నిడినాడు" గనుక. తారతమ్యపరీక్షతోఁగూడిన యీ చక్కనిసాహిత్యవిమర్శనములోని ఈ చెణుకుయొక్క సార్థక్యమును గ్రహించి ఆనందించాలి సాహిత్యవేత్తలందరును. అదేమంటే, తిక్కన ఉత్తరాపరిణయమును లోకోత్తరముగా జిత్రించినాడనీ, అట్టి విన్నాణమును నన్నపార్యుడు ద్రౌపదీపాణిగ్రహణమున ప్రదర్శింపనేరడాయెననీ కాదూ ఒకసోదరు డెప్పుడో అన్నాడట. కథాసందర్భాన్ని కూడా పాటించకుండా తన విమర్శ నడుపుతూన్నా "యేనకేనాప్యుపాయే .'

ఎదటివా డన్నదాన్ని కాదన్నానని సంతోషించాలి. అందుకేగా ఈవిమర్శనమంతా. వస్తుతత్వాన్ని గ్రహించ డానికి కాదుగదా. లేకపోతే ద్రౌపదీపరిణయసందర్భ ములో నన్నపార్యుడు వివాహమంటపమునకు కన్యకా నయనమును మంత్రులపై నిడవలసిన యావశ్యకత యే మున్నది? తిక్కనగారూ మంత్రులైతే ఆభరణాలను దొంగిలిస్తారో ఏమోయని చెలికత్తియల పైనే పెట్టినా డాపని నని ఇంతకుముందు వారే చెప్పినారుగదా, ఇక ఈవిమర్శనలోని విశేష మేమి? నన్నయకు వచ్చిన గొ ప్పేమున్నది, వారి తెలివితక్కువతనము బయటపడు టయేగాక? ఇంకకును ఈ విమర్శన మంతా వ్యక్తిపర మైనదిగాని, వస్తుతత్వమును, కవిహృదయమును గ్రహించ వలయునను తలంపుతో ప్రారంభించినది కాదు. వ్యక్తిపరమైన యీయావేశ మనేక భ్రమలను గలిగించి క్రమముగా నసత్కల్పన మను సుడిగుండములోని కీడ్చివేసినది. ఇన్ని భ్రమలకు గారణమగు పైత్యవికార ముచే కన్నులు తిరుగుచున్నపుడు తిక్కనార్యుని రచ నలో విజ్ఞానమే చూపినాడో, అచ్చట కావ్య కలయే యున్నదో మఱేమున్నదో వారి దృష్టి కెట్లు గోచరమగును? పోనిండు.

పైత్యవికారము గలిగినపుడు నయనేంద్రియ మునకేగాక శ్రవణేంద్రియమునకు వాఘాతము కలుగ వచ్చునందురు. అందుకనే గాబోలు వారికీసందర్భమున చెవులలోబడిన శబ్దములకు సందర్భశుద్ధిగల యర్థము తోచక యవి విపరీతార్థములు కలవిగను, అశ్లీలములు నమంగళకరములుగనుగూడ గన్పట్టినవి.

తిక్కనార్యుడు పదౌచిత్యమెఱుంగనివా డనుటచే కల్యాణసమయమున పైతృకకర్మల నందువాడ దగిన పదములను వాడినాడట. ఇంతకాలమునుండియు వెత్తవైదికులకు పైతృకకర్మలయందును, ఆబ్దికతంత్రముల యందే దృష్టిగదా, ఇట్టి యద్భుతార్థములను గనిపట్టి విమర్శనము చేసినవా రెవరును లేకపోయినారు. "తిక్కన మఖి యుత్తరాకల్యాణములో (వధూవరుల పరస్పరావ లోకమునకై నడుమబట్టిన తెర యెత్తించునపుడు) సాం వత్సరికపదమును బెట్టె"నట. చూడుడు: "సాంవత్సరిక దత్తకాలకళావిశేషంబుల మంగళతూర్యములు సెలంగ నత్తెర యెత్తించి" దీనిపై వ్యాఖ్యనిత్తగించండి: "ఇట ప్రదర్శింపబడిన కార్య మెద్దియన, వధూవరుల నడుమ తెరనుదీసివేయుట. ఈచిన్నపనిని వర్ణించుటకు సాంవత్స రిక పదసౌభాగ్యసుందరమగు నొకదీర్ఘవాక్యము ప్రకటీ కరింపబడినది. ఇంతటి దీర్ఘవాక్యమెందులకు? మంగళ తూర్యంబులు సెలంగ తెరయెత్తించె నన మంగళముగా నుండునే, అప్పుడీ సాంవత్సరికకార్య మెత్తిగిలునే." అని. ఇక నీసాంవత్సరికశబ్దమున వారు గనిపట్టిన సారస్య మును వెల్లడించుటకుగా వారాసందర్భమున శ్రమపడి చేసిన వ్యాఖ్యానమును గమనింపుడు. అందువలన వ్యక్త మగుచున్న వారిపాండిత్యగరిమను, సహృదయత్వమును, రసికతను, గుణగ్రహణ పారీణతను, సందర్భశుద్ధిని గ్రహించి యానందింపుడు.

"సాంవత్సరిక దత్తకాల కళా విశేషంబుగ మంగళతూర్యంబులు సెలంగ నత్తెరయెత్తించి"-వివాహ సమయమున వధూవరుల నడుమ తెరయెత్తు సందర్భ మును గుర్తించిరే ప్రకరణానుసారముగ వారు చేసిన వ్యాఖ్యానము—

"సాంవత్సరిక = ఆబ్దికమునందు, దత్త = ఈయ బడిన, కాల = నల్లని, కళా = పదియాఱవభాగము యొక్క, అనగా అణాకాసుయొక్క (తిక్కన కాలములో నణాకాసులుకూడ టంకసాలలో ముద్రింపబడెడివి కాబోలును) విశేషంబుల=అతిశయ ములచే నని యర్థమేర్పడును. అందువలన 'వివాహ శ్రాద్ధకాలదత్త మంగళతూర్య వినాదంబులు చెలంగ' ననుట యమంగళావహము" 'సాంవ త్సరిక' శబ్దమునకు జ్యోతిషికుడను నర్థము శబ్ద వ్యుత్పత్తిచే గలుగదట. "ముహూర్తం వేత్తీతి మౌహూ ర్తికః" అయినట్లే "సంవత్సరం వేత్తీతిసాంవత్సరికః" అని ఠఞ్ ప్రత్యయ మేల రాకూడదో? అమరసింహుడు తన నిఘంటువులో 'సాంవత్సర' శబ్దమునుమాత్రమే పఠించినను, లోకవ్యవహారమున 'సాంవత్సరిక' శబ్దము భవార్థముననేగాక జ్ఞానార్థమునగూడ వ్యవహారములో నున్నట్లు గ్రంథములు, కోశములుగూడ దెలుపుచున్నవి. మానియర్ విలియమ్స్ దొరగారి సంస్కృత నిఘంటు వులో 'సాంవత్సర' శబ్దమునకు 'సంవత్సరమంత్రైన'అను

థవార్థ మున్నట్లే, 'సాంవత్సరిక' శబ్దమునకు జ్ఞానార్థము కూడ నున్నట్లు తెలిపియున్నారు. (cf. సాంవత్సరభృతి· **Annual wages.,(m) An astrologer Almanace matter. J.F. a funeral ceremony;** సాంవత్సరిక= **yearly, annual,** సాంవత్సరికఋణ = **A debt payable in a year.** సాంవత్సరికబలి = **Annual revenue.(m)An astrologer.**)దీనికిపంచతంత్రములో జ్యోతిషికుడను నర్థమున బ్రయోగము కూడ నిచ్చినారు. cf. "దేవీ, జననీ, కంచుకీ, మాలికః, శయ్యాపాలకః, స్పర్శాన్యతః, సాంవత్సరికః, భిషక్, ఛత్రధరః ఏషాం వైరద్వారేణ స్వపక్షే విఘాతః". (కాకోలూకీయము, పంచత.) వ్యాఖ్యానము : సాంవత్సరికః= దైవజ్ఞః, కాలవిత్. సాంవత్సరక శబ్దమునకుగూడ నీ రెండర్థములు కలవు. జ్యోతిషికు డన్న యర్థమున వరాహమిహిరుని బృహత్సంహితలో బ్రయోగము కలదు. "ఏదో అతిప్రయాసముచేనైనను దైవజ్ఞార్థము సాధించి ను ఆ పదమునకు లోకమునగల ప్రసిద్ధార్థమును నివారింప శక్యము కాదట. ప్రకరణ విరుద్ధముగా బ్రయోగింప రాదన్నవారు ప్రకరణమునుబట్టి యర్థము చేయరాదా? ప్రకరణమునుబట్టియు వారి సహృదయమునకు శ్రాద్ధ మను నర్థమున దానిని గ్రహించుటే యుక్తమని తోచినది గాబోలును. కావుననే "వివాహ శ్రాద్ధ కాల దత్త" అని దాని యర్థమునుగూడ స్పష్టముగ వివరించి వ్రాసినారు. "అయ్యిద్దఱును గృష్ణ సట్లొప్ప దోడ్కొని చని యొక్క ముదుసలి సాని కపుడు మ్రొక్కి యక్కన్యను మ్రొక్కించి" (భార. ఆది. 8 ఆ)యని నన్నయ 'సాని'పదమును వాడినాడు. పాండవులు, ద్రౌపది కుంతీదేవిని మ్రొక్కిరన్న సందర్భమున నన్నపార్యుడు కుంతిని భోగముదానిగానే యుద్దేశించి సానిపదమును వాడినా డని యీ ప్రకరణమునుబట్టి యర్థము చెప్పుదురా? సానిశబ్దమునకు (ఇప్పటి)లోక వ్యవహార ప్రసిద్ధమగు నర్థ మదియేగదా! కంపు, చీమ మొదలగు భారతకవులు వాడిన శబ్దముల కాకాలమునగల యర్థ మిప్పుడు లేదుగదా!

ఇక "తిక్కనమంత్రిపుంగవు డుత్తరకరమును సౌభద్రుడు గ్రహించె నన్న తావున జిత్రించిన పదము కూడ కొంచె మసభ్యభావముగానె" వారికి జూపట్టినదట. "కుమారుడు తీగబోడి మృదుపాణి గ్రహించె" నన్నప్పుడు 'బోడి' పద మంత శ్రీమంతముగా లేదట. 'బోడి'పదమునకు లోకములో 'గుండుకల'యనియర్థము ప్రసిద్ధమని యీ సాహిత్యవిశారదులు వ్యాఖ్యానముచేసి తమ సహృదయత్వమునే కాక యగాధమగు పాండిత్యమునుగూడ వెల్లబుచ్చుకున్నారు. దీనికి "బోడి = ముండితము" అని శబ్దరత్నాకర ప్రమాణము, దానిపై మరల వీరి వ్యాఖ్యానము. పదసన్నికర్షచే "బోడిపాణి" యన "ముండితకర"మని వీరికి బోధపడినదట. తెలుపరి వీరి భక్తి తిక్కనార్యుని వెక్కిరింపు. "కవివరు డీబోడినుడిని వీడి వేశ్యలతాంగినైనఁ దోడికొనివచ్చి పెండ్లిపీటపైఁ గూర్చుండఁబెట్టి సౌభద్రునిచే నాసుభాంగికరమును బట్టించిన సౌభాగ్యముగా నుండెడి"దట! "బోడినుడిని వీడి" అని శ్లేషించినప్పుడు గూడ బహుజాగరూకతతో వేసిన నడుమ యరసున్న 'తీగబోడి' యనుపదమునందు వీరి కన్నులకు గోచరింపలేదు గాబోలు. 'తీగబోడి'లోని 'బోడి' శబ్దమునకు 'గుండుకల' యని వ్యాఖ్యానించు పాండిత్యమునకు "బోడి = ముండితము" అను శబ్దరత్నాకరకారుని నిఘంటు ప్రామాణ్య మేలనో! కావున బోడినుడిని వీడవలసినది కవివరుడు గాడనియు, విమర్శకాగ్రేసరుడే యనియు స్పష్టమగుచున్నది గదా. పదసన్నికర్షముచే వేశ్యలతాంగిని దోడికొనవచ్చి బోడిపాణిం బట్టించు సౌభాగ్యము వైదికపుంగవులకు చెల్లవలసినదే కాని తిక్కనమంత్రిపుంగవునకుమాత్రము చెల్లదు.

# ఎదురు నడకలు

[కథానిక]

శ్రీ రా. సి. ఆంజనేయశాస్త్రి

౧

"మళ్లా ఎందు కొచ్చాడే అతను?" అంది మా అమ్మ, కొంచెం భయపడుతూనే. నేను జవాబు చెప్పకపోవటంచేత కొత్త ధైర్యం తెచ్చుకుని, "ఒకటికి రెండుసార్లు చెప్పినతరవాతైనా తెలుసుకోవాలి! ఈడొచ్చిన పిల్లవి!!" అంది మళ్లా. చదువుతున్న పుస్తకంలో ౩౮-వ పేజీ గుర్తుపెట్టి పుస్తకం మూసేసి అలాగే కూర్చున్నా. జవాబుమటుకు చెప్పలేదు. కంఠస్వరం హెచ్చించి, "ఇంకోమాటిలాజరిగిందంటే బాగుండదమ్మాయి! తెలిసిందా?" అంది మళ్లీని. కిటికీలోంచి శూన్యంలోకి చూస్తున్నదాన్నల్లా మౌనంగానే మాఅమ్మవేపు తిరిగి, ఆవిడమొహంలోకి చూశా. ఆవిడ గిరుక్కున పక్కకి తిరిగి, చరచరా సావిట్లో కెళ్లిపోతూ, "స్నేహితుడవటంచేత మొహాన చెప్పలేక తటపటాయిస్తున్నాడు. మనస్సు కనిపెట్టి పోవటం మంచిదని చెపుతున్నా." అంది సన్నగా. తనమాట నాకు వినిపించ దనుకున్నంతదూరం వెళ్లి... "అలా ఉరిమిఉరిమిచూస్తుం దేమిటే? నన్ను...నాకేం భయ మనుకుందికామాలు!!" అనుకుంది లోలోపల. ఆమాటలు వినేసరికి నాకు కోపం, జాలి, ప్రేమ కలగాపులగంగా కలిసిపోయి "అమ్మా!" అని నానోట పిలిపించాయి. సమాధానం రాకపోతే, వినిపించలేదేమోనని నేనే సావిట్లో కెళ్లేసరికి యిందాకటికంటె కూడా ఎక్కువగా భయపడుతూ "అబ్బే! ఏదో మాటవరసకి అన్నా. తప్పితే, చిన్నప్పటినుంచీ మున్నురూ ఎంతో చనువుగా వుంటున్నవాళ్లు ..." అని గుటకలు మింగింది. ఆమెఅవస్థ నేను అర్థం చేసుకున్నా.

పిల్లలు పుట్టనూ, పోనూ — ఆఖరికి నేనొక్కర్తెనీ బతకటం, నేనుపుట్టిన రెండేళ్లకే మా నాన్న పోవటంచేత అమితమైన గారాబంగా పెంచింది మా

అమ్మ నన్ను. పెద్దదాన్నవుతున్నకొద్దీ యీగారాబం మసురుతనంగా పరిణమించింది. పెద్దచదువు చదివి బడి మానేసింతర్వాత నామీద ఆవిడకి గౌరవాదరాలు కూడా ఏర్పడ్డాయి. నేను చిన్నబుచ్చుకుంటానని నా కష్టం చెప్పేది కాదు మొదట్లో. రానురాను నా కెదురు చెప్పటానికి భయపడేది. నిజాని కటువంటి స్థితిలో వుండటానికి నాకు యిష్టం వుండటంకాని, - నేను ఆపదవిని పొందటానికి ప్రయత్నం చెయ్యటంగాని జరగకపోయినా అప్రయత్నంగానే నేను మాయింటి కథకారిణి నైపోయా. ఇంట్లో కూరలు పురమాయించటం దగ్గిర్నుంచీ మాఅమ్మ ప్రయాణాలవరకూ నా కెదురంటూ లేదు. కాని అతనివిషయంలో మాఅమ్మ యీవిధంగా కేవల విరుద్ధభావం వెల్లడించటం నాకు కొంచెం వింతగానే కనపడ్డది. పెళ్లి అయినతర్వాత యిప్పుడు యింతస్పష్టంగా చెప్పింది. కాని మాడేళ్ల కిందటే కొంచెం చెరుకుచెరుకుగా చూసటం మొదలెట్టింది – నేనూ, అతనూ కబుర్లుచెప్పుకుని నవ్వుకుంటూ ఆడుకుంటుంటే. ఇప్పటికీ నాకు బాగా సర్తే! కారమ్సు ఆడుతూ నేను గెలుస్తానంటే నేను గెలుస్తానని పందెంవేసుకున్నాం. చూసుకోమరి నేను గెలవకపోతే అని ఒచ్చీరానిమీసం మెలివెయ్యటం మొదలెట్టాడతను. టక్కున బిళ్లలన్నీ కొట్టేసి "అరెరెరె! మీసం మెలేసినంత నీవుకూడా పట్టలేదే? ఓడిపోవటానికి?" అన్నా. "ఎల్లాగైనా ఆడపిల్లవికదూ?" అన్నా డతను. ఫక్కున నవ్వుకున్నాం. ఇది విని మాఅమ్మ ఏదో పనున్నట్టు నన్నుపిలిచి, యీకబుర్లూ-ఆకబుర్లూ చెప్పి, నామనస్సుకు నెప్పికలగకుండా వుండేసమయం చూసి నవ్వుతూ "చూశావా? పిన్నిగా రేమంటున్నారో మీ నవ్వులు విని?" అంది.

మొన్నా డతనెంతో సరదాపడి సినిమా కెళ్లుదామని ఒచ్చాడు. నేను కనిపించకుండా గదిలో పడుకున్నా. "ఏం అలా వున్నావేం?" అన్నాడు దగ్గిరకొచ్చి. నేను మెదలకుండా అలాగే పడుకుని ఉన్నా. ఆదుర్దాగా మా అమ్మదగ్గిరి కెళ్లి "అమ్మాయి అలా వుందేం?" అన్నాడు. "ఇందాకటి వరకూ కులాసాగానే వుందే!" అనుకుంటూ తడబడుతూ నాదగ్గిరికొచ్చి నెన్నుమీద చెయ్యేసి చూసి "ఏం అమ్మా? తల నెప్పా?...గుండెల్లో బరువా?" అని ప్రశ్నించింది ఆప్యాయంగా. అప్పుడప్పుడు అకస్మాత్తుగా తలనెప్పి, గుండెల్లో బరువూ ఒస్తుండేది నాకు. "ఊఁహూఁ..." అన్నా క్లుప్తంగా.

"ఐతే మరి మాట్లాడవేం నాతో?" అన్నా డతను. నేనేమీ జవాబు చెప్పలేదు.

"ఏమిటే మరీ? చూస్తూ, యిటు తిరుగు" అంది మా అమ్మ భుజం పట్టుకుని. నేను లేచి కూర్చున్నా అమ్మకేసే చూస్తూ. అతను చిన్నబుచ్చుకుని "సినిమాకి రావూ? ఇవాళ ఆఖరురోజుకూడాను?" అన్నాడు జాలిగా. ఇంతవరకూ జవాబు చెప్పకపోయినందుకే కుమిలిపోతున్న నేను పట్టుబలవంతాన ఎలాగో యీ మాటుకూడా మౌనంగా వుండగలిగా.

"ఏమి టా మొరటుతనం? పోనీ, వెళ్లరాదూ సినిమాకి?" అంది మా అమ్మ.

అతను నిరాశతో దీనంగా చూస్తూ "పోనీ, నావేపు చూడన్నా చూడరాదూ?" అన్నాడు. నా హృదయం ఒకులైపోయింది. కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి అతనికేసి చూసి మా అమ్మవేపు తిరిగా. ఆవిడ కర్థమైంది "ఛీ పిచ్చిదానా! ఏదో నవ్వలి కన్నా... సరదాగా వెళ్లిరండమ్మా" అంది. అతను గుచ్చిగుచ్చి అడిగాడు "విషయం ఏమి"టని.

"ఆఁ ... నిన్న కోప్పడ్డా దాన్ని...అదీ..." అంది మాఅమ్మ.

"ఔనే, మరి నామీ దెందుకూ కోపం?" అన్నా డతను.

"దాని మొహం!" అని తప్పించేసిం దసలు సంగతి చెప్పకుండాను. ఎంత పూనేసినా నన్ను బాధిస్తూనేవుంది కిందటిరోజు విషయం.

"మనం నవ్వుకుంటుంటే పిన్నిగా రేమిటో అన్నారుట. కనక నేను సినిమాకి రావటంగాని, ఆడుకోటంగాని..." అర్ధోక్తిలోనే అత నందుకుని "పోనీ నవ్వకుండానే వెడదాంలే. లే..." అన్నాడు నవ్వుల్లోకి దిగేసి. నేను రానంటే రానన్నా. ఎంతో

బలవంతం చేసినమీదట ఎప్పుడూ సినిమాకి వెళ్ళని మా అమ్మకూడా బయల్దేరటంచేత గంటఆలస్యంగావెళ్లాం ఆరోజు సినిమాకి. తరవాత అలాంటి సంఘటన ఏమీ జరగకపోయినా నామనస్సులో మటుకు కలుక్కుమంటూనేవుంది. అసలు మాఅమ్మ అలా ఎందుకనాలి? అదీగాక, యిరుగుపొరుగువాళ్లు మా యిద్దరికేసీ చూసి చేసే చేష్టలవల్ల క్రమంగా అర్థమయింది. వయస్సు వచ్చిన నేను యవ్వనంలో వున్న అతనితో మనిషీ మనిషీ ప్రవర్తించినట్లు ఉండటం వాళ్ల దృష్టిలో బాగుండలేదు. నిన్న మొన్నటిదాకా ఎంతో యిదిగా ఉన్నాం. కాని యిప్పుడుమాత్రం వీల్లేదు. కారణం యవ్వనం. దానికి నే నేం బాధ్యత వహించగలను? యవ్వనం వస్తే హృదయం చంపుకోవాలని వీళ్ల ఉద్దేశం. కసాయిపని చెయ్యటం నాకు చేతకాదు!

౨

నా పెళ్లికి పెత్తనమంతా అతనిదే. ఎంతో సరదాగా ఉన్నాడు నవ్వుతూ నవ్విస్తూ. నిజానికి నాకేమీ ఎబ్బెట్టనిపించలేదు. ఒకేచోట చదువుకోటంచేత మేంముగ్గురం ఎంతో స్నేహంగా వుండేవాళ్లం. టెన్నిస్ ఆడుకున్న తరవాత నేనూ అతనూ కలిసి ఆ అమ్మాయియింటికి రావటం, ముగ్గురం షికారువెళ్లటం సాధారణంగా మరుపుకు రావు. నాచదువుకోసం ఆ పట్నంవిడిచి నేను వెళ్లిపోయినా, అతనికీ ఆ అమ్మాయికీ స్నేహంనిరంతరాయంగానేవుండిపోయింది. నాకూ అతనికీ ఏంరా అంటే ఏంరా అనుకునేంత స్నేహం. అతని కిదివరకే పెళ్లికావటం, నాకూ ఆ అమ్మాయికీ ఎక్కడో దూరపుబంధుత్వం ఉండటం — ఏమిటో తమాషాగా భార్య అయిపోయిందా అమ్మాయి నాకు. దాని కారణంమటుకు నేను చెప్పలేనుగాని, యిప్పుడతను ఆ అమ్మాయికేసి—కాదు, నాభార్యకేసి—చూస్తే నాకు అసహ్యమైన బాధ పుట్టుతోంది. దానిసౌందర్యం, యవ్వనం అంతా తాగేస్తున్నాడనిపిస్తుంది ... అవును, యిప్పుడాఅమ్మాయి నాభార్య. దానిమీద నాకు సర్వాధికారాలూ వున్నాయి. నాకిష్టం లేందే అది యింకొళ్లని పలకరించకూడదు. వాళ్లు పలకరించినా జవాబు చెప్పరాదు. కన్నెత్తి చూడరాదుకూడాను. అదీగాక, ఎవరూకూడా దానితో మాట్లాడరాదు. దాన్ని చూడరాదు కూడాను. అవునూ, నాకిష్టంలేదూ! ఎంతస్నేహం అవుతేమటుకు ఏమి టాపోకడ? లోకం ఏమనుకుంటుంది?—ఊఁ. ఏమిటో వెఱ్ఱిగానీ! వెధవ లోకం ఏం అనుకుంటేనేం? పెళ్లి కానేవరకూనూ, పెళ్లిలోనూకూడాముగ్గురం అంతేచనువుగానూ, స్నేహంగానూ ఉంటున్నవాళ్లం, అకస్మాత్తుగా, ఏమీకారణం లేకుండా, మొన్నటినుంచీ అత నాస్నేహబంధం వదిలేసుకోవాలని నేను కోరటం మూర్ఖత కాదూ! చదువుకున్నవాళ్లకూడా యిలాంటి పిచ్చిపిచ్చి, తలాతోకా లేని ఊహలు పుడుతాయేం?.... ఏమిటో!!

ఆనాడు కోర్టునుంచి నేను వస్తుంటే దార్లోనే ఎదురుపడ్డాడతను ఆసుపత్రి మూసేసి. ఇద్దరం మా యింటికొచ్చాం. సముద్రంఒడ్డునవున్న హోటల్లోకి ఆరుగంటలనాటకొని వెళ్లుదామని దార్లోనే నిశ్చయించుకున్నాం. ఇంటికి రాగానే మా ఆవిడకూడా ముస్తాబై "ఇవాళ మీరుకూడా దబ్బున వచ్చారే?" అంది అతనితో.

"మరే! ఆపరేషనుకేసు యివాళింకా ఎదీ రాలేదు. అందుకని ..." అన్నా డతను.

"ఒదినగారితో చెప్పాయిందాకే. తయారుగానే వుంటుంది బహుశా." అంది మళ్లీ.

"ఆఁ, అదో పల్లెటూరి రకం . . . నవ్వు వస్తున్నావుగా? తయారుచేద్దువుగానిలే . . . ." అన్నాడు నవ్వుతూ.

"మహాబస్తీరకం అయ్యాం లేస్తురూ? మనం!" అందిజవాబుగా. ఇద్దరూ పకపకానవ్వుకున్నారు. నేను సహించలేకపోయా. మొహంమీదే "ఏమి టావెర్రి నవ్వులు" అని అందామనుకున్నానుగాని మర్యాదగా వుండదని ఊరుకున్నా. వాళ్లల్లో నానవ్వుకలపకపోవటమే నా అసమ్మతిని తెలియజేయటానికి సక్రమమైన విధానమని ముభావంగా కూర్చున్నా. నాఉద్దేశం గ్రహించారో లేదో! కాస్సేపాగి, "టైం అవుతోంది మరి బయల్దేరండి . . . అక్కడకూడా కొంతఆలస్యం

అవచ్చు..." అంది మాఆవిడే. నేను రాననే చెప్పా దామనుకున్నా. కాని కారణ మేముందీ రాకపోవ టానికి?

"అల్లా వున్నావేంరా?" అన్నా డతను.

"ప్చ్... ఏంలేదు... ఎలా వున్నా?..." అన్నా నేను. ముగ్గురం అతనింటికెళ్లాం. అతనిభార్య తయారుగానే వుంది. "చూశావుట్రోయ్, మీ ఆవిడకంటె కూడా వెయ్యిరెట్లు దర్జాగా తయారైంది. అయ్... బాబ్బా!!" అన్నా డతను. నేను కొద్దిగా అరువు తెచ్చుకున్న నవ్వు నవ్వాను. ఇందాక మా ఆవిడని అతను మెచ్చుకున్నా నాకు బాధే కలిగింది; ఇప్పుడు తనభార్య వెయ్యిరెట్లు దర్జాగావుందన్నా నాకు బాధే కలిగింది. ఈసంఘంలోని జీవిని నేను. నిజానికి పరిస్థితులచేత తయారు చేయబడ్డా నేను. పరిస్థితుల్ని తయారుచేసుకునే శక్తి నాకు లేదు. నాకే కాదు ఎవరికీకూడా ఉండదనే నా ఉద్దేశం.

"టిక్కెట్లు రిజర్వుచేయించద్దూ మరి?" అంది మాఆవిడ. నేను జవాబు చెప్పకముందే "ఫర్వాలేదు లేద్దూ!" అన్నా డతను.

"డాక్టరుగారుగదాఅనా?" అంది మాఆవిడ.

"ఊఁహూఁ, స్త్రీదరుగారుకూడా ఒస్తున్నారు కదూ? అందుకని..." అంది అతనిభార్య. మళ్లా పకపకా నవ్వుకుంటూ కారెక్కబోతున్నారు. నేను భరించలేకపోతున్నా. మౌనంగా అలాగే కుర్చీలో కూర్చున్నా.

"ఏంరా, యిందాకటినించీ అలాగే వున్నావు! ఒంట్లో బాగుండలేదా?" అన్నా డతను కొంచెం ఆదుర్దాగా.

"ఊఁ, అఁ! కాస్త తలనెప్పిగా వుంటేను..." అన్నా మొహం అదోలాపెట్టి. అతను నదురుపట్టుకు చూసి, గబగబా లోపలికెళ్లి ఔన్సుగ్లాసులో మందు తీసుకొచ్చాడు. నాకది మందుకాదు. అయినా తాగే శాను.

"ఇందాకటివరకూ కులాసాగానే వున్నారే?" అంది అతనిభార్య.

"ఇవాళ నూనెతిరగమోతకూడా కాదే?" అంది మాఆవిడ.

అంతా మళ్లీ మాయింటికిరాబోతుంటే "పోనీ, మీరు ముగ్గురూ వెళ్లరాదూ? ఓగంటలో తగ్గిపోదూ తలనెప్పి?" అన్నా.

"ఛీ! సరదాగా బయల్దేరాం. వెళ్లితే అంతా వెళ్లాలిగాని ఏంమునిగిపోయింది? నేం వెళ్లమంటే మేంవెళ్ల"మన్నారు ముగ్గురూను.

## 3

డాక్టరూ, భార్యా అటువెళ్లగానే ఆయన పడి మంచంమీద లేచి కూర్చుని ఎప్పుడూలేని కుచ్చితపు చూపులు చూస్తూ, ఎడంవేపుమీసాల్ని మునివేళ్లతో కొరుకుతూ మాతిరిగించే"పోయింది... నెప్పి" అన్నారు. నా కాట్టే ఏమీ అర్థంకాలేదు. నిముషం కిందటివరకూ అంత వ్యాకులంగా ఉన్నాయనల్లా తమాషాగా లేచి కూర్చుని యిలా మాట్లాడటం ఆశ్చర్యంవేసింది. నేను తికమకపడుతున్నట్లు గ్రహించి విజయపూరితంగా కాస్త నవ్వుతూ, "తెలీదూ? తలనెప్పెందుకో?" అని ప్రశ్నించారు. నేను జవాబు చెప్పేలోపుగానే కనుబొమలు ముడుచుకుని "వెళ్లకపోయావ్? వెధవారనే అనుకున్నా అసలు!" అన్నారు ఆయనే. "వెధవ... స్నేహితుడవు తేమాత్రం?"... తడబడ్డారు కాస్త. కోపం పైకే కనిపించింది. నామౌనం యింకా రగిల్చిందో ఏమో, కన్నెఱ్ఱజేసి "ఏం అలా చూస్తావేం?" అంటూ దూకుడుగా మంచంమీద నుంచి లేచి యిటూ అటూ పచారుచెయ్యటం మొదలెట్టారు. "ఈమాటు రానీ... మొహం వాచేట్లు చివాట్లు పెట్టేస్తాను." అనుకున్నారు మళ్లీని, చేత్తో క్రాపు ఎగదువ్వుకుంటూను.

అప్పుడప్పుడు డాక్టరు సరదాగా మాట్లాడుతుంటే, ఆయన మొహం చిట్లించుకున్నట్లు కనబడటం నేనూ గ్రహించకపోలేదు. మాఅమ్మ చెప్పినదానికి

రూ చిల్లింపులతో సంబంధం ఉండకపోదనీ అనుకునే వున్నా. చెప్పద్దూ, యీ అవమానం యింత తీవ్రమైన పరిణామం పొందుతుం దనిమాత్రం ఊహించలేదు. ఆయనమనోభావాలకు అనుగుణంగా పోవటానికిగాను నా హృదయంలోవుండే నిర్మలోత్సాహాన్ని పూడ్చే సెయ్యటానికి నేనూ ప్రయత్నించలే దింతవరకూను. చివాట్లూ, చెప్పుదెబ్బలవరకూ ఒచ్చేసరికి నాకూ కోపం ఒచ్చింది. నా అసమ్మతిని తెలియజెయ్యటానికి కుర్చీలోంచి లేచి సావిట్లో కెళ్లబోతుంటే ఆపి "అడదానివి నీకన్నా వుండొద్దూ సిగ్గు?" అన్నారు. జవాబు చెప్పకుండా వెళ్లిపోయే పరిస్థితి తప్పిపోయింది. ఆడదాన్ని నాకన్నా ఉండాలిటసిగ్గు! మొగాళ్లకక్కర్లేదనా ఆయనఉద్దేశం! నిజానికి సిగ్గులేని పని నేనేంచేశాను?

"నేను సిగ్గులేని పనేమీ చెయ్యలేదు." అన్నా కోపం అపుకోలేక.

"అతనో?" అన్నారు గదమాయింపుగా.

"అతనూను." అన్నా జవాబుగా.

"ఇహా నే ననేగా నీ ఉద్దేశం?" అంటూ నా సమాధానానికి ఆగే మర్యాదన్నా పాటించకుండామీద మీదకొచ్చి "ఎదిరింపుకూడానా? ఆ వెకవెకలూ పకపకలూ!...పైగా నాకా సిగ్గులేంది? సంసారిలక్షణా లేనా యివి? ఊఁ..." అంటూ ఉగ్రరూపం దాల్చి ఎడం చెంపమీద ఫెడేలున ఒక్క దెబ్బ వేశారు. శరీరం మీద దెబ్బపడేదాకా అలాంటి దౌర్జన్యం జరుగుతుందని కొంచెంకూడా అనుకోలేదు. బుర బుర పొంగింది. కాదంటే అవుననీ, అవునంటే కాదనీ, మీదే తప్పనీ, పొరపాటనీ లక్షసార్లు పోట్లాడుకునేవాళ్లం అనేక విషయాలమీద. ఎంతో సరసంగా నడిచిపోయేది. కాని భర్తృత్వంయొక్క కాఠిన్యం యివాళ ప్రదర్శితమైంది. నేను భరించలేకపోయా. ఒళ్లంతా జలదరించింది. ఎంత ప్రయత్నించినా కళ్లల్లో గిర్రున తిరిగిన నీళ్లని కిందపడకుండా ఆపటం నా వశం కాలేదు. ప్రథమానుభవం అవటంచేతనో ఏమో ఆయనా నా మొహం చూడలేక, మొహం తప్పించటానికిగాన, బూట్సులు తొడుక్కుని చరచరా వీధిలో కెళ్లిపోయారు. వాలకంచూస్తే బాగా పశ్చాత్తాపపడుతున్నట్లు కనిపించింది. కాని అహంకారం హృదయాన్ని ముంచేసుండాలి. ఆయన నావేపు చూడనన్నా చూడలేదు.

౪

రాత్రి ఎప్పుడో, ౧౦న్నర, ౧౧ గంటల కింటికి చేరాను. ౧౦ లంకణాలుచేసిన మనిషల్లే కనిపించింది. నాకు చాలా జాలేసింది. నేను తొందరపడ్డానని నాకు తెలుసు. ఇంట్లో అడుగుపెట్టేటప్పుడు క్షమాపణ కోరుకుందా మనుకున్నాకూడా. గోడవేపుకి మొహం తిప్పుకుని పడుకునుండటంచేత నా రాకని తెలియజెయ్యటానికిగాను కొంచెంగా దగ్గు తెప్పించుకున్నా. వెనక్కి చూసి గిరుక్కున తల తిప్పేసింది. దాంతోటి నాలో చిగురిస్తున్న మానవత్వం కాస్తా మలమలా మాడిపోయింది. అవునూ, దాని ప్రవర్తన నాకేమీ బాగుండలేదు. నా అవమానాన్ని దానికి తెలియజేశాను, పద్ధతిలో కొంచెం తీవ్రత వుండొచ్చుగాక, — ఉందే అనుకోండి! అంతమాత్రంచేత నన్నావిధంగా తిరస్కారభావంతో చూడటానికి దానికి హక్కుందీ? స్పష్టంగా తెలుసు నాకు—లేదని. లేనిహక్కు చలాయించటం నేను సహించను.

"ఏమండీ! కోపం పోయిందా?" అంటే నా మన స్సెంత నీరైపోయేది? అందాకా ఎందుకు? ఆ సమయంలో నేను రాగానే దీనంగా ఒక్క చూపు చూస్తే చాలదూ? కాళ్లమీద పడి క్షమాపణ వేడుకోనూ? అదేమీ లేకుండా అంతతృణీకారభావమేం? నేనూ క్షణమన్నా ఆగకుండా సావిట్లో కెళ్లిపోయా. తెల్లారింది—నాకు సావిట్లోనూ, దాని కా గదిలోనూను.

ముసిముసిచీకట్లోనే అత నొచ్చాడు "ఎలా ఉందిరా?" అంటూ. నే నేమీ జవాబు చెప్పకూడదనుకున్నా. "ఏం? పోయినట్టే వుందే మొహం చూస్తే?" అంటూ మొహమ్మీద చెయ్యేశాడు. అప్రయత్నంగానే "ఁఆ, తగ్గిపోయింది. పొద్దున్నే ఒచ్చావే?..." అని సోఫాలో కూర్చోపెట్టి, "కాఫీ తయారుచేయించవే! అతనుకూడా ఒచ్చాడు" అని కేకేశా. అతను కూర్చోకుండానే "ఆఁ, ఫరవాలేదులే. అర్జంటుకేసు. న్యూమో

నియోట. తెల్లారుఝామునే వచ్చారు పాపం—మళ్లీ వస్తా"నంటూ, "అమ్మాయి!" అని కేకేసి, "లోపలుందేమోలే!" అనుకుని "ఇంకో మోతాదు పంపిస్తా కుర్రాడిచేత" అని నాతో చెప్పి గుమ్మం దిగేశాడు. "అదేమిటీ, కాఫీ అన్నా తాగకుండానా?" అంటూ అనకోకుండానే అతనితో వీధిలో నాలుగడుగులు నడిచి 'ఉంటా' నని వెనక్కి తిరిగి మనస్సులో నా బలహీనతకి నన్ను నేనే నిందించుకుంటూ లోపలికొచ్చి గదిగుమ్మంలోంచి తొంగిచూస్తే అది యింకా పడుకునేవుంది.

తొమ్మిదింటికి నేను ఆఫీసుగదిలో కాగితాలు చూసుకుంటూంటే పనిమనిషి నాముందరనుంచి నాకేసే చూస్తూ రెండుమూడుమాట్లు యిటూఅటూ తిరిగింది. నాతో ఏమన్నా చెప్పాలంటే అలా చెయ్యటం మామూలు. "ఏం?" అన్నా.

"...౧౦౧ ఉండిటండి. యింకా లేవలేదు అమ్మగారు..."అంది భయపడుతూ. నేను ఉలిక్కిపడి కలం చేత్తో పట్టుకునే దానిదగ్గిరికెళ్లి ఒళ్లుపట్టుకుచూస్తే కాలిపోతోంది. కొంచెం కలవరపడుతూ "జ్వరమల్లే వుందే!" అన్నా.

"ఊఁ" అంది జాలిగా. జ్వరం ఎందుకు రావాలి? "డాక్టర్ని పిలుచుకొస్తా" నంటూ లేచా.

"అతన్నేనా?" అంది అదోరకం ఊపుతో.

"అతన్నేనా!" అని ఆశ్చర్యపడుతుందేం! అంటే అతన్ని పిలుచుకు రాకూడదనా? లేకపోతే అతన్నే పిలుచుకురావాలనా? అవునూ, ఆ వెకవెకలూ, పకపకలూ నా కిష్టం కాలేదు. నా అయిష్టతని సూచించటానికి కొంచెం తొందరగా ప్రవర్తించినమాట వాస్తవమే. సరే జ్వరం వచ్చింది. మొదట్లో అతన్నే పిలుద్దామనుకున్నా. నిజాని కతను మా యింట్లో డెబ్భైఆరు జబ్బులు నయంచేశాడు. కాని యిప్పుడతన్ని పిలవటం అసంభవం. నాకు చేతకాదు. అతనింటి ముందర్నుంచే వెళ్లి యింకోడాక్టర్ని పిలుచుకొచ్చా. కొత్తడాక్టర్ని చూసి అది నా మొహంలోకి అర్థయుక్తంగా దృష్టుల్ని సారించింది. "అంతే!" అన్నట్టుగా నేను గంభీర మౌనంతో వాటికి జవాబు చెప్పా.

ఏదో మందిచ్చి బండీఎక్కి వెళ్లబోతూ "౧౦౩ దాటింది. ఉడుకులాం వెయ్యండి వెంటనే. మంచుగడ్డ పెట్టినా పెట్టచ్చు" అని నాతో చెప్పి అటు తిరిగే సరికి, కేసులు చూసుకుని అప్పుడే మాయింటికి రావటానికే ఎదురొస్తూన్న అతని "ఏమిటి? ఎవరికి జబ్బు?" అని ప్రశ్నిస్తున్న చూపులకు కొత్తడాక్టరే "ఆయనభార్యకు ౧౦౩ దాటింది...ఇప్పుడే ... చూడమంటేనూ" అని తడబడుతూ జవాబు చెప్పటం, ఉలిక్కిపడి అతను లక్షభావాల్తో గజిబిజిగా ఉన్న చూపుల్ని నాకేసి తిప్పటం, వాటికి తాళలేక నేను మొహం తిప్పేసి యింట్లోకి పోవటం ఒక్కమాటే జరిగాయి. కొత్త డాక్టరుబండీ చక్రాల రొదలో అతని హృదయ స్పందనం నాకుగాని, నాదీర్ఘశ్వాసలు అతనికిగాని అవగతం కాలేదు.

మొన్నాడు ౧౦౪ వచ్చింది. నాకు గాభరాపుట్టి మా అత్తగారికి టెలిగ్రాం యిచ్చా. ఆవిడ తన పెత్తల్లి కొడుకుదగ్గిరికెళ్లి వారంరోజులు కూడా కాలేదు. వచ్చి "కొత్తడాక్టర్ని పెట్టారా? నేను వెళ్లేసరికి బాగానే తిరుగుతోందే? ఇంతలోకే ఎలా ముంచుకొచ్చిందబ్బా!" అంది. నేను సమాధానం చెప్పలేక దానికేసి చూశా. అది నా మొహంలోకి చూసి తనతల్లి వేపు తలతిప్పింది. ఆవిడా మాట్లాడలేకపోయింది. తరవాత, సంగతంతా తెలుసుకుని మరీ వేదనపడటం మొదలెట్టింది... ఆరోజు కారోజు జ్వరం హెచ్చిపోతోంది. జ్వరబలంమూలాన నీరసం బాగా కనిపించకపోయినా, బొత్తిగా ధారకం లేకపోవటంచేత శరీరం శుష్కించిపోవటం మొదలెట్టింది. అతన్నితప్ప ఊళ్లోవున్న పెద్ద పెద్దడాక్టర్ల నందర్నీ పిలిచా. న్యుమోనియాఅనీ, టైఫాయిడనీ, యిన్‌ఫ్లుయంజాఅనీ, మలేరియాఅనీ తలోరకంగా చెప్పారు. నాకు తత్తరపాటెక్కువైంది. అతనతప్ప ఇంకోళ్లెవరూ నయంచెయ్యలేరని మాఅత్తగారి దృఢవిశ్వాసం. ఆసంగతి నాకూ తెలుసు... ఏంరా అంటే ఏంరా అనుకునేవాళ్లకల్లా ఎడమొహాలూ పెడమొహాలూ అయ్యాయి. దురదృష్టం తరుము

కొస్తోంది. రెండుమూడుసార్లెదురుపడితే నేనే మొహం తప్పించేశా. మానవసహజమైన గౌరవాన్నికూడా త్యజించి ఓరోజు రోడ్డుమీద ఎదురుపడి "ఎలా వుంది?" అని అడిగాడు. జవాబు చెప్పక పోదా మనుకుంటూనే "అలాగే వుంది" అని మాత్రం అంటూ దులపరించుకుని చరచరా వెళ్లిపోయా. అతని భార్యమాత్రం రోజూ ఒచ్చిచూసిపోతూనే వుంది.

మనస్పృహలేకుండానే రోజులో చాలా గంటలు గడుస్తున్నాయి. పైగా ఆరోజు సాయంత్రం వేళ మంచంమీదే, కొంచెం లేవాల నుందంటే లేవ దియ్యబోయేసరికి గాభరాఒచ్చి పడిపోయింది. కాళ్లూ చేతులూ విరగదొక్కుకుంటూ గాభరా తగ్గినతర్వాత "ఎలా వుంది?" అని అడిగితే, నాకేసి దీనంగా చూసి కన్నీళ్లు కార్చింది. నాగుండెలు తరుక్కుపోయాయి. వెనకటి దృశ్యాలు ఒక్కొక్కటిగా నాకళ్లముందర్నుంచి పరిగెత్తుకొనిపోతూ నామనస్సుని కోసెయ్యటం మొదలెట్టాయి. ఈవ్యాధికి కారణం నేనని నాకు మొదటి నుంచీ తెలుసు. చికిత్సకూడా నాకు తెలీందికాదు. తెలిసికూడా, మగతనం, అందులోనూ భర్తృత్వాన్ని అహంకారంతో మిళితంచేసి నిర్మలమైన యీజీవిని హతమారుస్తున్నా.

జలజలా కన్నీరుకారుస్తూ "క్షమించవూ?" అన్నా. ఈమాట ఆరాత్రే అంటే! అప్పుడు నేను చచ్చిపోయా!!

"అతన్ని పిలుచుకు రారాదూ" అంది మా అత్తగారు. నేను లేచా. అంతకి మూడురోజుల్నుంచి కేవలం సంజ్ఞలే తప్ప పెదిమెలు కదిలించటానికి శక్తిలేని మనిషల్లా "అరె... నేనా?" అంది. అని తల్లికేసీ, నాకేసీ ఒక్కమాటుగా చూసి తల వాల్చేసింది. అంతే, మళ్లీ తలెత్తలేదు. మా అత్తగారు బావురుమంది. నేను పిచ్చివాడిమాదిరిగా పరిగెత్తుకు పోయా. అతనూ అప్పుడే గాభరా సంగతి వినిమాయింటికి ప్రయాణమౌతున్నాడు. చూపుల్తోనే ఒకళ్ల హృదయాలొకళ్లు గుర్తించుకున్నాం. "నేను రాక్షసిని..."అన్నా ఏడుపు ఆపుకుంటానికి ప్రయత్నంచేస్తూ. "నేను పిశాచాన్ని"అన్నా డతను కన్నీరు కారుస్తూ... రెండంగల్లో గదిలోకొచ్చి "అమ్మాయీ!" అన్నా డతను. కంఠధ్వని గుర్తించింది. మొహంలో మటుకు మందహాసం కనిపించింది. కళ్లు తెరవటానికి ప్రయత్నమన్నా చెయ్యకుండానే మహాకష్టమ్మీద "వెళ్లిపోతున్నా. శలవు" అనే అర్థం ఒచ్చేట్టుగా చెయ్యి ఎత్తి వాల్చేసింది శాశ్వతంగా.



# పత్రికా 'సంపాదన'



శ్రీ భమిడిపాటి
కామేశ్వరరావు

తెలుగుజనం రమారమి మూడుకోట్లు. వీళ్లనిమిత్తం లోగడ ఉండేసిన పత్రికలూ, వెనకనించీఉండుకుంటూన్న పత్రికలూ, ఇటీవల బయల్దేరిన పత్రికలూ ఒక్కొక్క సారిచొప్పున లెక్కవేసి చూస్తే, వందలుగా ఉన్నా వేలల్లో పడవన్న మాట నిజం. తెలుగు జనాభాలో కొన్నోవంతుమాత్రం జనాభా గల ఇతరులనిమిత్తం తెలుగుపత్రికల సంఖ్యకి కొన్ని రెట్ల పత్రికల సంఖ్యా, ప్రతుల సంఖ్యా ఉండడంకూడా అబద్ధంకాదు. కొంచెం జాగ్రతగా వెనక్కి చూస్తే, మూడువందల ఏళ్ల కిందట పత్రికలు ఇండియాలోగాని, ఇంగ్లండులోగాని, భూమిమీదగాని లేనట్టు తెలుస్తుంది. ప్రస్తుతం లండన్, న్యూయార్క్ వంటి ఒక్కొక్క మహానగరంలో వందలాది దైనిక పత్రికలే ఉన్నట్టు చదువుతాం. అటువంటి పరిస్థితులు గమనించి, తెలుగులో ఇంకా ఎన్నివేల పత్రిక లుండాలోగదా అనేవాళ్లున్నారు. కాని, ఇతరుల కర్మంకొద్దీ వాళ్లకన్నిపత్రిక లుంటే, మనికికూడా అల్లా ఉండడం మన కర్మమా ఏమిటి పోదురూ అనే దేశాభిమానులూ ఉండగల్రు. తెలుగులో, పత్రికాధిపతులు శ్రమపడి పత్రికని సంపాదించి ప్రచురించడంలో చూపెట్టే కృషీ, పత్రికా పాఠకులు శ్రమపడి పత్రికని కొనగలిగీ కొనకుండా సంపాదించి చదివేసి పారెయ్యడంలో చూపెట్టే కృషీ, ఒకదాన్ని ఒకటి మించిపోతూన్నట్టు కనిపిస్తుంది. ఏమైనా, పత్రికా ప్రపంచంలో తెలుక్కి స్థానం ఎక్కడో అక్కడ ఉండితీరుతుంది గనక, పత్రికల జననం, వాటిని సంపాదించి ప్రచురించడంలో ఉండే సుళువుబలువులూ, వాటిని సంపాదించి చదవడంలో ఉండే సబబు బేసబబులూ, వాటి ఆవశ్యకతా పరమావధులూ గమనించడమే ఈరచన యొక్క ఉద్దేశంగాని మరోటి కాదు.

జనం అంతా బయల్దేరి ఏదేనా ఒక్కొక్క పత్రిక పెడుతూంటరు, చదివే జనాన్నిగాని, చదవకపోతారా అనే జనాన్ని గాని చూసుగొని ఒకడే పెడుతూంటాడు. కాని, అది కాల

క్రమంలో జనామోదం పొందితే దాని అభిప్రాయాలు జనబాహుళ్యంలో వ్యాపించి, జనాభిప్రాయాలు దాని ముఖతా పలుకుతూండి, అది జనవాక్యంతో అభిన్నం అవుతుంది. ఎంత గొప్ప వ్యక్తిత్వంగల మానవుడైనా సంఘజీవే గనక లోకంలో ఉండే, నాటి, నాటిమానవుల యోగక్షేమాలూ, స్థితిగతులూ తెలుసుకోవాలనే కుతూహలం గలవాడవడమే పత్రికల ప్రాదుర్భావానికి కారణం. సత్య ధర్మ నీతి మతపరిపాలనల గురించి మానవసామాన్య ప్రచార నిమిత్తంగాని, ప్రత్యేకసంస్థల వెల్లడి నిమిత్తంగాని పత్రికలు పుట్టగలవు. కేవల వర్తకవస్తు విషయిక ప్రకటనావసరమే కొన్నిపత్రికల్ని లేవదీయచ్చు. అన్యాయం, అధర్మం, అక్రమం, అమానుషం అయిన తమ చర్యలు నలుగురి నోళ్లా పడడం దుర్భరం అని ఆపనులు చేసిన మానవులు వెంటనే తెలుసుకుని బాధపడి ఆపనులగురించి పశ్చాత్తాపపడడంగాని, ఇతరులు అటువంటివి మరిచెయ్యడానికి యత్నించకుండా ఉండడంగాని జరుగుతుందేమో అనే ఆశ కొన్ని మనస్సుల్లో నిలిచిఉండడమే పత్రికలు పుడుతూండడానికి కారణం అని కొందరంటారు. ముద్రాయంత్రసృష్టే పత్రికా విజృంభణకి పరమకారణం అని నమ్మేవాళ్లు చాలామంది ఉన్నారు. ఆంగ్లాభ్యాససంవల్ల రేకెత్తిన అధికార ప్రియత్వంతో మిళితమైన జనోద్ధరణకాంక్ష గల నిరుద్యోగ దేశాభిమానులుకూడా కొంతవరకు పత్రికోత్పత్తికి కారణం అంటారు. ప్రజకి అభిరుచి చెడింది- నేను సరిజేస్తాను; ప్రజకి బోధ జరగడంలేదు- నేను జరుపుతాను; ప్రజలు చెప్పుడుమాటలు విని తప్పుడుదారిని పోతున్నారు - నేను మళ్లేస్తాను మోస్తరుగా అనే అహానికి ధనం సాయం కావడంతోటే పత్రిక అవతరించవచ్చు. అదికాక "ఏపనయితేం, సరిగ్గా చేస్తే మూణ్ణిమిషాల్లో చెయ్యొచ్చు"అని వాదించే క్రియాశూన్యు లుంటారు. పత్రిక నడపడం గురించి వాళ్లు ఈరీతిగా ఉపన్యసిస్తూంటారు:

"ఏముందీ! ఒక్కొక్కరికి బాగా కసి బయల్దేరుతుంది. ఆ కసి యావత్తూ దేశాభిమానం అనే మాటతో పావనం అయిపోతుంది. 'దేశాభిమానం' అంటే అర్థం అడిగినా, తేల్చమన్నా బేరసజ్ఞత కాబట్టి కోపాలు పుట్టించవచ్చుగనుక, అది భావకవిత్వంలో జేరుతుంది. ఇక అనుకుంటా డనగానో, అనుకోకుండానో అతనికి కొంతడబ్బు దఖలుపడి చేతిలో మిలమిలలాడుతూ ఉంటుంది. ఇతరకసిగాళ్లని కొందరిని పడగొట్టి అతడు వాళ్ల చేత తల ఊపిస్తాడు. ఆసొమ్ము కాస్తా నోంనోచిందాకా వాడికి కునుకట్టదు. సర్వజనానికీ తెలిసేలాగ నిత్యకృత్య వ్యావహారిక భాషలో పత్రికలు ఉండవచ్చుననీ, ఉండవలెననీ దెబ్బలాడే అఖండులు బయల్దేరడంచేత, పత్రిక నడిపేవాడికికూడా భాషా పాండిత్యం అనవసరం అనుకునే మహానుభావుల పరిషత్తులో అతడు గౌరవసభ్యుడైపోతాడు. ఓంప్రథమం అమృతాంజనం వంటివాట్ల ఘోషణరుసుం చేతులో వేయించుకుంటాడు. ప్రభుత్వ విషయాలు గోడమీది పిల్లివాటంగా రాస్తాడు. డబ్బు రాల్చని ధనాధికుల్ని నిరసిస్తాడు. బుద్ధిప్రజ్ఞ గలవాళ్లమీదికి అంతగా వెళ్లడు, వీలైతే వాణ్ణే కట్టుగుంటాడు. వీలైనన్ని ఫిల్ములు అతనికి అడ్వర్టైజుమెంటు ఇవ్వడం మానేవరకూ బాగున్నా యంటాడు. ఒక్క రాజ

కీయం, ఒక్క మతం, ఒక్క సారస్వతం మాత్రం తనవల్ల కాకపోవడంచేత సంఘాన్నీ, విద్యనీ మరమ్మతు చెయ్యడానికి వీరకంకణం స్వంతఖర్చుమీద కట్టుగుని, వ్యక్తుల్ని ఉదహరిస్తాడు. ఆ ఉదహరింపబడే వ్యక్తులవల్ల తనకి నష్టం రాకుండా ఉంటే వాళ్లమీదికె రథమే తోలేస్తాడు. స్వవిషయం చాలా "ఇది"గా రాస్తాడు. విదేశవార్తలకి లోగడ అచ్చుపడ్డ ఆంధ్రేతరపత్రికల్లో ఉండేసిన వాటికి తర్జుమా లిస్తాడు. దేశవార్తలకి, మంచివి — అనగా తెలుగుదేశానికి చెందనివి - ఏరతాడు. ప్రధానవ్యాసంయొక్క విషయం సమస్య కానిదిగా చూసుగుని, అంకెలు లేకుండా లోతుపాతులు కదలకుండా, అసలు లోతుకే దిగకుండా, అంటీ ముట్టకుండా, తామరాకుమీది నీటిబిందువులా వ్యవహరించి, చివరకి పరమనీతీ, లోకకల్యాణమూ గురించి ముక్తాయికొడతాడు. పండితప్రీతికరం ఎల్లానూ కాదు, పామరభయంకరంగా మాత్రం ఉండేనిమిత్తం పద్యరచన చేస్తూ, పద పాద అర్థ భావ అన్వయస్ఫురణలు లేని అక్షరగుచ్ఛాలు వీలైనంత ఎడంఎడంగా కొట్టిస్తాడు. వ్యాసరచనలకి సంఘంలోంచి తీసిన పిట్టలకథలు రాయిస్తాడు. వితంతువు సంఘంలో ఒకపక్షి అవడంవల్లగావును ఆ గాథలన్నీ వస్తాయి. లేకపోతే పరకీయప్రేమ ప్రస్తరించి విస్తరిస్తాడు. లేక, రచయితయొక్క స్వంత పచ్చిపిచ్చివిషయంలో కలిగిన బాధలూ, జరిగిన ఆశాభంగాలూ, అయిన పరాభవాలూ, దక్కిన మంగళహారతులూ, తిన్న ప్రహారణాలూ, వచ్చిన పరామర్శలూ, మారుపేర్లతో మాటల్లో శిలసంతనా చేసి ఉన్న రచనలు వెలుగులోకి లాగుతాడు.

స్థానికవార్తలకి ఎండలూ, వానలూ, కూనీలూ, కూనీ అంత పనులూ, 'జయప్రదం'గానూ, ఉచితమైన ఉత్తరప్రత్యుత్తరాలతోనూ, 'గంభీరోపన్యాసాల'తోనూ, అధ్యక్షుల 'అంత్యోపన్యాసాల' తోనూ, కరతాళధ్వనులతోనూ జరిగిన మహాసభలు ఉండితీరతాయి. చాలాసభలు తమ వృత్తాంతం పత్రికల్లో పడ్డతరవాతే బాగుండడం ప్రారంభిస్తాయి. బహిరంగలేఖలు అసలు వాళ్ల అంతరంగాన్ని మాత్రం ముట్టక కడంవాళ్లకి చక్కిలిగిల్లి పెట్టేపాళంగా ఉంటాయి. పడే ప్రకటన ఘోషణలు సాధారణంగా మానవశరీరంలో ఆపాదమస్తకంగా ఏదో అంగానికి సంబంధించి, ఆయారోగంయొక్క తక్షణనివారణ సూచించుతూ, ఉత్ప్రేక్షయొక్క మాహాత్మ్యన్ని పొందినవై, అవస్థల్లో ఉండే పండిత పామరుల్ని రహస్యంగా ఆకర్షించి నమ్మకంగా దగాచేసేవయి ఉంటాయి. విశేషాలు సాధారణంగా సశేష నిశ్శేష పరిశేషాలు అయి ఉండి, గంభీరంగా అచ్చుపడడానికి తగిన రకం అయిఉండి, ఒకవేళ వాటి యాథార్థ్యం తరవాత శంకలో పడడం తటస్థిస్తే వెంటనే చింతిల్లి తక్షణం ఉపసంహరించుకోడానికి వీలైన ప్రాశస్త్యం వహించిఉంటాయి. ఇతరరచనలలో తస్కరణాలు లేకపోతే సరేసరి, ఒకవేళ ఉంటే శాస్త్రోక్తక్షమాపణరూపంలో అజ్ఞానాస్త్రప్రయోగం చేసేసరికి పాపం శాంతం అయిపోయే నాడెం కలవి అయిఉంటాయి. గ్రంథవిమర్శ దేశ కాల పాత్ర మంత్ర తంత్ర కర్తృ భోక్తృపరిస్థితులకి అనుకూలించి, కొండొకచో నలయాదవరాఘవ పాండవీయాన్ని స్ఫురణకి తెస్తుంది. ఇతర పత్రికలతో పిరాయింపు సంబంధం ఆచారంలో ఉండడంచేత

అటువంటి హడావిడికి పరిశ్రమ పడనక్కర్లేకుండానే, ఒక్కటేస్తే అన్నీ రాల్తాయి"— ఇటువంటి ఆలోచన చేసేవాళ్లకి పత్రిక ఎవడు నడపలే డేమిటి అనిపిస్తుంది.

కాని, సాధారణంగా క్రియాశూన్యుడైన ఆదర్శవాది ప్రతీదీ మహత్తరంగా ఉండాలని కోరడమే కాక, ఆచరించేది మరొకరు గనక, కావలసినన్ని షరతులు పాటించి మరీ చెయ్యాలి ఏపనైనానూ అంటాడు. అటువంటివాడు, పత్రిక నడిపించడాన్ని గురించి ఇల్లా మాట్లాడగా వింటాం: "అబ్బో! తథాకాటయ్యా, పత్రిక నడిపించడం అంటే! అది అవధానంపైమాట! కత్తిమీద సాం! స్వదేశ విదేశాల ఆర్థిక నైతిక సాంఘిక సారస్వత రాజకీయాలు పుట్టుపూర్వంగా తెలిసి ఉండాలి, కాని సమయం వస్తేగాని దస్తరం విప్పకూడదు. పురాణాలు సహా తెలియాలి, కాని నవీనశాస్త్రాభివృద్ధి కూడా గ్రహించి ఉండాలి. చరిత్రలు చెప్పెయ్యాలి, కాని పౌర్వాపర్యం తడబడకూడదు. మితిలేని అంశాలూ, సంప్రదాయాలూ తెలియాలి, కాని కొలచొప్పున రచన ఉండాలి. భాషా పాండిత్యాలు ఉండాలి, కాని రచనలో వాటికి కళ్లెం పట్టాలి. సత్వర అవగాహన ఉండాలి, కాని ఒకేపక్షం చూస్తూ కూచో కూడదు. జీవితావసర విషయంగాని పుచ్చునోకూడదు, కాని ఆసువుగా రచించాలి. ఆవేశం ఉండాలి, కాని నిదానం ఉండాలి. ప్రతీ విషయం బోలెడు తెలియాలి, కాని కోరినసైజులో మాటలు చెప్పాలి. రోజూ రాయాలి, కాని ఎప్పటికప్పుడు నవనవోన్మేషంగా ఉండాలి. ఒక్కొక్కప్పుడు విషయం నిర్గుణం కావచ్చు, కాని రచనమాత్రం సగుణంగా ఉండాలి. సంగతులు పై చివర వాడికి కూడా కొత్తగా ఉండాలి, కాని కడగొట్టుజనుడికి కూడా తెలిసే పాతమాటల్లో ఉండాలి. విశేష ధారణాశక్తి ఉండాలి, కాని అద్భుతభావనాశక్తికూడా ఉండాలి. మంచి ముంజూపు ఉండాలి, కాని చాలా వెనుజూపూ ఉండాలి. అపార సామర్థ్యం ఉండాలి, కాని సాధారణంగా వాడకూడదు. జనంతో ఎక్కువ పరిచయం ఉండాలి, కాని చాలా నిర్మొహమాటం ఉండాలి. సంస్థల్ని మన్నించి నిలపెట్టించాలి, కాని అవసరం అయితే వాటినిఎదుర్కొని మట్టించాలి. అధర్మం వెంటనే బయటపెట్టాలి, కాని మళ్లీ లిఖిత సాక్ష్యంకూడా ఉంచుకోవాలి. యథార్థం చెప్పాలి, కాని ఔచిత్యం చూడాలి. సర్వజనావబోధ అయేటట్టు రచించాలి, కాని విశిష్టమైన ప్రత్యేక శైలి కలిగిఉండాలి. వివిధ రచనాకౌశల్యం ఉండాలి, కాని అన్యరచనల కోసం పాకులాడితీరాలి. వ్యక్తుల్ని తూలనాడనూకూడదు, కాని లక్ష్యమూ చెయ్యకూడదు. ధనం ఉండాలి, కాని అది ఆఖరవుతూండడం రూఢి గనక దాన్ని గురించిన బొటాబొటీ పడుతూండితీరాలి. అంతరాలూ, అంతరార్థాలూ తెలియాలి, కాని అంతా రాసేస్తూండి అవాంతర తద్దినాలు కొనుక్కుంటూండకూడదు. అభయం కనపరచాలి, కాని సత్యధర్మాలకి దాసోహం చెయ్యాలి. మంచి కోపం, రోషం ఉండాలి, కాని మంచి క్షమా, శాంతం ఉండాలి. చాలా విచక్షణ ఉండాలి, కాని కేవల సమత్వం చూపించాలి. ఉన్నతమైన అభిరుచి సంస్కారాలుండాలి, కాని అవి లేనివాళ్లతో కూడా వ్యవహరించి అవి వాళ్లల్లో నెల

కొల్పాలి. జనాన్ని కసురుకోకూడదు, కాని వాళ్ల మాటలే వాళ్లతో మాట్లాడుతూ వాళ్లకి బోధ చెయ్యాలి. ప్రతిదాల్లోనూ దిగాలి, కాని ఎందులోనూ దిగబడకూడదు. చాలా సాహసం ఉండాలి, కాని మొన్నాడు మళ్లీ తల ఎత్తుగుని తిరగాలి. సంఘ తత్వం గ్రహించుకోవాలి, కాని ప్రభుత్వ తత్వం గమనించాలి. ఘాటుగా ఉండాలి, కాని ఆరిందాగా ఉండాలి. అభిప్రాయాలు ఉండాలి, కాని అభిప్రాయ భేదాలు ఆహ్వానించాలి. మానవజీవితంయొక్క దివ్యత్వం స్థాపించే విశ్వప్రేమను గురించిన రచనలు ఒప్పుగోవాలి, కాని ఇంతా చేసి మానవ ప్రేమ అంటే పశుప్రేమ మాత్రమే అని సూచించే రచనల్ని— పశువులకంటె పశువులైన కొందరు జనాన్ని ఆకర్షించవచ్చు గదా అనే నెపంమీద— ఆదరించగూడదు. పూర్వకవిబ్రహ్మల్ని శిరసావహించాలి, కాని భావి కవిబ్రహ్మల్ని మొదట తనే పోల్చి జనానికి వ్యక్తపరచాలి. జీవితం గురించి స్థిరమైన దృక్పథం ఉండాలి, కాని మొదటిమాట దృష్టి ఉండాలి...." ఈ బాధ్యతల్ని పట్టి చూస్తే పత్రిక ఎవడు నడపగలడేమిటి అనిపిస్తుంది. అశ్రమత్వ వాదుల వాదానికి ఉపా రెత్తిపోయి మానలేక, ఆదర్శవాదుల వాదానికి తా రెత్తిపోయి మానక, మధ్యరంగంలో కొందరు, వీలైనంత తెలుగువాళ్లు, కొన్ని తెలుగుపత్రికలు నడుపుతూనే ఉన్నారు. నడపగలరు. అవసరం అయిన వ్యవహారం ఎన్నడూ అడ్డదు. ఎటొచ్చీ, జరుగురు చూసుకోకుండా సరఫరా జారీచేసే అధిపతులు కించిద్బాధతో నిష్క్రమించవలసి ఉంటుంది.

ఇక, పత్రికలు చదవడంలోకూడా అవస్థలున్నాయి. ప్రథమావస్థలో పత్రిక ఊరికే ఇచ్చినా అఘాయిత్యం అని పుచ్చుకోరు. రెండో అవస్థలో ఊరికే ఇస్తే పుచ్చుగుని పొట్లాలు కట్టుగుంటారు, అట్టలేసుగుంటారు. మూడో అవస్థలో ఊరికే ఇస్తే పుచ్చుగుని చదివి దాచేసుగుంటారు. నాలుగో అవస్థలో ఎల్లానో అల్లా 'సంపాదించి' చదువుతారు గాని, కొనరు. మొత్తంమీద చూస్తే, తెలుగుదేశం ఈ అవస్థ దాటనట్టు కనిపిస్తుంది. తెలుగుపత్రికాపాఠకుల్ని, స్థూలంగా, పత్రికలు కొనేవాళ్లూ, కొననివాళ్లూ అని విభాగించవచ్చు. కొనేవాళ్లల్లో దర్జా, మొహమాటం, బలవంతం, విధి, వ్యసనం, కసి, వర్తకం, ముఖ్యంగా ప్రయాణం, సుస్తీవంటి అవస్థాభేదాలవల్ల కొనడం అనేది జరిగిఉండవచ్చును. తక్కినవాళ్లల్లో దారిద్ర్య బాధవల్ల ఎంత ఇష్టం ఉంటేం తాఖతులేక కొనలేనివాళ్లుంటారు. వాళ్లు కాక, అప్పనంగా గాని, ప్రతిఫలంగా గాని, స్వవిషయంగా గాని, మెహర్బానీగా గాని, చిరునామా తేడాలవల్ల గాని పత్రికలు సంక్రమించినప్పుడు అవసరం అనేది లేకపోవడం చేత కొందరు కొనరు, వారు కొనవలసిందని ఎవళ్లూ అననూ అనరు. అంతవరకు సరే. కాని, పఠించాలనే తహతహతో (అది పూర్వపుణ్యవశంచేతగాని లభించదు!) అంతర్యంలో బాధపడుతూ ఇంతా చేసి అవలీలగా కొనగలిగి, అయినా సరే కొనక, కొనడానికి కావలసిన సొమ్ముకంటె చాలా ఎక్కువ సొమ్ము భౌతిక జీర్ణకోశం నిమిత్తం కైంకర్యం చేస్తూ, ఎరగనివాడి పత్రికకూడా మామూలు మర్యాదాకూడా పాటించ

కుండా 'సంపాదించి', ఇతరులు తమ కళ్ల ముందు పెట్టిన ఖర్చుమీద తమరు లాభం పొందగలగడం అనే తమ ప్రయోజకత్వానికి తమరే లోపల కులికిపోతూ చదువుకు పోయే ధనికు లున్నారు. వీరిలో రకాలకి హద్దున్నట్టు తోచదు. వాళ్ల చేష్టలవల్ల వాళ్ల మనస్సుల్లో ఉండగల ఆలోచనలూ, సబబులూ ఊహిస్తే ఈ క్రిందిరీతిగా ఉండవచ్చును. కొన్నికొన్ని పైకికూడా అనబడ్డవే కూడానూ!!

“నేను మరోటి కొని ఏడిచాన్టోయ్, పత్రిక కొనడానికీ! సంపాదించాలి గాని, కొనడంలో ఏముంది!— అదను వస్తే నేను రూపాయి చిల్లపెంకులా గిరవటేస్తాను. అంతేకాని, కానెట్టి పత్రిక కొంటానూ! అడగక్కర్లేదు!—సంగతి గ్రహించి చక్కాపోడానికి గవ్వైనా ఖర్చు కాకుండా జాగ్రత్త పడడం జన్మతారకం అని నా విశ్వాసం. అందుకని పత్రిక కొనడం అనేమాట నా దగ్గిర మర్యాదస్థు డెవడూ ఎత్తడు!— నేను పత్రిక చూస్తాను గాని, తినేసెయ్యనుగా, తెలకపిండి తిన్నట్టూ! అటువంటప్పుడు ఒక పత్రిక కొనేసుగున్నవాడిదగ్గిర ఠీవిగా నేను పత్రిక పుచ్చుగోడంలో వాడి సొమ్ముకి నష్టం ఏముంది, మధ్యవాళ్ల సొమ్మేం పోయింది, దౌర్జన్యం ఏముంది, పుట్టిములకే ఏముంది? ఇస్తే సరేసరి. ఇవ్వడం వాడి విధి, ధర్మం. కనక నేను కృతజ్ఞతేనా చూపెట్టక్కర్లేదు. ఇవ్వడా, ఓరి నీ చదువు నేలబడా అనుకుని మరోణ్ణడిగి తద్వారా ఆ మరోడికి ఆగౌరవం దక్కింపిస్తాను. అంతేగాని కొనను. కొనడం గోల ఎందుకు అసలూ! — పత్రిక ఖరీదు మిక్కిలి తక్కువ అయినా అంతకంటే తక్కువ అయిన దమ్మిడీగాని, ఏగాణిగాని పత్రికలమ్మే కుర్రాడికి లంచం ఇచ్చి పుచ్చుగున్నవాణ్ణడిగి పుచ్చుగుని నిలువుకాళ్ల మీద వార్తలన్నీ ఏకలాటుగా రెండుకళ్లతోనూ, రెండుపెదిమిల్తోనూ నేనుగుటకేస్తానే! ఒకవేళ ఆపత్రికకి మూతి కుట్టేసిఉన్నా అంచులచివళ్లు వేరుచేసి వార్తలనిగ్గు నా కీగంటి చూపుతో లాగెయ్యగల్నే సూదిని లాగినట్టు! అటువంటి నేను పత్రిక కొనాలనుకోడం పిచ్చిఊహ కాక మరేమిటి!— తినుబండాలు చూస్తే అరిగిపోతాయూ? పత్రికలు చూసినంతమాత్రాన్ని అరిగిపోతాయూ? కంటికి ఎంగిలి ఉందా, కనిపిస్తుందా? అయినా దృష్టిదోషం అంటూ కొందరు ఇల్లా పేచీ పెడతారనే కొనుక్కున్నవాడు కుడా మొదట్లో పత్రిక చూడకుండా నేనే విప్పి చూసి యిచ్చేస్తా నని చెబుతూ, ఆ ఎంగిలిబాధకూడా నేను తొలగించుకొనేటట్టే పత్రిక సంపాదిస్తాను. మరి నా అంత శ్రోత్రియుడు పత్రిక కొనడం ఎందుకు!— ఓ సిగరెట్టుగాని, ఓబీడీగాని, ఓ పొడుంపిసరగాని స్వోపయోగానికి తెగించి అన్యుణ్ణే అడగడం అనేది వస్తే ముష్టికిందికి రావచ్చు గాని, ఇంకోరు తమకోసం కొనుక్కున్న పత్రిక నా ఉపయోగంకోసంగాని, నన్నాశ్రయించినవాడి ఉపయోగంకోసం గాని నిశ్శబ్దంగా పుచ్చుగోడం ముష్టికిందికి ఎంతమాత్రం రాదు సరిగదా, అదే నవీన గొప్ప సాహసం అనిన్నీ, చాలా ఘరానాలక్షణం అనిన్నీ నా ఊహ! ఇహ ఎవడు నన్ననేది? నేనా పత్రిక కొనేది!—— డబ్బెట్టి ఓటో రెండో విశేషాలు నేరిస్తే జ్ఞానశిఖరం ఎక్కడం అవుతుందా? గొప్ప విశేషాలు ఈవేళ కాకపోతే

రేపేనా వీధిని పడతాయి. ఈవేళ నేనా కొంటాను?— నా అంత యోగ్యుడు అనేక మంది సమక్షంలో పత్రిక కొనుక్కున్న పీనుగుని విధంచెడి సంజ్ఞతోనో, అభినయంతోనో, నోటితోనో, అడిగో అడక్కో-ఒక్కమాటంటే ఒక్కమాటు పత్రిక తీసుగునేటప్పుడు, వాడు ఏమొహంతో వద్దంటాడో చెప్పండి. వాడు ఏం సాకు చెప్పి బరగెయ్యగలడూ! వాడికి అంతమందిలో సిగ్గుభిడియాలు ఉండనే ఉండవా ఏమిటి! అందుకని నేను నెగ్గితీరతా, సంపాదించి తీరతా! కొనడం!, ఛీ!— అచ్చుకొట్టబడి ఉండడం అనే దోషం పత్రికకి అదివరకే పట్టిఉండడంచేత, అది సంత సొరకాయలాంటి పబ్లిక్ఆస్తి అయిపోయిందిగనక, ఎవడి సొమ్మెట్టి అది కొనబడిఉన్నా నరే, చదువుకోడానికిమాత్రం ప్రతీ ఇతరుడికీ (అందులో ముందు నాకు!) జన్మహక్కు ఉందని నా నమ్మకం! నేనేటండీ పత్రిక కొనడం! ఆహా! ఏమి మీ వెర్రి!—నన్ను ఎరగనివాడైనా నరే పత్రిక కొనుక్కుని తన పక్కని పెట్టుగుని ఇతరపని చూసుగునేటప్పుడు అది వాణ్ణి అడక్కుండా నేను స్వీకరించడం ఒక మహత్తర కళ, ఒక ఉన్నత పరిశ్రమ, ఒక చరిత్రాత్మక సంఘటన అని నావాదన! నేనే, పత్రికే, కొనడమే!—పత్రిక కొనుక్కుని ఎవడేనా కొత్తవాడు చూసుగుంటూఉంటే, నా వేపుకి కనపడే పెడ వీలైనంతమేర నేను చదువుకోడానికి, (అప్పుడే నేను కాఫీహోటల్లోంచి రావడంవల్ల నాకు పొట్టబరువైనా, చుట్ట అడ్డదిడ్డంగా కాలి ప్రమాదం తెచ్చేలాగ కనిపించినా) వంగి లేస్తూ సూర్య నమస్కారాలు చేస్తాను. కొనడంబాధ వదిలిపోతుంది గనక కాస్సేపు అల్లాంటి వ్యాయామం చేస్తే ఏం అన్నాను! నేను కొంటానా? —రైలంటి చోట ఎరగనివా డెవడో ఏదో పత్రిక కొనుక్కుని, కూచున్నచోట పెట్టుగుని, ఇటోఅటో వెళ్ళగానే, అది వాణ్ణి అడిగేదేమి టని తీసి, దాన్ని వీలైనన్ని విడి పత్రాలుగా చేసి, అసలైన వార్తలూ, ప్రధానవ్యాసమూ గల పత్రం నేను లగాయించడానికి ఉంచుగుని, తక్కినవి నన్ను లోగడ ఎంతమాత్రం ఎరిగుండనివాళ్లయినా నరే పక్కవాళ్లకి నిష్పక్షపాతంగా పంచి, తద్వారా దీప దీపికాన్యాయంగా జ్ఞానప్రచారం చెయ్యడానికి నేను నడుంకట్టి వ్యవహరిస్తానుగదా, ఈ ఒక్క సాహసకృత్యంతోటే నాఔదార్యం యావత్తూ మీకు బోధపడుతోంది గదా, నన్నా మీరు పత్రిక కొనమంటారు!— ఒకసారి ఒకడు పత్రిక కొనుక్కుని ఎవ్వరికీ కనపడకుండా మాటుట్టుగుని, తనే చదువుకుని, తరవాత అమాంతంగా దాన్ని పీఠంగా వేసుగుని కూచోగా, అదొక్కసారి ఇస్తే చూసేసి ఇచ్చేస్తా నని, నేను తాంబూలం నములుకుంటూ వాణ్ణి కోరితిని గదా, వాడు అది అధమస్థితిలో ఉందండి అని నసిగేసరికి, నాకు నిమ్నజాత్యుద్ధరణం కర్తవ్యమే అని వాణ్ణి పడగొట్టి పత్రిక పైకి లాగేసి చదువుకున్నాను. నేనా! నేను ఇంకో కిల్లీ కొనుక్కుంటానుగాని, పత్రిక కొంటానూ—ఒక్కొక్క అప్పుడు మక్కువ కొద్దీ రెండు వేర్వేరు పత్రికలు కొనుక్కుని, ఒకటి తను చూసుగుంటే చూసుగోమనండి పోనీను, ఆ రెండోది, పక్కనున్న నాబోటి గొప్పవాడికి "అయ్యా, మిమ్మల్ని నే నెరగను; డబ్బెట్టి పత్రిక కొన్నాను. ఇదిగో! మీరు

చదువుకోడం నాజన్మకి చాలు" అంటూ నాకు ఇవ్వజూపాలనే అల్పమర్యాదా ఎరగడే! అయినా అదే పోయిరని వాణ్ణి క్షమించేసి, వాడి తోందర్లో వా డుండేటప్పుడు మెల్లిగా వాడు చూస్తూండగానే (నాకు భయమా?) ఆ రెండోది సంపాదిస్తాను. వాడు గమనించకపోతే సరేసరి. గమనించినా, ఇంగితజ్ఞానం ఉంటుంది గనక, బోడికోపం చూపించినా ఊరుకుంటాడు. ఊరుకోక, వల్లకాదంటాడా, "ఓస్ అబ్బ, కొన్నావు లేవోయ్, వెధవపత్రిక! ఏ వెధవకి కావాలి?" అంటూ నలుగురిలోనూ నేను వాణ్ణి ఝాడించేసరికి, హడిలిపోయి దిక్కుమాలాడూ బతిమాలి రెండు పత్రికలూ కూడా తెచ్చి చెరో చేతులోనూ పెడతాడు. దెబ్బకి రెండు కాయలు. నేనే! సంపాదిస్తాను గాని, కొంటాను, పాపం!— ఏదేనా పత్రికవాడొచ్చి అది నన్ను కొనమంటే, ఇతర దైనిక, పాక్షిక, మాసిక, అబ్దికాలు కొంటూన్నట్టూ, వాటిమీదే నా చుట్టుపట్లవాళ్లు జీవిస్తూన్నట్టూ బుర కాయిస్తాను, వాడు వెడతాడు. ఏదీ కొనక్కర్లేకుండా గౌరవం దక్కేటప్పుడు ఏదేనా ఎందుకు కొనాలి?—ఇంగ్లీషు పత్రికలు నావి కావు గనకనున్నా, తెలుగుపత్రికల్లో అంతకంటె విశేషం ఉండదు గనుకనున్నా ఏవీ కొనను పొమ్మంటాను, అంతా పోతారు, అప్పుడు కొనడానికే వీలులేదు!— స్వంతం నిమిత్తం కొనుక్కున్న పత్రిక ఎప్పుడుపడితే అప్పుడే చదివెయ్యవచ్చుగదా అనే నిర్లక్ష్యం చేత, చదువుకోడం పడనేపడదు. ఇంకోళ్లు కొన్నది సంపాదిస్తే అవసరంగా కాలనియమ ప్రకారం చదువు ముగించాలి. అంచేత పత్రిక స్వంతంగా కొనుక్కోడం నా మతం కాదు. డబ్బెట్టి పత్రిక కొనుక్కుని మతం మార్చుగుంటానా?—నాఅంత జ్ఞానికి ఏమిటుంటుందీ పత్రికల్లో! కొన్ని పత్రికల్లో పత్రాలే విశేషాలు! నాకు కిట్టద్దూ! నేను కొనను!—ఉచిత పఠనం ఏర్పాట్లు అయిఉండే మందిరాలవాళ్లు నే వెళ్లకపోతే ఏమన్నా అనుకుంటారు, నేను తీరా పత్రిక ఏది కొన్నా, అక్కడికి వెళ్లడం పడదేమో, వాళ్లకి తీరా ఆశాభంగం కల్పించాలేమో అనే భయంచొప్పున కొనను గాని, లేకపోతే భాగ్యమా ఏమిటీ!..."

ఇటువంటి గడసర్లు, ఒఖ్కమాటు చదివేటందుకు పత్రికలు సంపాదిస్తాం అనేవాళ్లు, బహుళంగా ఉండడంవల్లే తెలుగు జనసంఖ్యలో అక్షరాస్యులు దశాంశానికి పైగా ఉన్నా, అచ్చుపడుతూన్న పత్రికల సంచికల సంఖ్య సహస్రాంశానికంటె చాలాతక్కువ. పైచెప్పిన రకాలు తగ్గితేగాని తెలుగు పత్రికలు విరివికావు. ఎందుకూ విరివికావడం అంటే, పత్రిక ప్రపంచంయొక్క తాత్కాలిక చరిత్ర, పత్రిక దేశంయొక్క జ్ఞానానికి సూచనమాత్రమేకాక జ్ఞానంయొక్క తరాన్ని ఉద్ధరించే సోపానం, పత్రిక జీవనం జీవితంగా మార్చగల పరుసవేది, పత్రిక ఉన్న చోటినించే జగత్తు చూడడానికి సులోచనం, పత్రిక మానవజాతిని కలిపే సూత్రం, పత్రిక జనాన్ని ఏకకాలమందే చుట్టబెట్టగల దివ్యశక్తి. పత్రిక ప్రపంచంలోని దురవస్థలు తెలిపినప్పుడు అంతకంటె తనపని నయంగదా అని ఆశ కల్పించడంలోనూ, ప్రపంచంలో ప్రత్యేక వ్యక్తుల మహాకార్యాలు తెలిపినప్పుడు తను ఇంకా కృషి చెయ్యడానికి ధైర్యం కలిగించడంలోనూ మానవుడికి నిత్యపంట. రేడియో వల్ల ఇక ఓ వంద యేళ్లనాటికి భూమిమీద

పత్రికలుగాని, లిపిగాని లేకుండానే వ్యవహారాలన్నీ శ్రావ్యంగా నడిచిపోతాయని ఒక మహాజ్ఞాని మదింపు వేశాడు. ఈలోపులో తెలుగుజనం సుముహూర్తం చూసి తొందరపడి పత్రికల్ని జీవితావసరంగా కటాక్షించడం కర్తవ్యం. అంతా ఒకే ఆహారం తినకపోయినా ప్రతివాడూ ఏదో వోటి ఆర్జించి లోపలికి పుచ్చుకోకపోతే జీవనం శూన్యం అని భయపడి జాగ్రత్త పడ్డట్టే, ప్రతివాడూ ఏదో ఓ పత్రిక ఆర్జించి లోపలికి పుచ్చుకుంటూండకపోతే జీవితం శూన్యం అని భయపడి జాగ్రత్తపడాలి. ఒక్కొక్క ఆంధ్రుడికీ అత్యవసరం అనిపించే పత్రిక ఒకటైనా ఉండాలి. నిత్యపరాన్నభుక్కు కాని ప్రతివాడూ నిత్య పరపత్రికా భుక్కు కాకుండా ఉంటే లక్ష పత్రికలు నిలుస్తాయి. ఒక్కొక్క తెలుగు వ్యక్తికి ఒక విడిపంచికేనా అందేటంతగా పత్రికల సంఖ్య హెచ్చాలి. చక్కని నామధేయమే కాకుండా జోలెడు ఇతరం అమరినప్పుడుగాని పత్రిక స్థాయీపడి వేళ్లు పారదు. సహకారంవల్లగాని పత్రికకి ప్రాశస్త్యం రాదు. వకళ్లలాంటి పత్రికలు అసల్లని ముందే సాగనంపి ఆర్పెయ్యడానికి తోడ్పడతాయి. ఒక పత్రికలో దొరికే సంగతులు అందులోనే దొరకాలిగాని మరోచోట కాదు అన్నట్టు పత్రికలు అన్యోన్య సంపూరకంగా ఉండాలి. పత్రికారచనలో గంభీరమైన భాగం క్షణికానందమూ, తాత్కాలికోద్రేకమూ కలిగించడమే కాక, శాశ్వతమై సారస్వతం అవుతుంది. ఎందుచేతంటే, "తాత్కాలిక సారస్వతాన్ని పత్రికారచన అనాలి. శాశ్వత పత్రికారచనని సారస్వతం అనాలి." సారస్వతం మానవజీవితఫలం — కాదు, మానవజీవితం.





# మావిద్యార్థిదశ-నాఁటికవిత్వం

— శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి —

దీన్నిగురించి యెందుకు వ్రాస్తూన్నానంటే? కవిత్వం చెప్పేవాళ్ల మనోవృత్తులు మొట్టమొదట యేలా వుంటాయో, తరవాత తరవాత క్రమేణా యేలా యేలా మారతాయో జిజ్ఞాసువులు తెలుసుకోవడానికే యీ వ్రాయడం. అయితే అందరి మనోవృత్తులూ వొకటే విధంగా వుంటాయా అన్న శంక కవకాశం లేకపోదు గాని ఆలాటిభేదం మరివొకరెవరేనా తెల్పడానికి యిది మార్గదర్శకం కావచ్చునుగదా!

పరమ గురువులు బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారి సాన్నిధ్యానికి వెళ్లేలోఁగా విశేషించి చెప్పిన కవిత్వం పదకవిత్వం. యేకొంచెమో పద్యకవిత్వమూ వుంది గాని అది చాలాతక్కువ. పద్యకవిత్వంలో మొట్టమొదటిది—

"శ్రీమదఖండవైభవము
చేఁ జెలువారెడి వేంకటాద్రిపై
సామజయాన శ్రీరమణి
చక్కఁగఁ బాదము లొత్త సారదుం
'డో మహనీయసేవిత గు
ణోజ్జ్వల' యంచు భజింపుచుండ ని
ష్ఠే మది నమ్మినాఁడ దయ
నేలుమి శ్రీకర వేంకటేశ్వరా!"

యీపద్యంలో 'వేంకటాద్రిపై' అనే పదాన్నిబట్టి యీవేంకటేశ్వరుఁడు తిరపతికొండమీఁద వుండే వేంకటేశ్వరుఁ డని చదువరులకు తోఁచడం యుక్తమే గాని, నావుద్దేశంలో వున్న దేవుఁడు తాత్కాలిక నివాసం యానాంలో వుండే దేవుఁడు వేంకటేశ్వరుఁడే. మాయిద్దఱిలో (ఆయీ సమయుకు యింకా నన్ను తి. శా. గాని, అతణ్ణి నేనుగాని కలియలేదు, చూడలేదు, వినాలేదు. యెవరికి వారే యమునాతీరే) నాబాల్యదశ

పదేళ్లు మొదలు యావత్తూ యీ వేంకటేశ్వరుని దేవాల యావరణంలోనే గడిచింది. అఱవై యేళ్లు దాదాపు కావచ్చినా ఆ గుడి ఆవరణలో వున్న పొగడచెట్ల కొమ్మలు (మా ఆటలన్నీ కోతికొమ్మచ్చిద్వారా) నును పెక్కినవి యిప్పుడేమేనా మళ్లా గరుసెక్కా యేమో కాని యిప్పటికి పదేళ్లనాఁటికి యింకా నున్నగానే వుండడం పరీక్షించి నేను స్వయంగా చూచిందే. నాకు ఆ దేవుఁడంటేనే ఆరోజుల్లో యెక్కువభక్తి వుండేది (శివుఁడంటే కొంత ద్వేషం వుండేది). యిటీవల దేవీభక్తుఁడుగా నేను కాశీలో కాళికాష్టకం చెప్పే రోజుల్లో మాత్రం ఆ భక్తికి లోటు లేదు. "శైవా వయం" అన్న లీలాశుకుని శ్లోకం తెలిసినవారికి నాభక్తి సమన్వయిస్తుంది.

యీనాంలో వున్న వేంకటేశ్వరునిమీఁద శతకం వ్రాయడానికి మొదలెడుతూ "వేంకటాద్రిపై" అని యెత్తుకోవడ మేమిటి అని ఆరోజుల్లో యెవరూ శంకించలేదు గాని శంకిస్తే జవాబు చెప్పడం కష్టమే. అయితే ఆపద్యంలో యీనాంగ్రామం పేరు వుటంకించకపోవడంచేత ఆ శంక కవకాశం కలిగితే దనుకోవాలి. వొక యింగ్లీషు మెట్రిక్యులేషనదాఁకా చదివిన విద్యార్థి— 'శ్రీమత్ + అఖండ' కల్సితే 'శ్రీమతఖండ' అని కావాలిగాని 'శ్రీమదఖండ' అని యేలా అయిందని ప్రశ్నించడమున్నూ, దానికి నేను అది యేలా అయిందో సూత్రాలు చెప్పడానికి నాకు వ్యాకరణం రాదుగాని, అది తప్పుమాత్రం కాదని జవాబు చెప్పడమున్నూ జరిగినట్టున్నూ, దానిమీఁద ఆవిద్యార్థి పిడివాదానికి వుపక్రమించడమున్నూ, ఆకారణంచేతనే నాకు వ్యాకరణం చదవాలని బుద్ధిపుట్టి—

" వ్యాకరణశాస్త్రమందున
నాకుం బ్రేమమును బుట్టె నయముగ దానిన్
సాకల్యముగాఁ జేయుమి
ప్రాకటముగ మ్రొక్కుచుంటి భార్గవరామా!"

అన్న పద్యం నాలో నేనే చెప్పుకొన్నట్టున్నూ యేదో వ్యాసంలో లోఁగడ వుట్టంకించే వుండడంచేత యిక్కడ స్పృశించి విడిచాను.

ఆ యీ శతకారంభం నాఁటికి "కాజులూ రను నూరఁ గామసోముల యొద్ద నొకమూఁడుమాసము లున్న వాఁడ" అన్నంతవఱకు జరిగింది విద్యార్థిత్వం. జరగడం మాత్రమే కాదు, చదివేది మేఘసందేశంలో పూర్వభాగమే అయినా తెలివిడి పెంతలో వుండంటే— యిఁక మనం చదివితే వ్యాకరణం చదవాలి గాని కావ్యాలు చదవనే అక్కర్లేదన్నంతలో వుండేది. ఆ వ్యాకరణం చదవడమేనా కాశీలో వుండే పండితులవద్ద చదవాలనే కాని యీ దేశంలో వున్నవారివద్ద కాదు. అప్పటి అహంభావమే కాశికి ప్రయాణం చేయించింది (నిజానికి నా చదువుకు కాశీ వెళ్ల నక్కఱ లేదు. దేశంలో మహావిద్వాంసు లెందఱో వుండేవారు). అది విశాఖపట్నందాఁకా మాత్రం సాగించి అంతటో మళ్లా వెనక్కి (మానవా! మనరథంబును మరలనిమ్ము) మళ్లించింది కాని చామర్లకోటలో లఘుకౌముదిని మాత్రం ప్రారంభింపచేసింది. వ్యాకరణం పూర్తి అయేదాఁకా కవిత్వం చెపితే యెవరేనా ప్రశ్నిస్తే జవాబు చెప్పలేక తెల్లఁబోవలసివస్తుందని రచనమాత్రం ఆఁపుచేశాను. లఘుకౌముదితో పాటుగా భారవికూడా చదువుకుంటూ అమరంకూడా వల్లించేవాణ్ణి. "చామర్లకోటలోఁ జదివితి రాఘవాచార్యసన్నిధిని మాస త్రయంబు". చదివింది మూఁడుమాసాలేగాని మూఁడేళ్లు చదివినంతకంటే కూడా యెక్కువ చదువే చదివినట్టయింది. ఆమహాత్త్వం మాధుకరం యెత్తుకొని చదువుకోవడంలో వుందని నేను నమ్ముతాను. అందుకే మన ఆర్యులు వుపనయనవటువుకు "భిక్షాచర్యం చర" అని వుపదేశిస్తారు.

ఆయీ విషయం 'సంటూరిపీఠ'లో "గురుకుల వాసముఁ జరిపి కూరిమి మాధుకరంబు వారముల్" అనేపద్యంలోనే కాక 'ప్రాచీన గురుశిష్యపద్ధతి' అనే శీర్షికతో వున్న వొక పద్యవ్యాసంలోకూడా వివరించి వున్నాను. యితరవిద్యలమాట నేను చెప్పలేను గాని మన వేదశాస్త్రాలు సాధించే విద్యార్థులకు మాధుకరాన్నం చేసే సహాయం అంతాయింతా కాదని నేను ఘట్టిగా చెప్తాను. యిది విషయాంతరం.

ఆకాలంలోదే యీ పద్యంకూడాను:

"శ్రీరామామణి వక్షమందుఁ దనరన్
జెన్నొందు తన్నున్ జనం
బౌరా! చంచలతన్ దొరంగని మెఱుం
గర్థిన్ ధరింపంగఁబో
నీరాజన్యనమంచు వర్ణనలఁ దా
రింపారఁగాఁ జేయ నా
శ్రీరంగస్థున నుండు రంగఁడు యశ
శ్రీలిచ్చు మా కృష్ణకున్"

ఈ పద్యంలో (ఆ యీ పద్యం చెప్పింది చెప్పినట్టే యిక్కడ ప్రచురించాను. తప్పులు సవరించలేదు) వున్న శ్రీరంగంలో వుండే రంగన్నకీన్నీ, గానాంలో వుండే వెంకన్నకీన్నీ యేం సంబంధమని యెవరూ శంకించలేదు గాని శంకిస్తే యతిప్రాస లనే తెరచాప ఆయా పద్యమనే వోడని ఆలా నడిపించిందనేదే యథార్థమైన జవాబు. యీ రెండు పద్యాలేకాక మరికొన్ని వెంకటేశ్వరశతకంలో పద్యాలు వుండకపోవుగాని రికార్డు జాగ్రత్త పెట్టనపులోపంచేత యిదిమాత్రమే కలగూరగంపలో ముద్రించినట్టు జ్ఞాపకం.

పద్యకవిత్వం వొకశతకు లోపటే వుంటుంది గాని పదకవిత్వం కొంచెం అధికంగానే వుంటుంది. శ్రద్ధ చేయకపోవడంచేత అంతరించింది. బ్రహ్మయ్యశాస్త్రుల్లు గారి శుశ్రూషకు ఆరంభించిన వుత్తరక్షణమే చల్దివణ్ణం తినడం, తెలుగువ్యాకరణం వగయిరాలయందు యెంత అనాస్థ కలిగిందో, తెలుఁగుకవిత్వమందున్నూ అంత అనాస్థా కలిగింది. పైఁగా గురువుగారు యేసంపన్న గృహస్థులతో చేనా ప్రసక్తానుప్రసక్తంగా యితఁడు తెలుగులో కవిత్వం చెబుతాఁడని ప్రస్తావిస్తే, నా కెంతో అవమానకరంగా వుండేది. ఆరోజులనాఁటికి సంస్కృతపండితులు చాలామంది వుండేవారు. తెలుఁగంటే లేశమూ గౌరవం లేదు. అసలు చదువు రాకపోయినా అంతతప్పు లేదు గాని తెలుఁగు చదువుకున్నాఁడంటే తప్పుగా కనపడేది. గురువుగారు సంస్కృతవిద్వాంసులు, విద్యార్థు లందఱూ సంస్కృత విద్వాంసులు, నేనొక్కణ్ణే వెలేసినట్టు తెలుఁగుకవిత్వం చెపితే ఆసభలో నన్ను ఆదరించే దెవరు? వా రాదరిస్తే ఆదరిస్తారేమో కాని అసలు తెలుఁగుకవిత్వం చెప్పడమంటే నాకు వచ్చినచావుగా వుండి పూర్తిగా దాన్ని విసర్జించి సంస్కృతంలోకి దిగాను. యేదో ఖండం మొదలు పెట్టాను. శ్లోకాలు వ్రాస్తుండేవాణ్ణి. తోడి విద్యార్థులలో కొందఱు కవిత్వ సంప్రదాయాలు నేర్చుకోవడానికి నాకు శిష్యులుగా చేరారు. కాని యెవరికీ అబ్బిందే కాదు. యేవొకరికిమాత్రమో నాత్రోవ పట్టుపడింది. దానికి నేను నిమిత్తమాత్రం. ఆలాగే కాకపోతే అభ్యసించాలని మొదలుపెట్టిన వాళ్ల కెవళ్లకీ లవలేశమూ అంటకపోవడ మేమిటి?

"అభ్యాసేన వలభ్యంతే చత్వార స్సహజా గుణాః"

తిరుపతిశాస్త్రుల్లూ, నేనూ సంస్కృతంలో వొకరి మీఁద పోటీకి వొకరు దీర్ఘసమాసాలు పెట్టి గణేశ్వరాష్టకరచన ప్రారంభించి నాలుగుచరణాలకీ (తెలుఁగు సుతోలాగే) యేకసమాసం పెట్టి మకుటం "కలశం గణేశం భజే" అని పూర్తిచేసి అక్కడక్కడ వినిపిస్తూవుండేవాళ్లం. దానిలో మంచి అర్థం వుందో లేదో యెవరిక్కావాలి, సమాసగ్రథనానికే సంతోషించేవారు.

"వస్త్రేణ వపుషా వాచా" అన్నట్టు కొంతకాలం జరిగింది. అప్పుడప్పుడు యేలూరికీ, రాజమండ్రికీ, కాకినాడకీ అనధ్యాయాలలో సంపాదనకి వెళ్లినప్పుడుమాత్రం తెలుఁగుకవిత్వం చెప్పడం వుండేది. యేదేనా వొకడబ్బుసా మిచ్చేవాళ్లు మాకోసం సంస్కృతం చదువుకుని కూర్చుంటారు కనక నా? తెలుఁగైతే దేశభాష కనక అంతో యింతో తెలుస్తుంది. ఆరోజుల్లో యెవరో పెద్దషావుకారు వొక శేష యిస్తే "ఈ పేడే వీఁచేడేమి" అంటూ ఆరంభించేటప్పటికి రూపాయి వూడిపడింది. అయితే పట్టి తెలుఁగేనా యేదో దానిలో ఆశ్చర్యకరమైన విషయం వుంటేనేకాని పైసా వూడిపడదని వూహించి దాని కోసం బంధకవిత్వం తయారుచేసేవాళ్లం. ఆ బంధకవిత్వమేనా సర్వతోభద్రం వగైరా అయితే చెప్పేవాళ్లకూ కష్టమే, ఆవలివాళ్లకు బోధ కావడమూ కష్టమే. అందుచేత నాగబంధాలే తేలికవి తయారు చేసేవాళ్లం. యిటుకగాని, సున్నంగాని, కలపగాని అక్కఱ లేకుండానే వొకటి రెండు గంటలకాలంలో

కొన్ని అంతస్తుల మేడ తయారయేది. దానిలోనే కొన్ని గదులలో వుండే అక్షరాలు (మాకు మహా భాష్యం కావలెను, దాని వెల యింత, ఇత్యాదులు) చదువుకుంటే మాకు వారు చేసే సత్కారం యేదో అది వచ్చేటట్టే ఆశీర్వచనపద్యం తయారుచేసేవాళ్లం. రు. ౧౦ టికి హెచ్చు లేదు, రు. ౮ టికి తగ్గలేదు. రోజు ౧ టికి ఇద్దటికంటే యెక్కువ చూడడం లేదు. బంధకవిత్వం గనక అంతకంటె యెక్కువ సౌధాలు తయారయేవి కావు.

ఆయా రచనవల్ల ద్రవ్యలాభ మాలా వుండగా కవిత్వం వృద్ధి పొందింది. జయదేవుడు జేమన్నాడు— "కావ్యం వచః పల్లవః" అన్నాడు. యే పట్టీ మట్టీ పద్యాలలో రచిస్తూ వుంటే చిగుళ్లు చెట్టును వృద్ధి పొందించినట్టే కవిత్వాన్ని ఆయా పద్యాలు వృద్ధిపరుస్తాయన్న మాట. అసలు చెట్టుకు బీజమో? "బీజం యస్య పురార్జితం సుచరితమ్" అన్నాడు.

అయితే యీసంపాదనకోసం కవిత్వంతో మేడలు నిర్మించడానికి మాకు మార్గప్రదర్శకు లెవరంటారేమో? పన్నాల రామబ్రహ్మశాస్త్రుల్లుగారి శిష్యులు యిద్దఱు జంటగా యీ సౌధబంధాలలో ద్రవ్యార్జన చేయడం చూచాము. ఆశిష్య ద్వితయిలో నా కొకడు చాలా వాచాటకుడు; రెండో వ్యక్తికి కొంచెం స్తబ్ధు. యిద్దఱికీ బాంధవ్యంకూడా వుంది. తెలుగు ప్రాంతమే వారి నివాసగ్రామం (వారి నామధేయం జ్ఞాపకం లేదు. వారి కవిత్వం అంతతో అణగిపోయింది గాని పైకి రాలేదు. నామాఽపి న శ్రూయతే). వారి గురువుగారినిగూర్చి వినడమే కాని మాకేలేదు ఆయన మంచి కవి అనిన్నీ, కూచిమంచి గోపాలకృష్ణమ్మ గారివల్ల యేదో అపకారం జరగడంచేత 'ఖలకర్ణ విషాయణం' అనే పేరుతో యేదో శ్లేషగా ఒక గ్రంథం రచించినట్టు ఆశిష్యులవల్లనే విన్నాం. ఆ గురువుగారి కవిత్వం "తులసీ చత్వరే భాతి కలశీ కృతమంటపే" అన్నది తప్ప నా కింతకంటె యితరం జ్ఞాపకం లేదు. ఆ విషాయణం దూషణాత్మకమే అయినా ఆయనప్రజ్ఞావిశేషం దానిలో రసాయనంగానే నడిచివుంటుంది. కాని అది పైకివచ్చినట్టు లేదు. భవతు.

ఆశాస్త్రుల్లుగారి శిష్యులు మాకు భిక్షాటనానికీ, మేడలు కట్టడానికీ మార్గప్రదర్శకులన్నది ప్రస్తుతం వక్తవ్యాంశం. సంపాదనార్థం, అదేనా చదువుకొనే పుస్తకాలనిమిత్తమే సంవత్సరానికి వొకటో, లేదా రెండుసార్లు యాచనార్థం వెళ్లినప్పుడే తెలుగుకవిత్వాన్ని స్పృశించడం. యితర కాలాల్లో సంస్కృతం తప్ప తెలుక్కి మారేది లేదు. రెండోసారి కాశీప్రయాణం కట్టేటప్పటికున్నూ అడపా దడపా తెలుగు చెప్తున్నా సంస్కృతం కూడా అడపా దడపాగానే యేభాగంపేరో పెట్టి రచిస్తూ కాలం నడిచింది. ఆకాశీప్రయాణసుముహూర్తం నాకు వివాహసుముహూర్తంగా మారినప్పుడు శ్రీకిర్లంపూడి జమీందార్లలో పెద్దాయన శ్రీబుచ్చితిమ్మయ్యగారిని గూర్చిన పద్యాలలో వొకటి వుదాహరిస్తాను:

"అంచితు లౌ భిక్షజనకు
లాదర మొప్పఁగఁ గాశిలోనఁ జె
ప్పించిన సర్వశాస్త్రములఁ
బెంపుగ వద్యపనం బొనర్చి రా
జించెడి చర్లవంశవర
నీరధిశారదచంద్రు పార్థనో
దుచితబ్రహ్మకూభిధు
ధాగ్రణిశిష్యుఁడ వేంకటాఖ్యుఁడన్."

మా పరమగురువులు బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారు యీదేశంలో వ్యాకరణగ్రంథాలు చాలావఱకు చదువుకొని తరవాయి చదువుకు కాశీకి వెడుతూ కిర్లంపూడి సంస్థానానికి వెడితే పద్యంలో వున్న 'భవజ్జనకులు' అనేపదానికి వాచ్యంగా వున్న శ్రీయనగంటి సూరయ్యగారు చాలా ఆదరించి సాలు ౧-కి రూ. ౬౦ లు వార్షికం యేర్పఱచి (మాగురువుగారు కాశీలో కోటి విద్యార్థులతో పాటు సత్రాలలో భోంచేయలేదు, స్వార్జిత ద్రవ్యాన్ని ఖర్చుపెట్టుకొని చదువుకొన్నారు) కాశీలో వున్నంతకాలం మనియార్డరు చేయడమే కాకుండా దేశానికి వచ్చినపిమ్మటకూడా ఆవార్షికం వారు యావజ్జీవం జరిపారు. ఆసందర్భాన్నే ఆపద్యంలో నేను వుద్ఘా

టించాను. వావివాహం అసంస్థానద్రవ్యంచేతనే జరిగింది. కాశీకి వెళ్లే పూర్వం తెలుఁగుకవిత్వధార యేలా వున్నదీ పయిపద్యంవల్ల చదువరులు తెలుసుకుంటారు గదా! ఇందులో శంక కవకాశం కలది వొక ప్రయోగం వుంది. జిజ్ఞాసువుల వుపయోగానికి కొంచెంచర్చిస్తాను. "చర్లవంశవరనీరధి శారదచంద్రుఁ" అనేవిశేషణం దుష్టవిరహితంగా పడింది. దీనికి ప్రయోగాధారం తప్ప తెలుఁగులో సూత్రాధారం కనపడదు. (తెలుఁగువ కున్న వ్యాకరణదీపను చిన్నది) ప్రయోగం చూపుతాను:

"ఏటులు మెప్పించెదో నన్ను నింకమీఁద
రావు సింగన్నభూపాలు ధీవిశాలు
నిండుకొలఁవున నెలకొని యుండి నీవు
సకలసద్గుణనికురుంబ! శారదాంబ!"

ఈ శ్రీనాథునిప్రయోగాన్ని బట్టి ఆప్రయోగం సాధువు. యిటీవల చాలాకాలానికి రచించిన పాండవనాటకాలలో పుర్యోగంలోకూడా ఈలాటిప్రయోగం పడింది— "గొల్లరా, చుట్ట మెఱుఁగునే భువనభూరుహసమీరకుమారుఁ బీరముగా." ఆయీచోట 'భువనభూరు' అనే విశేషణానిక్కూడా శ్రీనాథప్రయోగమే జీవకం. "విలువ గల కవుల లక్ష్మ్యమ్మలె తా మీభార మెల్ల మోయుఁగ కలదొకో" (ఆయీ శంకోపసమాధానాలు నా అంతట నేను లేవఁదీసినవే కాని వొకరు శంకిస్తే పుట్టినవి కావు.)

ఆయీ పద్యరచన నాఁటికి పట్టుమని పదిపద్యాలు శాస్త్రరసజ్ఞలోకానికి రుచించేవి రచించినట్టు లేదు. సాహిత్యంమాత్రం కౌముదీజ్ఞానంతో మిళితమై యెదుగుతూ వుంది. తెలుఁగుసాహిత్యం లోకల్ ఫండు స్కూలులలో అలవడిం దెంతో అంతే. పైఁగా తెలుఁగుచే యింగ్లీషుస్కూలు విద్యార్థులకెంత గౌరవమో నాకూ అంతే. అయినా అంతకు పూర్వం దైవవశాత్తూ సంభవించిన వొకానొక చేదస్తంవల్ల తెలుఁగులో కొంత జ్ఞానం యేర్పడింది. ఆచేదస్తం యేమిటంటే? మాపిన్నముత్తాత (పెద్దకవీంద్రుఁడై పేరు చెందిన వాఁడు పిన్నముత్తాత పన్నన్నగారు) స్వదస్తూరీతో వ్రాసిన యిరవై రెండు పెట్టెల తాటాకుపుస్తకాలున్నూ కాగితాలమీఁద వ్రాద్దామనే కోరిక పుట్టింది. యెప్పుడంటారు యీకోరిక, చామర్లకోటలో చదువుకొనే రోజుల్లో. అనధ్యాయపుదినాలు సెలవు యెనిమిదిన్నీ యేనాం వచ్చి, దీక్షగా, వంచిన నడుం యెత్తకుండా యిదే పని చేసేవాణ్ణి. ఆమూఁడు మాసాలలోనూ వచ్చిన అనధ్యాయాలు ఇరవైనాలుగురోజులలోనూ మాముత్తాతగారి స్వంతకవిత్వంలో యామినీపూర్ణతిలకావున్నూ, అహల్యాసంక్రందనవిలాసమున్నూ వ్రాయఁగలిగాను. మా ముత్తాతగారికవిత్వం యెక్కడిదో వొకపద్యం తేలికశైలిలో వున్నా చాలాభాగం నారికేళపాకంలో వుండేది. అందుచేత దాన్ని బద్దలుకొట్టడానికి స్వయంకృషి చాలేది కాదు. దానికోసం యెవరినో పెద్దల్ని ఆశ్రయించవలసివచ్చేది. దానా దీనా మిడిమిడిజ్ఞానం తెలుఁగులో పరమగురుసాన్నిధ్యం చేరకపూర్వమే యేర్పడిం దన్నది పరమార్థం.

యేపుస్తకమేనా యితరులు వ్రాసి వుంచిందో, అచ్చుపడివున్నదో చదవడంకంటే స్వయంగా వ్రాసుకొచదువుకోవడంలో యెంతో ప్రయోజనం వుంది. ఆ ప్రయోజనం యిప్పుడు పూర్తిగా అంతరించింది. కారణం అచ్చుపుస్తకాలల్లో చదవడమే. యిప్పటి సాహిత్యం "పుస్తకేషు చ యా విద్యా పరహస్తేషు య ద్ధనమ్" అన్నతరగతిలో వుంటుంది. అప్పటిదో ? వాచో విధేయంగా వుండేది.

"వాగ్దేవీ వదనాంబుజే వసతి చే త్కా-నామ దీనా దశా" అన్నాఁడు ఒక మహాకవి. ఆ మహాకవి యీ మాట మరోసందర్భంలో వుపయోగించినా నేను దాన్ని యీ సందర్భంలో వుపయోగిస్తున్నాను. ప్రస్తుతం అందుకుంటాను.

పైని వుదాహరించిన పద్యం చెప్పేనాఁటికి మనస్సులో యమకకవిత్వం చెప్పాలనీ, అలంకారాలతో, యేవోయేవో అపూర్వకల్పనలతో కవిత్వం చెప్పాలనీ వుబలాటం వుండేది. కాని బాగా సాఁగేది కాదు. సాఁగినా అది యేకవితాలూకు వుచ్ఛిష్టమో అయినట్టే తోఁచి వదులుకోవలసి వచ్చేది. లోఁగడ శ్రీరంగేశ్వరుణ్ణి గూర్చిన పద్యంలో యేదో

క్రొత్త వృషమాలంకారం పడిందని సంతోషిస్తూ వుంటే యెవరో అన్నారుగదా—యిది గ్రంథచోరత్వంకిందకి వస్తుం దన్నారు (మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి నువిద చెంగట నుండె నొప్పుచాఁడు). యిది శ్రీమద్భాగవతంలోది. ఆ శ్రీరంగేశ్వర పద్యరచన నాఁటికి యీ భాగవతం చదవకుండానే వుంటానా? నేను చదవకుండా వుంటేమాత్రం ఆయీమాట లోకం—అందులో ప్రతివాదిలోకం విశ్వసిస్తుందా? (నాకు మొదటినుంచీ ప్రతిపక్షులు వుంటూనేవుండే వారు. ఆ బాధ యిప్పటికీ శాంతించలే దని వ్రాయ నక్కరలేదు).

పండితుఁడిజీవితంకంటే కవిజీవితం చాలా (మొట్ట మొదటే అనండి) లోకవిరోధాస్పదంగా వుంటుంది. వీఁడు యెవ్వఁడికీ యేవిధమైన అపకారమూ చేయక పోయినా యేసెట్టిముట్టిపద్యమో వ్రాయడమే అకారణవిరోధాన్ని పుట్టిస్తుంది; క్రమక్రమంగా లోకాదరాన్నిన్నీ కలిగిస్తుంది గాని ఆభాగ్యం పట్టడానికి కొన్ని దశలు పడుతుంది. అప్పుడేనా యెవఁడికో నూటికి కొక్కఁడికి మాత్రమే. యేదో తనలో తాను చెప్పుకొంటూ పూరుకుంటా వుంటే, అలా వుండనివ్వరు. యెవరో మహా ఆప్తులలాగ వచ్చి, యేదీ నీ వేదో కవిత్వం చెప్పావట! కాస్త విని పించ మంటారు. వినిపించకపోతే వీఁడికి గర్వం అంటారు. వినిపిస్తే ఆవిన్నవారిలో కొందఱు పూరు కున్నా కొందఱు పూర్వపక్షాలకు దిగుతారు. యిదంతా తల్చుకుంటే యిప్పుడు యేలాగో కనపడుతుంది. వయస్సు తక్కువగా వుండి కవిత్వం చెప్పేవాణ్ణి మఱీ లోఁకువగా చూస్తుంది లోకం.

కాశీ వెళ్లివచ్చిన కొత్తలో సంపాదనార్థం ముమ్మిడివరం వెళ్లినప్పుడు అన్నపూర్ణాష్టకం విని పిస్తూ వుండఁగా వొక ముసలిపండితుఁడు చేసిన శంక యెక్కడో యిదివఱలోనే వ్యాఖ్యానించి వున్నాను. అన్నపూర్ణనుగూర్చి ప్రార్థిస్తూ నేను "మత్సద్మని స్థీయ తామ్" అని వేఁడుకుంటే, ఆ వృద్ధపండితుఁడు మహా ప్రావణ్యంగా నాకేసి చూచి "అబ్బాయీ, మీ యిల్లు తోటాకిల్లా, వెంకటిల్లా" అని ప్రశ్నించాఁడు.

దీన్నిబట్టి చూస్తే కవిత్వం చెప్పేవాఁడికంటే లోఁకువ వ్యక్తి లోకంలో వుండనే వుండఁ డనవలసి వస్తుం దేమో? పరిశీలకులు ఆలోచించాలి. దేవతాప్రార్థనకీ, యింటికీ సంబంధం వుంటుం దని యేసహృదయు లను కుంటారు? పద్యంగాని, శ్లోకంగాని వినిపించడానికి ఆరంభం చేసేటప్పటికల్లా తప్పు పడదామనే వూహే గాని యేదో విందామనే వూహ సభ్యులలో యెవరికో తప్ప వుండనే వుండదు. అందుచేత కవిజీవితం చాలా దుర్భరంగా వుంటుందని నేననుకుంటాను. "భాగ్య వంతం ప్రసూయేథా మాశూరం మాచ పండితమ్" అందులోనూ కవిత్వాన్ని జీవనోపాధిగాఁ బెట్టుకొన్న వాళ్ల జీవితాన్నిగూర్చి చెప్పనే అక్కఱ్లేదు.

"సభఁ జేయించుటో లేదో యంచు మొదటన్
సందేహ మా మీఁద నీ
సభలో నేమిట లోప మౌనో యనుచున్
సందేహ మామీఁద నీ
సభలో నింకను లాభ మేమొ యనుచున్
సందేహ మూహింప నీ
సభలన్ జేసెడివారి కో జగతిలో
సందేహ సంరక్షకుల్."

అయీపద్యం వేంకటగిరిసంస్థానం వెళ్లినప్పుడు చెప్పింది. శెల్లంపూఁడిపద్యం చెప్పేటప్పటికి యీపద్యం చెప్పేనాఁటికి వున్నంత జ్ఞానం లేదు. ఆపద్యానికీ, యీపద్యానికీ మధ్య యెంత వ్యవధి వుందంటే, నాలు గేళ్లు వుంది. అది విరోధిసంవత్సరంలో చెప్పింది, యిది విజయలో చెప్పింది. ఆపద్యం చెప్పే సందర్భం లోనే యమకంగా చెప్పడానికి వొకపద్య మయితే మొదలుపెట్టానుగాని అది యేదోమాదిరిగానే నడిచింది గాని పయిపద్యంమాదిరిని నడిచింది గాదు. వుదాహ రిస్తాను:

"ఓయినుఁగంటి తమ్మయన్న
పోత్తమ! నీదు ప్రతాపతుల్యుఁ గా
నాయినుఁగంటి నాయనకు
నాదువివాహప్రసక్తి లేమిచే
నాయినకంటె మీర లధి
కాఢ్యు లటంచు మదిన్ దలంచి మి

పేర్మి యినఁ గంటి నిప్పటికి
పేర్మిమెయిన్ దపమగ్న్యకాంక్షినై."

ఈ పద్యంలో పట్టుకుదనన్న 'దపమగ్న్య' శబ్దానికి ధన మని అర్థం. దకారపకారాలకి మధ్య వున్న అక్షరాలు 'ధ–న' అని రెండేకదా! యీలాంటి వెఱ్ఱిధోరణిలోనే మొట్టమొదట రచన నడిచేది. మరేన్నీ ఆయీపద్యంలో తలపెట్టిన యమకమే మఱి పదేళ్లకి వికారిసంవత్సరంలో శ్రీకీర్తంపూఁడి జమీందారుగారు నవరాత్రమహోత్సవాలకు ఆహ్వానించినప్పుడు తల పెట్టితే యేలా నడిచిందో చూపుతాను, చూడండి:

"ఇనఁ గంటి న్ననఁ గంటి భేద మొకయిం
తేనిం గనన్ రాదు పో
మునిఁ గంటి న్ననఁ గంటి భేదము లవ
మ్మాత్రం గానఁగా రాదు మే
ఘునిఁ గంటి న్ననఁ గంటి భేద మరయన్
గోరంతయున్ లేదు మీ
యినగంట్యన్వయ మెంత చేవ గలదో
యీ! చిన్నరాయాధిపా!"

ఆపద్యంలో నడవని యమకం యీపద్యంలో అవలీలగా నడవడాని కారణం క్రమంగా అనభవం యెక్కువ కావడమే. యీపద్యం చెప్పేటప్పటికి శ్రవణానందమే కాదు, శ్రీదేవీభాగవతంకూడా సుమారు నాల్గుస్కంధాలదాఁకా తెలిఁగించడమే కాకుండా ఆత్మకూరి రాజుగారికి కృతిగా రచించిన శ్రీనివాస విలాసంకూడా పూర్తిచేయఁబడింది.

మళ్లా కీర్తంపూఁడిపద్యాల తరవాయినే అందుకుంటాను. అప్పుడు అవసర మైనప్పుడు తెలుఁగుకవిత్వం చెప్పినా తెలుఁగుకవుల మనిపించు కుందామనే కుతూహలం లేశమూ వుండేది కాదు. పైఁగా అలా అనిపించుకోవడంలో యేదో అవమానం వున్నట్టు తోఁచేది. ఆకారణంచేతనే కీర్తంపూఁడిపద్యం చెప్పిన నెలరోజులకే కాశీ వెళ్లినప్పుడు అక్కడ దేవతలనుగూర్చి చెప్పిన కవిత్వమంతా సంస్కృతమే. వాట్లనే 'కాశీకాస్తోత్రమాల' అనే పేరుతో అచ్చువేశాము. ఆకవిత్వంలో మొట్టమొదటి అష్టకం కాళికాష్టకం ("నాళీకజాద్యదితిజాళీ". చూ). ఆయీఅష్టకకవిత్వంలో యేవో కొన్ని శ్లోకాలు సాఫుగా వున్నా ఆరంభదశలోవి కావడంచేత విశేష సాఫుగా వుండవు. కాని అక్కడ వున్న రోజుల్లో శ్రీద్రావిడ సుబ్రహ్మణ్యశాస్త్రులుగారి కొమార్త వివాహ సందర్భంలో రచించిన శుభలేఖాశ్లోకంమాత్రం మంచి ధోరణిలోనే నడిచింది. ఆ జగత్పండితులు మెచ్చుకొని దీన్ని స్వీకరించారు. వుదాహరిస్తాను:

"మన్యధ్వం కేందువక్షే
గుణగణమహితే రాధమాసే వళక్షే
పక్షేఽవంగస్య తిథ్యా
మసురగురుదినే మత్సుతాయా వివాహః,
ప్రాతర్యాభీ బుధేంద్రా
మహ ఇహ భవతాం యాచతే సన్నిధానం
శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రీ
ద్రవిడకులభవ స్స్వాహితాగ్ని ర్వినీతః."

అష్టకశ్లోకరచనాకాలమున్నూ, యీశ్లోకరచనాకాలమున్నూ వొకటే అయినా యీశ్లోకరచన చాలా సాఫుగా వుంటుంది. అష్టకశ్లోకాల్లో కొన్ని విధాల యమకం నడిచినా అశ్లోకా లేవీ దీన్ని పోలవు. యీ శ్లోకం చెప్పి యిప్పటికి యేభైయేళ్లయింది. యిప్పుడు, అనఁగా డెబ్భైయేళ్లు దాఁటిన యీవయస్సులో చెప్ప వలసివచ్చినా ఇంతకన్న మంచిగా చెప్పడం పొసఁగ దన్నమాటే.

కాశీలో నేను వున్నదల్లా అయిదుమాసాల సుమారు మాత్రమే. అక్కడినుంచి రావడంతోటట్టే కోనసీమకు అష్టావధానాల కంటూ బయలుదేఱి అక్కడ సంస్కృతశ్లోకాలతోటే మాట్లాడడం మొదలు పెట్టాను. ఆధోరణికి పండితులే భంగైపోతే యితరుల మాట చెప్పే దేమిటి? యిదంతా "పటాటోపో భయంకరః". ఆశ్లోకాలు యిప్పుడు జ్ఞప్తిలో లేవు. వొక్క చరణంమాత్రం జ్ఞాపకం వుంది.

"యానాంనామకపట్టణం హి వసతి శ్రీవేంకటేశోఽస్మ్యహమ్"

గంగాసంతర్పణ వగైరాలు చేసుకొని మళ్లా గురువుగారి సాన్నిధ్యానికి చేరిన తరవాత కవిత్వా

వ్యాసంగం శాస్త్రాధ్యయనానికి అంతరాయం కలిగి స్తుంది కనక కొంతకాలం ఆఁపవలసింద న్నారు గురువు గారు. అప్పుడు గత్యంతరం కనపడక శాస్త్రానికి సంబంధించిన కవిత్వమే అయితే శాస్త్రులుగారు కొంతమట్టుకేనా అంగీకరిస్తా రని వూహించి 'ధాతు రత్నాకర'మనే పేరుతో రామాయణగాథ రచించ డానికి ప్రారంభించాము. యెంత కఠినంగా కవిత్వం చెపితే అంత గొప్పపేరు వస్తుందనే అభిప్రాయంతోటి రచన సాఁగించడంచేతనే అది కొంత పాషాణపాకంలో వుంటుంది. కొంచెం వుదాహరిస్తాను :

"విపతురతుఃపరిశితుణతు తోఽ
వ్యభిక్షతిక్షాతురరూతువీతుగే,
నచ తుణం శైక్ష్య మివాతుకుతుడి
ర్న్యా తుఢ్ఢాకే యమశితుణతుః"

యీశ్లోకంలో క్రియాపదం యెంతో మాటు మాలది కాదు, యేమాత్రం ధాతుపాఠజ్ఞానమున్నా బోధ పడుతుంది. వుపమావిషయం యేకొంచెమో తర్క సంప్రదాయం తెలిస్తే తెలుస్తుంది గాని ప్రసాదగుణం లేకపోవడంచేత వెంటనే తాత్పర్యం బోధపడదు. శ్లోకం చాలా బింకంగా తుకారాలతో నిండించినా యింకా కొన్ని తుకారాలు పడలేదుగదా అన్నే చింత మాకు వుండేది. తుకారమయంగా వున్న రచన చూపించడం జరిగింది కనక తకారమయంగా వున్నది కూడా వొకటి చూపుతాను:

"వితండకకుత క్రతుక్రతుతవతాం వతంవ స్వతే
పతేఃతగతా వితశ్చతురతా ఽతి త్వత్రకతా"

వచ్చిన అక్షరం అసకృదావృత్తిగా వచ్చేటట్టు చెప్పఁగలిగాం గదా అనే సంతోషమే కాని కవిత్వం లోకంకోసం పుట్టిందిగదా, ఆలోకానికి యీ తకా రాలతోటీ, తుకారాలతోటీ అవసరం వుంటుందా అనే శంకే కలిగేది కాదు. అయితే యీ తుకారా లకీ, తకారాలకీ సంతోషించే విద్వాంసులున్నా వుంటారు గాని వారు కవిత్వతత్వాన్ని యెఱిఁగిన వారు కారు. ఆరోజుల్లో మేము విద్యార్థులకు పాఠాలు చెప్పే భాగవతచంపు వగయిరాలలో అలాటి శ్లోకాలే కనపడేవి :

"దయితో మే యశోదాసూ
దాయాదో౽యం దసూమరే,
దేవి! తే దయసూ ధూయా
దాసూపో౽యం కిసూ నసే."

యిది అభినవకాళిదాసు భాగవతచంపులో చెప్పిన శ్లోకం. ఆతఁడు అర్థప్రధానంగా చెప్పిన శ్లోకాలు యెన్నో వున్నప్పటికీ వాట్లమీఁదకంటే యీ శబ్దాడంబరంమీఁదకే మనస్సు పరిగెత్తేది. మొట్ట మొదట ప్రతివిద్యార్థికీ శబ్దాడంబరంమీఁదనే యెక్కువ ఆస్థ వుంటుంది. అర్థగాంభీర్యందగ్గిఱకి బుద్ధి మళ్ల డానికి చాలా కాలం పడుతుందనే నేను నా అనుభవాన్ని పట్టి చెపుతూ వున్నాను.

[సశేషము]





సీరియల్ నాటకము = **రాజరాజు** = శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి

వదో రంగం

రాజరాజు నగరియెదటి పూలతోట.

సూర్యాస్తమయం కాబోతోంది.

మహారుద్రయ్య రోక పాలరాతి అరుగుమీద కూచునీ, అతని నమ్మిన బంటు, మల్లప్ప, యెదట నుంచునీ వున్నారు.

***

మహారుద్రయ్య — కొత్త రాణీగారు విడిసిన భవనం యెలా వుంది మల్లప్పా?

మల్లప్ప—అది యింద్రభవనం కాదూ బాబయ్యా?

మహారుద్రయ్య—మరి కొత్తరాణీగారు?

మల్లప్ప—రంభ -ఊర్వశి- తిలోత్తమ- మేనక — (అర్థోక్తి)

మహారుద్రయ్య — ఆగు. చాలు... కనక, వారికి స్వాగతం చెప్పకోడానికి – లేక వారితో మాట్లాడ్డానికి — లేక వారిని చూడ్డానికి – లేక ఆవుద్దేశంతో – ఆభవనం లోకి– లేక ఆ గుమ్మంలోకి– లేక ఆప్రాంతానికి – లేక ఆసమీపంలో వుండేప్రాకారాల మీదకి – లేక బురుజులమీదకి – ఎవరేనా రావచ్చు.

మల్లప్ప—చిత్తం చిత్తం, రావచ్చు బాబయ్యా!

మహారుద్రయ్య—ఏదీ, ఎవరెవరు వస్తారో చెప్పు చూతాం.

మల్లప్ప—ఫలానా అని నిరుకేమిటి బాబయ్యా? జక్కులదీవి మనుషులు రావచ్చు, ఇక్కడి మనుషులు రావచ్చు, పెద్దరాణీగారు రావచ్చు – (అర్థోక్తి)

మహారుద్రయ్య—(కళ్లు మూసుకుని తల ఆడించుకుంటూ) బాగుంది!

మల్లప్ప — రాజుగారు రావచ్చు, విజయాదిత్యులవారు – కూడా – (నసుకుతాడు)

మహారుద్రయ్య — (కళ్లు మూసుకునే వుండి, తల యెగర వేసుకుంటూ) ఊఁ! కానియ్య! రావచ్చు.

మల్లప్ప — తమరు రావచ్చు — (అర్థోక్తి)

మహారుద్రయ్య — (కళ్లు మూసుకునే వుండి, తల యెగరవేసుకుంటూ) ఆహా! రావచ్చు.

మల్లప్ప — సుబుద్ధి అయ్యవారు రావచ్చు. యువరాజులుంగారు — (అర్థోక్తి)

మహారుద్రయ్య — (చెయ్యి జాడించుకుంటూ) అదిగదీ! సమస్య అందుకున్నావ్!

మల్లప్ప — చిత్తం బాబయ్యా!

మహారుద్రయ్య — వారేమిటి వీరేమిటి, చివరికి, దేవుడే రావచ్చు. తెలిసిందా?

మల్లప్ప — తెలిసిందండీ.

మహారుద్రయ్య — సరే వస్తారు. వస్తే? ఏమిట్రా వస్తే?

మల్లప్ప — సెలవిప్పించండి బాబయ్యా!

మహారుద్రయ్య — బాగా విను.

మల్లప్ప — చిత్తం బాబయ్యా!

మహారుద్రయ్య — ఎవరు వచ్చినా — ఏం చేసినా — లేక ఏం జరిగినా, తుదకి ఆ ప్రాంతంలో పిట్ట లెగురుతాయనుకో — (అర్థోక్తి)

మల్లప్ప — ఇంతెందుకు బాబయ్యా? గాలి విసిరినా తెలుసుకోవా లండి. వచ్చి విసరకపోయినా గ్రహించుకోవాలండి.

మహారుద్రయ్య — ఏ నిమిషాని కా నిమిషం నువ్వు బాగా పరకాయించాలి — పరిశీలించాలి — వివరంగా తెలుసుకోవాలి — నలుసయినా జారిపోకుండా జ్ఞాపకం వుంచుకోవాలి.

మల్లప్ప — సరే బాబయ్యా!

మహారుద్రయ్య — కాని నువ్వెవరినీ యెందుకూ అడ్డుపెట్టగూడదు. వారికేసి రెండుకళ్లా నువ్వు చూడనేకూడదు. నువ్వు గమనిస్తున్నట్టు వారికి అనుమానం అయినా కలగకూడదు.

మల్లప్ప — చిత్తం చిత్తం.

మహారుద్రయ్య — సరే, అలా తెలుసుకుని?

మల్లప్ప — తమతో మనవి చేసుకోవాలండి.

మహారుద్రయ్య — ఎప్పుడు?

మల్లప్ప — ఎప్పటి కప్పుడే నండి.

మహారుద్రయ్య — ఇం కెవరెవరితో చెప్పాలి?

మల్లప్ప — తమతో శే, మనవి చేసుకోవాలి గాని, తుదకి ఫాలాక్షుడికేనా చెప్పకూడదు బాబయ్యా!

మహారుద్రయ్య — సికుక్కా-డా నువ్వు చెప్పకోగూడదు సుమా.

మల్లప్ప — అవునండి. ఆ జరిగే సంగతి (తన హృదయం చూపిస్తూ) ఇక్కడ అచ్చు గుద్దుకోవడమూ, అది తమకి చూపించుకోవడమూ — అర్థోక్తి)

మహారుద్రయ్య — తరవాత?

మల్లప్ప — చెరిపేసుకోవడమే బాబయ్యా!

మహారుద్రయ్య — ఆ! అదీ పద్ధతి. నీకు తెలిసిపోయింది. అయితే, మల్లప్పా!

మల్లప్ప— సెల విప్పించండి దొర గారూ!

మహారుద్రయ్య — భవనం బయట జరిగే సంగతులు తెలిసిపోతా యనుకో. మరి లోపల జరిగేవి ?

మల్లప్ప—కనిపెట్టేస్తాను బాబయ్యా!

మహారుద్రయ్య—ఎలాగరా ? సాధ్య మా ?

మల్లప్ప—నామాట నమ్మండి ప్రభూ!

మహారుద్రయ్య — గుడ్డిగా నమ్మకం యెలాగరా ?

మల్లప్ప—మరి గత్తే—(నసుకుతాడు)

మహారుద్రయ్య—సందేహించకు.

మల్లప్ప—(అటూ యిటూ ఒకమాటు పరకాయించి, కొంచెం మెల్లిగా) అక్కడ వున్న రెండుపూటల్లోనూ జక్కులదీవి దాసీ పిల్ల వొకర్తి— కొంచెం— మచ్చికై అయింది స్వామీ!

మహారుద్రయ్య— వోరి పిడుగా!

మల్లప్ప— ( లెంపలు వేసుకుంటూ ) అపరాధిని దేవరా!

మహారుద్రయ్య— అక్కర్లేదులే, చెప్పు.

మల్లప్ప — దారిలో దాని పాలకీతో కూడా పట్టించానండి నా గుర్రం.

మహారుద్రయ్య— భేష్!

మల్లప్ప— ఉరికి నా వొళ్లో కూచోవా లన్నంత సరదా పడిపోయిందండి పిల్ల.

మహారుద్రయ్య—బాగుబాగు!

మల్లప్ప—రెండు దినాల్లో కీలుబొమ్మని చేసేస్తాను బాబయ్యా!

మహారుద్రయ్య — కోటలో పాగా వేశా వన్నమాటే; కాని తప్పిదారి, దాని యెదట నువ్వే కుక్క వయిపోతే?

మల్లప్ప—నిలబెట్టి చర్మం వొలిపించె య్యండి ప్రభూ!

మహారుద్రయ్య— జ్ఞాపకం వుంచుకో. భద్రంగా మసులుకో. ఇప్పటిదాకా నువ్వు చేసిన సేవ అంతా వొక యెత్తూ, యీ ఆరు మాసాల్లోనూ చెయ్యవలసింద్— చేసేదీ వొక యెత్తూనూ.

మల్లప్ప — బోధపడింది దేవరా!

మహారుద్రయ్య — మరి పిల్లకోసం యేమయినా డబ్బు—(అర్ధోక్తి)

మల్లప్ప — దమ్మిడీ అయినా అక్కర్లే దనే నానమ్మకం దొరగారూ! ... ... ఒక వేళ — అయితే — ? —

మహారుద్రయ్య — కావచ్చు కాక పోవచ్చు. కనక — (ఒక సంచీ అందిస్తూ) యిది దగ్గిర వుంచుకో.

మల్లప్ప — (అందుకుని, కళ్ల కద్దుకుని) చిత్తం బాబయ్యా!

మహారుద్రయ్య — అవి మూడువందల వరహాలు.

మల్లప్ప—చాలు బాబయ్యా! చాలు.

మహారుద్రయ్య — ఇంకా యెన్ని కావలసినా సందేహించకు, అడుగు.

మల్లప్ప — చిత్తం.

మహారుద్రయ్య — అయితే, ఆ డబ్బు నిజస్వరూపం యేమిటో తెలుసా?

మల్లప్ప — తెలుసు దేవరా, తెలుసునండి.

మహారుద్రయ్య — ఏమిటి?

మల్లప్ప — ఒక విధంగా — (వొత్తి పలుకుతూ) అగ్గండి.

మహారుద్రయ్య — మరో విధంగా?

మల్లప్ప — (గోరుమీటుతూ) సెనగపప్పు బాబయ్యా!

మహారుద్రయ్య — మరిచిపోకు. వొళ్లు తెలిసి మసులుకో. ఇప్పుడు నీ మెడమీద వున్నది యేమిటో తెలుసా?

మల్లప్ప — కొబ్బరిపుచ్చె బాబయ్యా!

మహారుద్రయ్య — ఇక వెళ్లిపో.

[మల్లప్ప మహారుద్రయ్య పాదాలంటి కళ్లకద్దుకుని వెళ్లిపోతాడు. మహారుద్రయ్య రాజునగరికేసి వెళ్లిపోతాడు.]

పదకొండో రంగం

రత్నాంగి నగరు.

రమారమీ అది రాత్రి భోజనాల వేళ.

దక్షిణపు వసారాలో రత్నాంగి, విజయాదిత్యుడూ బాలీసులకు ఆనుకుని వొకరికొకరు యెదురెదురుగా కూచుని వున్నారు.

రాజపురోహితుడు రుద్రంభట్టు విజయాదిత్యుడికొక పక్కగా, వొక బాలీసుకి ఎడంగా కూచుని వున్నాడు.

రంయిమని చల్లగాలి కొడుతోంది.

ఆ గాలికి విజయాదిత్యుడి గిరజాలూ, కొంచెం వరసి వున్న రత్నాంగి ముంగురులూ కదులుతున్నాయి.

ఉండుండి వొకొక్కక్క రివ్వ, దక్షిణాభిముఖుడైవున్న రుద్రంభట్టుకి, కొంచెం వుక్కిరిబిక్కిరి కలిగిస్తోంది.

ఒకదాసి మైనగోరువంకలతో, చిలకలతో పంజరాలలో జామిపళ్లుంచుతోంది.

మరోదాసి దీపాలు ఎగసన తోస్తోంది.

గౌరి తలుపు ఆనుకుని ద్వారంలో నుంచుని వుంది.

***

విజయాదిత్యుడు — (రుద్రంభట్టుతో) తమ మాటలు చూస్తే యెటూ నిశ్చయించుకోడానికి వీలులేకుండా వుంది. పోనీ, యిది సెలవిప్పించండి. బాగా జ్ఞాపకం చేసుకోండి. ఆమె కత్తికి పూలదండ వెయ్యడం విసిరి కొట్టినట్టుందా, మురుస్తూ — (అర్ధోక్తి)

రుద్రంభట్టు — మురిపెమా? అదెలాగ మహాప్రభూ?

రత్నాంగి — తర్కం వద్దు. జరిగింది జరిగినట్టు సెలవిప్పించండి బాబయ్యా!

రుద్రంభట్టు — చిత్తం అమ్మా, జరిగిందే — యథావత్తుగానువ్యే వే మనవి చేసుకుంటున్నాను. చిత్రాంగీ దేవమ్మగారు, పరిచారిక తెచ్చి అందిచ్చిన ఆయొక్క పుష్పహారం స్వీకరించడమూ, మహారాజులుంగారి కత్తికేసి సుతారంగా తిరగడమూ, దానికి — పతిభావనతోటియ్యే వే — చిత్తగించారూ? వెయ్యడమూ — అలాగ వెయ్యడంతోటట్టే — అది — యేదీ? ఆయొక్క పూలదండ విచ్ఛిన్నం అయిపోవడమూనున్నూ, నేను విభ్రాంతుణ్ణాయి — (అర్ధోక్తి)

విజయాదిత్యుడు — ఇప్పుడు తమ విశ్రాంతి మన కక్కర్లేదు. ఆమెసంగతి సెల విప్పించండి. ఆమెమొగంమీద యేమయినా అనిష్టం కనపడిందా?

రుద్రంభట్టు— శివశివా! శివశివా! అయితే, మహాప్రభూ! అదండ తెగిపోవడం తోటట్టే—(అర్థోక్తి)

విజయాదిత్యుడు— తమరు నా ప్రశ్న గమనించడంలేదు. వేసిన తరవాత గాని దండ తెగిపోలేదు. అవునా?

రుద్రంభట్టు—చిత్తం చిత్తం.

విజయాదిత్యుడు — ఆ వెయ్యడానికి వెనకటి స్థితి నే నడుగుతూ వున్నది. వేస్తూ వుండినప్పటిదిన్నీ సెలవిప్పించండి.

రుద్రంభట్టు—అదే విన్నవించుకుంటు న్నాను ప్రభూ! (స్మరణ అభినయిస్తూ) చూపుల్లో కొంచెం నైశిత్యం కనపడింది. లజ్జ స్ఫుటంగా లేదు. సాధ్వసమున్నూ గోచరం కాలేదు. అలా అని అది అనిష్టతా అంటే అలా అనడానికిన్నీ అవకాశం కన పడ్డం లేదు. పైగా పుష్పహారం యెత్తడం లో మెడమజబ్బ అడ్డు రావడంవల్ల కళ్లల్లో యెలాంటిభావం—(అర్థోక్తి)

రత్నాంగి — సరే లెండి బాబయ్యా, ప్రొద్దో అయింది. తమకి భోజనంవేళ అతిక్ర మిస్తూ వుంది. తమర్ని శ్రమపెట్టాము.

రుద్రంభట్టు — అమ్మ అమ్మ! ఎంత మాట సెలవిప్పించారూ? ఇందులో నాకు వచ్చిన శ్రమ యేమిటి తల్లీ?

[రత్నాంగి వెనక్కి, గౌరికేసి చూస్తుంది. వెంటనే గౌరి పళ్లెంతో ఫలాలూ, తాంబూలమూ తెచ్చి యెదట వుంచుతుంది.]

రత్నాంగి — (ఆ పళ్లెం పుచ్చుకుని లేచివెళ్లి భక్తితో రుద్రంభట్టు కందించి పాదాభివందనం చేస్తుంది.)

రుద్రంభట్టు — (లేచి, వొత్తుసాదులు స్ఫుటంగా వుచ్చరిస్తూ, తాపీగా)

"యాః ఫలినీ ర్యా అఫలా అపుష్పా యాశ్చ పుష్పిణీః, బృహస్పతిః ప్రసూతా స్తా నో ముంచం త్వగ్ంహసః"

శ్లో. ఫలం మనోరథఫలం
పుత్రపౌత్రప్రవర్ధనం,
యస్మా త్తస్మా చ్ఛివం మే స్యా
దతశ్శాంతిం ప్రయచ్ఛ మే.

ఫలదాన కల్పోక్త సంపూర్ణ సకల ఫలా వాప్తి రస్తు. మా అమ్మా! సెలవిప్పించండి.

రత్నాంగి — చిత్తం బాబయ్యా!

రుద్రంభట్టు — (విజయాదిత్యుడి కేసి తిరిగి నమ్రుడై) ప్రభూ! సెలవు దయ చేయించండి.

విజయాదిత్యుడు — (లేచి దోసిలివొగ్గి నమ్రుడై) నమస్కారాలు.

రుద్రంభట్టు — రాజద్వారే రాజ గృహే సర్వదా దిగ్విజయోస్తు. వేదోక్తం పరిపూర్ణ మాయుష్య మస్తు. (కొంచెంవూగీస లాడుతూ) చిత్తం చిత్తం.

[రుద్రంభట్టు వెనక్కి వెనక్కి తగ్గుతూ వెళ్లి పోతాడు. విజయాదిత్యుడూ, రత్నాంగీ యథా పూర్వంగా కూచుంటారు.]

విజయాదిత్యుడు—సరిగా గుర్తించక పోవడం కొంత, భయం కొంత, సహజ మైన ఛాందసం కొంత — మొత్తానికి రుద్రదంభట్టు గారు జరిగింది జరిగినట్టు చెప్పలేకపోయారు.

రత్నాంగి—ఏది యేమయినా, కావలసిన సంగతి తేలేపోయింది. సిగ్గువల్ల, ఆమె, చూసీచూడనట్టు వేసినా, యిష్టం లేక — విధి లేక విసిరికొట్టినా ఫలం వొకటే. పూలదండ తెగిపోవడం శుభసూచన కాదు.

విజయాదిత్యుడు—అదీ సంగతి. అయితే, ఆదిలోనే యీ వ్యవహారం అశుభంగా ప్రారంభం అయింది. ఇక అది సవ్యంగా యెలా సాగుతుందీ? ఇంతటితో అయినా అది సరిగా సాగితే అదే పదివేలు.

గౌరి—అమ్మా!

రత్నాంగి—ఆఁ!

గౌరి—జక్కులదేవి పరిచారికలు వచ్చి దర్శనం కోరుతున్నా రమ్మా!

[రత్నాంగీ, విజయాదిత్యుడూ వొక్కసారు గంభీరంగా చూసుకుంటారు.]

రత్నాంగి—తీసుకురా.

గౌరి—మంచి దమ్మా!

[రుక్కునీ, మరొకతెనూ తీసుకువచ్చి, గౌరి, రత్నాంగి యెదట "యిక్కడ నిలిచి మాట్లాడండి" అన్నట్టు హస్త నిర్దేశం చేస్తుంది. వాళ్లిద్దరూ పసుపుకుంకములూ, నూతనవస్త్రాలూ, రత్నాభరణాలూ, ఫలాలూ వున్న పళ్లేలు రత్నాంగి యెదట, సమీపంగా వుంచి, ముందు రత్నాంగి యెదటా, తరవాత విజయాదిత్యుడి యెదటా వంగి నేల అంటి కళ్లకద్దుకుని చేతులు కట్టుకు నుంచుంటారు.]

రత్నాంగి—మీరాణీగారు క్షేమంగా వేంచేశారా?

రుక్కు—చిత్తం మహారాణీ! మాతల్లి, చిత్రాంగీదేవమ్మగారు క్షేమంగా చేరినట్టు తమకు విన్నపాలు చేసుకుంటున్నారు. మరిన్నీ, భోజనానంతరం దర్శనం చేసుకుంటున్నా మని మనవిచేసుకుంటూ అనుజ్ఞ కోరుకుంటున్నారు.

రత్నాంగి—మంచిది.(పళ్లేలొకమాటు తాకి,)చాలా సంతోషం! కనిపెట్టుకుని వుంటా మని విన్నవించు.

రుక్కు—చిత్తం అమ్మా!

[వాళ్లిద్దరూ మళ్లీ యథాపూర్వంగా రత్నాంగికీ, విజయాదిత్యుడికీ నమస్కరిస్తారు.]

రత్నాంగి—గౌరీ!

గౌరి—మంచి దమ్మా!

[గౌరి తాంబూలా లిస్తుంది. అందుకుని, అటూ యిటూ పరిశీలనగా చూస్తూ వాళ్లిద్దరూ వెళ్లిపోతారు.]

రత్నాంగి—(విజయాదిత్యుడితో) ఏమి కావలసిన పిల్ల యేమయిందో, యెలా తెచ్చుకోవలసిన వస్తు వెలా వచ్చిందో చిత్తగించారా? ఇలా జరుగుతుం దని యెవరేనా అనుకున్నారా? పరమేశ్వరు డయినా యిది యిలా జరగా లని నిర్ణయించి వుంటా డంటారా మరిదిగారూ?

విజయాదిత్యుడు—గతం మరిచిపొండి. ఇక భవిష్యత్తును గురించి ఆలోచించండి వదినా!

రత్నాంగి — ఇక వొకటే భవిష్యత్తు. చూస్తూ వుండగా ఆకాశం అంతా కారుమబ్బులు కమ్మేశాయి. ఉరుములతోటీ మెరుపులతోటీ కుంభవృష్టి కురుస్తుందో, మరే

మేనా అవుతుందో తోచకుండా వుంది. మనస్సు మనస్సులో లేదండీ.

విజయాదిత్యుడు — నా కూ ఏ వీూ తోచడం లేదండీ వదినా!

గౌరి — అమ్మా!

రత్నాంగి — ఆఁ!

గౌరి — (ముందుకి వచ్చి) తమకి ఆకలి లేదట, కనక, తమర్ని భోజనం చెయ్యవలసిం దని వర్తమానించారు అబ్బాయి.

రత్నాంగి — (విజయాదిత్యుడితో) విన్నారా?

విజయాదిత్యుడు — అదేమిం? అత నిప్పు డెక్కడున్నాడూ?

గౌరి — కింద, వుత్తరపు వసారాలో వున్నారుట బాబయ్యా!

విజయాదిత్యుడు — ఎవరెవరున్నారూ?

గౌరి — ఒక్కరే వున్నారుట. సుబుద్ధి అయ్యవా రిప్పుడిప్పుడే వెళ్లిపోయారుట బాబయ్యా!

రత్నాంగి — బుల్లి బాబయ్య పిలు స్తున్నా రని చెప్పి పంపు.

గౌరి — మంచి దమ్మా!

[గౌరి సున్నం దాటి వెళ్లి, యీ సంగతి చెప్పి, అక్కడ వున్న పరిచారికను పంపేసి వస్తుంది.]

రత్నాంగి — నాయనకి యిక నిద్రా హారాలు కరువైపోతా యున్నమాట.

విజయాదిత్యుడు — (నిట్టూర్పు విడుస్తూ మొగం వంచుకుంటాడు)

రత్నాంగి — ఆ జంజాటంలో పడిపోతే యిదంతా మరిచిపోవచ్చు ననుకుంటే వెళ్లి అనే మాటకూడా వినిపించుకోడం లేదు నాయన!

గౌరి — బుల్లి బాబయ్య యిక్కడున్నారు బాబూ!

రత్నాంగి — (గ్రీవాభంగంగా చూస్తూ) నాయనా!

["వచ్చా వమ్మా" అంటూ సారంగధరుడు వస్తాడు.]

రత్నాంగి — బుల్లి బాబయ్య పిలుస్తు న్నారు నాయనా!

విజయాదిత్యుడు — ఇలా రావోయ్!

సారంగధరుడు — (చేతులు కట్టుకుని విజయాదిత్యుని దగ్గిర నుంచుని) ఏమి సెలవు బుల్లి బాబయ్యా!

విజయాదిత్యుడు — (కూచో మని స్థలం చూపిస్తూ) భోజనం మానుకోవడం యెందు కోయ్? దానివల్ల యేమిటీ ప్రయోజనం?

సారంగధరుడు — (మండెమీద కూచుని) మధ్యాహ్నభోజనం ఉదాత్తం అయిందండీ!

విజయాదిత్యుడు — (రత్నాంగికేసి చూస్తాడు.)

రత్నాంగి — నాయన మధ్యాహ్నం కంచందగ్గిర కూచున్నాడు, లేచాడు, అంతే. నాలుగు మెతుకు లయినా పుచ్చుకోనే లేక పోయాడు.

విజయాదిత్యుడు — అవునా? ... ... అబ్బే! నువ్వు బంతిలో లేకపోతే అమ్మ భోజనం చేస్తారా?

సారంగధరుడు — (రత్నాంగి కేసి ఆత్రంగా చూస్తాడు)

రత్నాంగి—పోనీ, బుల్లి బాబయ్యా నీ పూట కిక్కడ వుండమన మంటావా నాయనా?

సారంగధరుడు—ఉండ మనం డమ్మా! (విజయాదిత్యుడితో) ఉండండి బుల్లి బాబయ్యా!

విజయాదిత్యుడు—(రత్నాంగి కేసి చూస్తాడు)

రత్నాంగి—దయచెయ్యండి. తప్పదు. తమరు లేకపోతే నాయన యీ పూట భోజనశాలకే రాడు.

విజయాదిత్యుడు—(ఒక్క మాటు రత్నాంగికేసీ, వొక్కమాటు సారంగధరుడి కేసీ చూసి) సరే మరి.

రత్నాంగి—గౌరీ!

గౌరి—అమ్మా!

రత్నాంగి—ఈపూట భోజనాలిక్కడే అని చెప్పి చెల్లెమ్మగారినీ, పిల్లల్నీ తీసుకురా.

సారంగధరుడు—(ఉత్సాహం కనపరుస్తాడు)

గౌరి—మంచి దమ్మా!

విజయాదిత్యుడు—వా రెందుకు వదినా?

సారంగధరుడు—రానివ్వండి బుల్లి బాబయ్యా! ఏకబంతి అయి పదిదినాలు కావస్తోం దండీ! (రత్నాంగితో) నేను వెళ్లి పిలుచుకు వస్తానండీ అమ్మా!

రత్నాంగి—అంతకంటేనా తండ్రీ?

విజయాదిత్యుడు—అందరమూ కలిసి వస్తాం వదినా!

రత్నాంగి—అలాగే చెయ్యండి. (గౌరితో) సంగతి రావపోదెమ్మగారితో చెప్పి, నువ్వుకూడా వెళ్లు. చూడూ, చంద్రశేఖరం బాబుని నడిపించావు సుమా!

గౌరి—(చిరునవ్వుతో) నడవమంటే మాత్రం నడుస్తారా బాబయ్యా!

విజయాదిత్యుడు—గుర్రం కావా లన కుండా వస్తే నడిచినంత ఫలం.

సారంగధరుడు—ఆగుర్ర మయినా అదీ యిదీ పనికి వస్తుందా, చింతపువ్వన్న గుర్రమే కావాలి గదా?

రత్నాంగి—బాగా చెప్పావు నాయనా! చిట్టితండ్రిని నిన్న పొద్దుట అనగా చూశాను. కళ్లు కాయలు కాసిపోయాయి; కాని నిద్ర పోతున్నాడో యేమిటో?

విజయాదిత్యుడు—అప్పుడే నిద్రా? చిన్నమ్మకీ ఆయనకీ యిది దశావతార్ ఆట సమయం. మడతపేచీలు పెట్టి ఆమెని కెక్కూ కెక్కూ మనిపిస్తూ వుంటా డిప్పుడు. ఒక్కొక్కప్పుడు తల్లికూడా విసిగిపోతూ వుంటుం దతనితోటి.

రత్నాంగి—నిజంగా అలాంటి పిల్లల్ని సద్దగలిగితేనే చాతుర్యం. చెల్లెమ్మగారి అదృష్టం చాలా గొప్పది.

విజయాదిత్యుడు—అక్కచెల్లెళ్ల చాతుర్యం అలాంటిది వదినా!

రత్నాంగి—మరి తమ అన్నాతమ్ముళ్ల గడసరితనమో?

విజయాదిత్యుడు—(చిరునవ్వుతో) చిత్తం, చిత్తం. ఇప్పుడే వస్తాను.

[అందరూ లేస్తారు.]

## పన్నెండో రంగం

రాజరాజు నగరు.

జాముపొద్దువేళ. రాజరా జొక గదిలో కూచుని వున్నాడు.

మహామంత్రి చిట్టిపీరన్న యెదురుగా మండె మీద కూచుని వున్నాడు.

***

చిట్టిపీరన్న — సంస్థానవైద్యు లంతా తలో మాటా చెబుతున్నారు. ఒకరిమాట వొకరికి నచ్చడం లేదు.

రాజరాజు — అది తప్పదు చికిత్సకు కారణం కావచ్చునే?

చిట్టిపీరన్న — అందుకే నేను భయపడు తున్నాను. ఎంత ప్రయత్నించినా వారికి సమీకరణం సాధ్యం కాకుండా వుంది.

రాజరాజు — గట్టిచిక్కే.

చిట్టిపీరన్న — చాలా గట్టిచిక్కే మహాప్రభూ! కాని భట్టారకులవా రంటే, వారందరికీ భక్తీ, గౌరవమూ, ఆదరమూ, విశ్వాసమూ సమానంగానే వున్నాయి. వారి అస్వాస్థ్యానికి వారంతా సమానంగానే చింతిస్తున్నారు. ఆ కారణంవల్ల అంతా తీవ్రాలోచనలు చేసుకునే మాట్లాడుతున్నారు. అంచేత యెవరి నిదానమూ కాదనడానికి వీల్లేకుండా వుంది.

రాజరాజు — ఇప్పుడు చికిత్స యెవరు నడుపుతున్నారూ?

చిట్టిపీరన్న — నరసంభట్టుగారు మహాప్రభూ!

రాజరాజు — యత్కించిత్తైనా గుణం— (అర్ధోక్తి)

చిట్టిపీరన్న — అది గుణమనే వారి నమ్మకం; కాని కోనప్ప శాస్త్రులుగారూ, అన్నంభట్టుగారూ అది గుణం కాదనీ, మరొక దుర్గుణమే అనీ దృఢంగా వాదిస్తున్నారు.

రాజరాజు — పరాశరభట్టారకులు?

చిట్టిపీరన్న — అనువూ, మినువూ చెప్పడం లేదు వారు. చూస్తూ వింటూ — (అర్ధోక్తి)

రాజరాజు — అంతకంటే వా రేం చెయ్యగలరూ? అనుభవపూర్ణులున్నూ అయిన వృద్ధులను కాదనడానికి వారి కింకా ధైర్యం చాలదు పాపం!

చిట్టిపీరన్న — అలాగే తోస్తోంది. ఇక నా వుద్దేశం మనవి చేసుకుంటాను మహాప్రభూ!

రాజరాజు — కానివ్వండీ.

చిట్టిపీరన్న — ఈ వృద్ధులవల్లా యేమీ కాదు. పరాశరభట్టారకులున్నూ ఏమీ చెయ్యలేరు. పోగా నన్నయభట్టారకులవారికిక ఒక్కటే చికిత్స వుంది.

రాజరాజు — ఆ విషయమై మీ కంత నిష్కృష్టాభిప్రాయం వుంటే ఆచికిత్స మీరే యెందుకు నడిపించకూడదూ? మీరే పూనుకుంటే కాదనగలవా రెవరూ? పైగా మీ దగ్గిర సాధనసామగ్రి తక్కువా, మీరు సాధారణులా? సంచికట్టే లేదు కాని సంస్థాన వైద్యుల్లో మీకంటే సమర్థు లెవరండీ? రెండేళ్లనాడు మహారాణికి సన్ని పాతించినప్పుడు మీరేకదా వొడ్డెక్కించగలిగారు?

చిట్టిపీరన్న—చికిత్స అంటే అది ఔషధచికిత్స కాదు మహాప్రభూ!

రాజరాజు—మరేమిటి?

చిట్టిపీరన్న — ప్రభువుల అనుగ్రహం వాక్కటే దానికి పరమౌషధం. ఏలినవారి దర్శనంమాత్రమే దానికి తగిన అమోఘ చికిత్స.

రాజరాజు — ఇప్పటికీ అది నిషిద్ధం కాలేదే?

చిట్టిపీరన్న — చర్చలవల్ల యిప్పుడు ప్రయోజనం లేదు. తమరు దయార్ద్రహృదయులు కావాలి. నిజానికి, భట్టారకులవారు, అలా చివికి చివికి జీర్ణించి పోవలసినవారు కారు మహాప్రభూ!

రాజరాజు — అవును. అది యెరుగుదును. అయితే, ఆదుర్దశ, వారికి పరాపాదితం కాదు, స్వయంకృతం, తెలుసా?

చిట్టిపీరన్న — చర్చవల్ల ప్రయోజనం లేదు మహాప్రభూ!

రాజరాజు— (కొంచెం చురుగ్గా) మరేమంటారండీ?

చిట్టిపీరన్న — వారి భాగ్యం తమ చేతిలో వుందని — (అర్థోక్తి)

రాజరాజు — తెనిగించి చెప్పండి.

చిట్టిపీరన్న — ఆస్థానికి రావలసిందని తమ రొక్కమాటు వర్తమానిస్తే — (అర్థోక్తి)

రాజరాజు — (మొగం పక్కకి తిప్పుకుంటూ) అసంభవం! (వొత్తి పలుకుతూ) అది సాధ్యపడేది కాదు.

చిట్టిపీరన్న—(నిర్విణ్ణు డయిపోతాడు)

రాజరాజు — ఆదిలో, ఆస్థాన మర్యాద లతిక్రమించినవారు వారే అని మీకే తెలుసు.

చిట్టిపీరన్న — అది కాదని నేను — (అర్థోక్తి)

రాజరాజు — ఇక యిది మాత్రం మీరెలా చెప్పగలిగారండీ?

చిట్టిపీరన్న — కటాక్షించమని ప్రార్థించడం— (అర్థోక్తి)

రాజరాజు — క్షోభపెట్టినవారు బిరబిగిసి వుండడమూ, క్షోభపెట్టబడ్డవారు దయతలచడమూ, కటాక్షించడమూనూ కదూ?

చిట్టిపీరన్న— ఒక్క సంగతి మనవి చేసుకుంటాను.

రాజరాజు—కానివ్వండి.

చిట్టిపీరన్న—ఆవేళే కనక తమ రాగ్రహించివుంటే వా రేమయిపోయేవారో?

రాజరాజు—దాన్ని మీ రేమంటారూ?

చిట్టిపీరన్న—కటాక్షించడమే మహాప్రభూ! కాదని యెవ రనగలరూ? అయితే, దూరాలోచనతో ఆగ్రహం నిగ్రహించుకుని, కొంత కటాక్షించి వుండినవారు మరికొంత కటాక్షించడం— (అర్థోక్తి)

రాజరాజు—(పక్కకి చూస్తూ) సంభవం కాదు. (చిట్టిపీరన్నకేసి చూస్తూ) ఏ ల్లేదండీ!

చిట్టిపీరన్న—(నిర్విణ్ణు డయి వూరుకుంటాడు.)

రాజరాజు—వారు పశ్చాత్తాప పడవలసిందే.

చిట్టిపీరన్న — ఒప్పుకున్నాను మహాప్రభూ!

రాజరాజు—అది నాయెదట జరిగితీరవలసిందే.

చిట్టిపీరన్న — అది ధర్మమే మహాప్రభూ!

రాజరాజు — తమకి తామై వారే ముందు రావలసిందే.

చిట్టిపీరన్న— ఆ వొక్క విషయమే—(అర్థోక్తి)

రాజరాజు— (దృఢస్వరంతో, నిక్కచ్చిగా) జరిగితీరాలి.

చిట్టిపీరన్న— ( స్తబ్ధుడయి వూరుకుంటాడు.)

రాజరాజు— (పక్కకి చూస్తూ) పోనీ, నే నింకొకమెట్టు కిందికి దిగుతాను. (చిట్టిపీరన్న కేసి చూస్తూ) వారు స్వయంగా వస్తే నేను మనస్ఫూర్తిగా స్వాగతం నివేదించుకుంటాను. వెనకటి సంగతు లేమీ వుటంకరించను. ఈ నడమంత్రపు కల్లోలం సంభవించినట్టు స్ఫురణకూడా కలగనివ్వను. ఏం, సరా?

చిట్టిపీరన్న— మహోదారులు కదా, తమ రన్యథా చెయ్యడం యెలా సంభవిస్తుంది మహాప్రభూ?

రాజరాజు— వారు, అప్పుడు ఎందుకలా వ్యగ్రు లయిపోయారో నేను గుర్తించక పోలేదు. వారియెడల నాభక్తి యీషణ్మాత్రమూ కలుషితం కాలేదు. గౌరవాదరాలున్నూ క్షీణించలేదు.

చిట్టిపీరన్న—అది కనపడుతూనే వుంది. అయితే, ఇంత స్నిగ్ధహృదయులు తాము—

రాజరాజు—అంతే. ఇక నే నేమీ చెయ్యలేను.

చిట్టిపీరన్న— వారు బ్రాహ్మణమాత్రు లయితే వారి సంగతి నేను స్మరించకే పోదును. గొప్ప పండితులూ, మహాకవులూ అయినా నే నేమీ కలగచేసుకోకే పోదును; కాని యేలినవారి కంకితంగా వారు ఆంధ్రీకరిస్తూవున్న మహాభారతం—(అర్థోక్తి)

రాజరాజు — ఆ విషయమై నే నెంత మథనపడుతున్నానో మీకు తెలుసా?

చిట్టిపీరన్న—తెలుసు, మహాప్రభూ! పూర్తిగా తెలుసు. కనకనే తమ యెదట మళ్లీ నే నీ విషయం ప్రస్తావించుకోగలిగాను. తమ కంత తపన వున్నప్పుడు పట్టుదల కాస్త సడలించుకోగూడదా? నేను భట్టారకులవారిని వూసుకు వస్తున్నా నని మమ్మేలినవారు భావించకూడదు. వా రిప్పు డస్వస్థులై మంచాన పడిపోయివున్నారు. లేకపోతే, ప్రతిష్ఠాపిశాచాన్నుచ్చాటనం చేసి వారినే నేను తమ సన్నిధికి తేగలిగివుందును; కాని అందుకు వీలులేని పరిస్థితులు—(అర్థోక్తి)

రాజరాజు— ఇక మీ రా విషయం పదేపదే యెత్తవద్దు.

చిట్టిపీరన్న— ( నిరాశ కనపరుస్తూ) అయితే, భట్టారకులవారి కిక రక్షణ లేదన్నమాట.

రాజరాజు—(పక్కకి చూస్తూ) ఉండా వచ్చు, లేకపోనూ వచ్చు. సహనానికైనా కొంత హద్దుంది.

చిట్టిపీరన్న—ఔదార్యంలోనూ తమరు పారంగతత్వం కనపరిచారు. సహనంలో హద్దు దాటే వున్నారు; కాని ఒక్క విషయంలో చిన్న పట్టుదల మాత్రం—(అర్ధోక్తి)

రాజరాజు—పోనీ, వారు చేసిన ధర్మ నిర్ణయం తప్పని వారిచేత అనిపించగలరా మీరు ?

చిట్టిపీరన్న—వా రిప్పు డున్న ఉన్మాదావస్థలో—(అర్ధోక్తి)

రాజరాజు — ఆమాట అన్నప్పుడు వా రున్మాదావస్థలో లేరనా మీ రనేది ?

చిట్టిపీరన్న—చర్చ వద్దని నామనవి. అది యిదివరకే కావలసినంతకంటే యెక్కువే అయిపోయింది. స్థితిగతు లిలా విషమించడాని కదే కారణం కూడానూ. అయితే, ఈనడమంత్రపు కల్లోలం వచ్చినట్టే తోచనివ్వ నని తమ రిప్పుడిప్పుడే—(అర్ధోక్తి)

రాజరాజు—దాని కిక్కడ కాదు సమన్వయం. ఆసందర్భం వేరు. మీరు ముఖపిధానం చెయ్యా లని చూడకండి.

చిట్టిపీరన్న—(కొంచెం చురుగ్గా) అనుగ్రహించ మని ప్రార్థించడం ముఖపిధానం చెయ్యడమా మహాప్రభూ? భట్టారకుల వారు నాకు వియ్యంకులు కారు. సన్నిహితులయినా కారు. భారతాంధ్రీకరణంవల్ల కూడా నాకు కలిగే ప్రయోజనం లేదు. ఏలినవారి సేవలో నేను దీక్షితు ణ్ణయి వున్నాను. తమకి అభ్యుదయం కోరడమూ, అది సాధించడమూ—ఇదే నావిధికృత్యం. భట్టారకులవారున్నూ ప్రభువుల అభ్యుదయం ఆకాంక్షించేవారే. అయితే, హఠాత్తుగా పొరపొచ్చాలు వచ్చాయి. వాటిని సవరించక పోతే నేనుండి లాభం యేమిటి ?

రాజరాజు—(కొంచెం కరుగ్గా) దాని కిదా మార్గం ?

చిట్టిపీరన్న — (నిరుత్సాహపడిపోయి) సరే......నాకోరిక మన్నించకపోయినా తాము అసాధారణదయాదాక్షిణ్యాలే కనపరిచారు. ఇది మాత్రం యేమి తక్కువా? నా ఆశలు భగ్నం కాలేదు. ఇక అక్కడ కూడా మళ్లీ ప్రయత్నించి చూస్తాను. నేను కృతార్థుణ్ణి కాగలననే నానమ్మకం.

రాజరాజు — మీప్రజ్ఞ అలాంటిదే. తప్పకుండా ప్రయత్నించండి. చూడండీ! భట్టారకులవారికి మన స్తిమితం లేదని చెబుతున్నారు మీరు. అంచేత మీరు తీసుకురావా లని ప్రయత్నించినప్పుడు వా రందుకనువైన స్థితిలో వుండకపోవచ్చు. అందుకు మీ రేమీ నిరుత్సాహపడనక్కర్లేదు. వా రెప్పుడు రాగలిగితే అప్పుడే—వేళా పాళా మీరు చూసుకోనక్కరలేదు. అర్ధరాత్రి బుద్ధిపుడితే వారిని అప్పుడే తీసుకురావచ్చు.

చిట్టిపీరన్న — (దోసిలివొగ్గి) మహాప్రసాదం.

రాజరాజు—వస్త్రాభరణాల విషయమై కూడా పట్టింపు లక్కర్లేదు. ఎలా వున్నవా రలా బయలుదేరినా రావచ్చు.

చిట్టిపీరన్న—చిత్తం చిత్తం. మరి సెలవిప్పించండి.

రాజరాజు—వెళ్లి రండి.

[చిట్టివీరన్న వెళ్లి పోతాడు.]

రాజరాజు— (ద్వారంకేసి చూస్తూ) ఎవ రక్కడ ?

["చిత్తంచిత్తం" అంటూ చిట్టి వస్తుంది.]

రాజరాజు—మహారుద్రయ్యగారు.

చిట్టి—వారు కింద వున్నారు మహా ప్రభూ !

రాజరాజు—రప్పించు.

చిట్టి—(దోసిలి వొగ్గి) గారి......... వచ్చివుంది మహాప్రభూ !

రాజరాజు—ఏమిటి సంగతి ?

చిట్టి—మహారాణీ వర్తమానించారు.

రాజరాజు—రాత్రి దయచేస్తా మని.

చిట్టి—అవును మహాప్రభూ !

రాజరాజు — (ఆలోచించి) సరే, యేర్పాట్లు చేయించు.

[రాజు ముందుకి అడుగు వేస్తాడు. చిట్టి తప్పుకుంటుంది. రాజు వెళ్లిపోతాడు.]

చిట్టి— (ఒక్క క్షణం వుండి, గుమ్మం కేసి చూస్తూ) అన్నా !

అన్నపూర్ణ—(వస్తూ) ఎందుకు చిన్నా ?

చిట్టి—వినపడిందా ?

అన్నపూర్ణ — కిన్నెరలు మోగినట్టుండగా వినపడకేం ?

చిట్టి—కనక, నాలుగ్ఘళ్లె రాత్రి అయే టప్పటికి సర్వమూ సజ్జితమై వుండాలి.

అన్నపూర్ణ—అవు నలాగే.

చిట్టి—వీణావాదనకు మంగళాయి. వేణుగానానికి శేషశాయి. మార్దంగికురాలు రంగనాయకి.

అన్నపూర్ణ — మొలిచినట్టు కవ కలుస్తుంది.

చిట్టి—నృత్యానికి కిన్నెరసాని.

అన్నపూర్ణ—సెబాస్ ! బంగారానికి పరిమళం అబ్బుతుంది.

చిట్టి—సన్నిధిని వుండవలసిన వంతు నీదీ నాదీనీ. తెలుసా ?

అన్నపూర్ణ—ఆహా !

చిట్టి—ముందు మల్లెమూనే, పన్నీరూ— జ్ఞాపకం వుందా ?

అన్నపూర్ణ—ఓహో !

చిట్టి—మరి పద.

అన్నపూర్ణ—హూ, హూ !

[ఇద్దరూ వెళ్లిపోతారు.]

## పదమూడో రంగం

ఉదయం రెండు ఘళ్ల పొద్దెక్కాక.

వాయవ్యపు బురుజు సమీపంగా, పశ్చిమ ప్రాకారంమీద రాజరాజూ, మహారుద్రయ్యా పచారు చేస్తూ వున్నారు.

ఇటూ అటూ వున్న రెండు బురుజులమీదా నలుగురు సేవకులు ఆజ్ఞలకోసం వేచివున్నారు.

***

మహారుద్రయ్య — మహారాణీ అను దినమూ కదుపుతూనే వున్నారుట మహా ప్రభూ ! సందర్భం అయినప్పు డల్లా తా మున్నా పోరుతూనే వున్నారుట ; కాని"యి

ప్పుడు కాదు" అని తప్ప మరోమాట లే దంటారు తమ్ముడుగారు.

రాజరాజు—మరి అబ్బాయి ?

మహారుద్రయ్య— నిన్న సాయంత్రం తమ సెలవు పుచ్చుకుని వెళ్లి, యీశాన్యం బురుజుమీద యువరాజులుంగారి దర్శనం చేసుకున్నాను.

రాజరాజు—వెంట సుబుద్ధి అయ్యవారున్నారా ?

మహారుద్రయ్య — లేరు. అబ్బాయి ఒక్కరే పావురాలతో వినోదిస్తున్నారు మహాప్రభూ !

రాజరాజు—మంచి సమయం.

మహారుద్రయ్య—నిజమే. ఆ యేకాంతం చూసి నేనూ తమలాగే అనుకున్నాను ; కాని గడియసేపు వుపోద్ఘాతం నడిపి, వారు సావధాను లైనట్టు గుర్తించి, మెల్లిగా అందించాను ; అయితే—(అర్ధోక్తి)

రాజరాజు— సంబరపడుతూవిన్నాడా?

మహారుద్రయ్య — సంబరం! మహాప్రభూ! నన్ను చూస్తేనే వారదోరకంగా అయిపోతారు గదా. నేను చెప్పినది — (అర్ధోక్తి)

రాజరాజు— ఏమన్నాడో చెప్పండి పోనీ.

మహారుద్రయ్య— "ఇప్పుడు తొందరేమిటీ?" అనేసి వూరుకున్నారు తడుముకోకుండా.

రాజరాజు—(చకితు డవుతాడు)

మహారుద్రయ్య—ఎన్నిమాట్లు, ఎన్ని విధాల మార్చి అడిగినా అదే ముక్తాయింపు. మరోమాటే లేదు.

రాజరాజు—(ఆలోచనలో పడతాడు)

మహారుద్రయ్య— మూడు గడియలు చెప్పినా పూర్తికాని సంగతి మూడుమాటల్లో తేల్చేస్తారు. ఆ మితభాషిత వొకనాటి కంటే వొకనాడు పెరిగిపోతోంది.

రాజరాజు — మితభాషిత వొకటే అయినా వొకదారే. నాలుక పెరుక్కున్నా అన్నమాట తిరక్కపోవడం వొక టుంది కదా ?

మహారుద్రయ్య— అదిన్నీ అసాధ్యంగానే వుంది మహాప్రభూ!

రాజరాజు — ఇలాంటివాడు భార్యకేమి వుల్లాసం కలిగించగలడండీ ?

మహారుద్రయ్య—చిత్తం చిత్తం. ఎంతో కాలంగా నే నీ సంగతే యోచిస్తున్నాను. చివరికి నాకొక్క వుపాయం—(అర్ధోక్తి)

రాజరాజు—ఏమిటదీ ?

మహారుద్రయ్య — వారికంటే మితభాషిణి అయిన పిల్లను తెచ్చి పెళ్లిచెయ్యడం.

రాజరాజు —ఏదో శాస్త్రం చెప్పినట్టుంది మీమాట.

మహారుద్రయ్య—(నిర్విణ్ణు డవుతాడు)

రాజరాజు — పెళ్లే వద్దంటున్నాడు కదా ?

మహారుద్రయ్య—అది ఆశాభంగంవల్ల కలిగిన నిర్వేదం మహాప్రభూ ! అది స్థిరంగా

వుండిపోతుందా ? ఎప్పుడో వొకప్పుడు—(అర్థోక్తి)

రాజరాజు— అది సరే. అయితే, సర్వమూ కాలానికి విడిచిపెట్టి మనం చూస్తూ వూరుకోడం మంచిదా ?

మహారుద్రయ్య — ఒక్కనాటికిన్నీ కాదు. మన ప్రయత్నంలో మనం వుండవలసిందే. తీవ్రప్రయత్నాలే సాగించాలి కూడానూ.

రాజరాజు — ఉపాయం ?

మహారుద్రయ్య — లక్షలు. ఒకటే అన్నమాటేమిటి మహాప్రభూ ?

రాజరాజు— మరి అపాయాలు ? అవి మాత్రం వొకట్లా ? ఎటు చూసినా, ఎటు చూసినా యెదిరింపే. ఎవర్ని చూసినా విరోధులే.

మహారుద్రయ్య—సంఖ్య గొప్పదే, కాదనను.

రాజరాజు—సత్తా మాత్రం తక్కువటండీ ?

మహారుద్రయ్య—తమరలా అధైర్యపడితే—(అర్థోక్తి)

రాజరాజు—అలా అనుకోకండి మీరు. అధైర్యమూ, జంకూ నేనెప్పుడూ యెరగను; కాని స్థితిగతులు పరిశీలించుకోవద్దా మనం?

మహారుద్రయ్య — అవును మహాప్రభూ, నామనవి అదే. మనం యెంతమాత్రమూ తొందరపడకూడదు. మనస్సు పాడు చేసుకోనూ కూడదు.

రాజరాజు—మనస్సు పాడుకావడానికేం వచ్చిందీ? కాని చూడండీ, యెటు వెళ్లినా అడివీ ముళ్లూనూ.

మహారుద్రయ్య—సత్యమే.

రాజరాజు—ప్రపంచకం యావత్తూ మీదపడిపోయినా సరే అని కోరి తెచ్చుకున్న జక్కులదీవి రాజపుత్రిక కొమ్మక్క కూచునె. అదేదో వ్రతంట వ్రతం.

మహారుద్రయ్య—తమ క్షేమం కోసం—(అర్థోక్తి)

రాజరాజు—అది నా క్షేమం కోసమే. యయాతి మహారాజులుంగారిలాగ పునర్యావనం కోసం నేనేతంటాలు పడనక్కర్లేకుండా, ఘోరనిష్ఠతో ఆమే తపస్సు చెయ్యడం సంతోషకారణమే ; కాని, అది యెవరికేనా తెలిసిపోయిందంటే మరి నాసంగతి యెంత రసాభాసం అయిపోతుందో ఆలోచించండీ.

మహారుద్రయ్య — అమ్మమ్మా, అది తెలిసిపోనివ్వడానికి వీలా ? మనం చాలా కట్టుదిట్టంగా ఉండాలి మహాప్రభూ !

రాజరాజు — ఆ కష్టసుఖాలు తనకీ ఉన్నవే కనక, ఆ విషయమై ఆమే జాగ్రత్తగా వుంటుంది. సందేహం లేదు ; కాని మహారాణీ యెడమొగమూ పెడమొగమూనూ. మాటే తక్కువ. మాట్లాడితేమాత్రం సూటీపోటీలు. ఒకమాటకి పది అర్థాలూ, యిరవై దెబ్బలూనూ!

మహారుద్రయ్య—(చూస్తూ వూరుకుంటాడు.)

రాజరాజు — తమ్ముణ్ణి చూశారా ? చిట్టివీరన్నగారెప్పుడూ అటే మొగ్గు కదా?

భట్టారకులవారి ప్రతిఘటనే వయం, యేమీ చెయ్యలేకపోయింది; కాని వారి రోగం మన స్సుని గుంజేస్తోంది. అబ్బాయి తిరగబడతా డని మన కెప్పుడూ అనుమానమే లేదూ; కాని సుబుద్ధి అయ్యవారు అతగా ణ్ణెప్పు డెలా తిప్పేస్తారో ?

మహారుద్రయ్య--మనం వూరుకున్నంత సేపే. ఊరుకుంటేనే.

రాజరాజు— హెచ్చుతగ్గులు వచ్చా యంటే చివరికి మనం నొక్కేస్తా మనే అను కోండి. అయినా, ప్రస్తుతం మన కీ గుంజా టన తప్పదు కదా ?

మహారుద్రయ్య—అలాంటిది సంభవించ కుండా వుండాలని—ముఖ్యంగా అబ్బాయిగారి వివాహం విషయమై రాత్రీ పగలూ నేను చేసే ఆలోచనలు భగవంతుడికే తెలవాలి. తరంగతరంగాలు గా వూహాలు పుట్టుకు వస్తు న్నాయి. సరి ఉపాయాలు—(అర్ధోక్తి)

రాజరాజు— ఏదీ, మీరు గొప్ప దను కుంటూ వున్న వొక్కవుపాయం చూపిం చండీ.

మహారుద్రయ్య— ఒక్క రాజపుత్రిక తో అయినా అబ్బాయిగారికి మనం యే కాంతం సంఘటించగలిగితే—(అర్ధోక్తి)

రాజరాజు—అవునంషోయ్! (ఓరగా పైకి చూస్తూ, తల వంకిస్తూ, సాలోచనగా) అది బాగున్నట్టుంది ... బాగానే వుంది... (మహారుద్రయ్యతో) చాలా బాగుందండీ. అయితే యెవరున్నారూ? అందుకు తగిన రాజపుత్రికను చెప్పండీ.

మహారుద్రయ్య—అరవై పటాలు వచ్చి వున్నాయి కదా—(అర్ధోక్తి)

రాజరాజు—మనతో యేకీభవించే రా జెవరు ?

మహారుద్రయ్య—పైవారితో అయితే యిది సాధ్యపడేది కాదు. మన మండలేశ్వరు లయితే నిమిషంలో సాధించవచ్చు.

రాజరాజు--అవునవును. మీరు సరిగా ఊహించారు. (పక్కకి చూస్తూ ఆలోచించి మహారుద్రయ్యతో) పోల్నాటి మండలేశ్వరు డికి మనం యెంత చెబితే అంత. అతని కూతురుకూడా లక్షణవతిగా కనబడుతుంది.

మహారుద్రయ్య — చిత్తం చిత్తం, చక్కదనంలోనే కాక విలువిద్యలో కూడా ఆమె ప్రఖ్యాతి పొంది వున్నారు.

రాజరాజు— వారికీ మనకీ తరతరా లుగా యెంతో కొంత బంధుత్వమున్నా వుంది. మన మంటే అతనికి గురుభావం కూడా వుం డెరుగుదురా ?

మహారుద్రయ్య — జ్ఞాపకం వచ్చింది మహాప్రభూ! తమకి, శబ్దవేధ, యేలిన వారే నేర్పివున్న ట్టొకమాటు సెలవిచ్చి వున్నారు వారు.

రాజరాజు--కనక- (స్ఫురణ నటించి) ఆఁ, ఆమెవిలువిద్య సంగతి కూడా జ్ఞాపకం చేశారు మీరు. ఒకటి చెయ్యండి.

మహారుద్రయ్య--సెలవిప్పించండి.

రాజరాజు -- మల్లెసాల ప్రాంతంలో మూకాలు విజృంభించి అల్లకల్లోలం చేసేస్తూ

వున్నట్టూ, అది నివారణ చేయించవలసి నట్టూ వుపాయాలు పన్ని విన్నపాలు తెప్పించండి మీరు. మనం సుబుద్ధి అయ్యవారిని వశచేసి అబ్బాయిని పంపుదాం. సరిగా అదే వేళకి, చెలికత్తెలను మాత్రమే తోడిచ్చి తన కూతుర్ని వేటకు పంపవలసిం దని విశ్వనాథభూపతికి వర్తమానం అందించండి.

మహారుద్రయ్య— చాలా బాగుంది మహాప్రభూ! ఇది కార్యకారి కావచ్చు ననే నాకు తోస్తోంది. ఇవాళే సర్వానికీ వుపక్రమణం చేసి, నాలుగు దినాలలో సంధానం చేయిస్తాను.

రాజరాజు—తరవాతి సంగతి అప్పుడు చూసుకుందాం. మనం మరి విహారానికి వెడదామా ?

మహారుద్రయ్య — చిత్తం చిత్తం, గుర్రాలు సిద్ధంగా వున్నాయి. పరివార మున్నూ కనిపెట్టుకుని వుంది.

రాజరాజు—పదండి.

[ఇద్దరూ వెళ్లిపోతారు]





సిలోనునందలి కాండీసరస్సులో ఒకభాగము

# మన గేయ సాహిత్యము

= శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి =

ఒకసారి సోమశేఖరశర్మగారితో చెన్నపట్టణంలో కెనిమరా లైబ్రరీకి వెళ్లినప్పుడు ఆయన ఆ గ్రంథాలయ సముద్రంలోని అనేక పుస్తకరత్నాలను ప్రశంసిస్తూ ప్రసంగవశంలో ఒక అరలో వున్న ఒక పెద్ద గ్రంథాన్ని చూపుతూ ఇట్లా అన్నారు: "ఈ పుస్తకం చూశారా ? ఇది బెంగాలీవారు తమ సుప్రసిద్ధ గేయాలను పోగుచేసి, పరిష్కరించి, సగర్వంగా తమ దేశీయ సహజకవితాసంపదను ప్రకటించుకొన్న గ్రంథం. ఒక యమ్. ఏ., పి హెచ్. డి. గారు దీనికి ఉదాత్తమైన విపుల ఉపోద్ఘాతం వ్రాశారు. మన తెనుగువాఙ్మయానికి ఇట్లాంటి అదృష్టం ఎప్పుడు పడుతుందోగదా!" అని. అని ఆయన నిట్టూర్చారు.

ఆమాట నాహృదయానికి ఎంతో జ్వలనాన్నీ, విషాదాన్నీ చేకూర్చింది.

ఔను. మనకీ అదృష్టం పట్టడానికి చాలా వ్యవధి కావాలేమో !

ఇప్పటికీ మన దేశంలోని సమర్థులైన సంస్కృతాంధ్ర పండితులలో ఏర్పడవలసినంత సహృదయత యేర్పడలేదు.

మళ్లా—ఈ పండితప్రకాండులు అనేక ఆలంకారికగ్రంథాలను, రసమీమాంసలను, కావ్యసూత్రములను మథించి చదువుతారు. పాండిత్యానికిగాని, ప్రకర్షకుగాని నిజంగా మనదేశం గొడ్డుపోలేదు. కాని, ఇక మనకు లేనిదీ— ముఖ్యంగా కావలసినదీ ఒక్క—సహృదయత.

ఏ పండితునివద్దనైనా ఎంతో రమణీయార్థప్రతిపాదకమైన ఒక తెనుగు గేయం "ఎంత బాగున్నదో చూడండి" అని చదివితే ఆయన తనముఖం అమ్లరసభక్షణానంతరంవలె పెట్టి, మన మన్న బాగుకు ఎట్టి విలువనూ ఇవ్వక 'పదకవిత' అని నీరసంగా ఊరుకుంటాడు. ఆ పండితుడు తాను విన్న గేయాన్ని ఒక్క—భాషాదృష్టితో మాత్రమే చూస్తాడు. అందలి భావ. అతని వ్యాకరణప్రమాణాలకూ, తానుకొన్న కవిత్వపు తాహతుకూ సరిపోయిందని నమ్మకం కలిగితే—తరుపరి ఆయన ఆపాటలో ఏమైనా అందం ఉన్నదా అని పరిశీలన చేస్తాడు. పూర్వ కావ్యభాషలో స్థిరపడ్డ ఆయనమనస్సుకు ఒక ఘాటైన సమాసమూ, నాలుగు పసనైన వ్యాకరణవిశేష ప్రయోగాలూ కనపడితే

హర్షించి ఆయన కన్నుల కద్దుకొని గమనిస్తాడు. కాని—

పాలమీగడవంటి సహజమైన జానుతెనుగు భాషలో ముగ్ధహృదయులైన జానపదులూ, స్త్రీలూ ప్రకృతిసౌందర్యాన్నీ, కుటుంబమాధుర్యాన్నీ, ప్రేమనూ, హాసాన్నీ, విషాదాన్నీ ఆధారంగా చేసుకొని ఆలపించిన లలితమైన గేయాల్లోని కవితాసౌందర్యాన్ని ఆస్వాదించే ఔదార్యం చూపించలేదు. ఇందుచేతనే మనదేశంలో పండిన మధురమైన గేయసంపద విశేషప్రచారానికి నోచుకోక మూలలంట ఒదిగి పడివుండవలసిన గతి పట్టించింది.

అక్కడక్కడ కొందరుమాత్రం సహృదయులైన పండితులు గేయసాహిత్యాన్ని ఆదరించేవారున్నా, వారికికూడా సంస్కృతభూయిష్ఠమైన కావ్యప్రమేయంమీద ఉండే అభిమానం ఈ గేయసాహిత్యంపట్ల కనపడదు.

ఈగేయసాహిత్య సహాయనిరాకరణం ఒక్క ఈనాటి పండితులకే నేను అంటగట్టడం లేదు. ప్రసిద్ధ పూర్వాంధ్ర కవుల కాలంనుంచీకూడా గేయవాఙ్మయం ఈసడించబడుతూనే వచ్చింది. ఆనాడు దేశీయచ్ఛందస్సులలో వ్రాసిన కవితను శిష్టకవు లీవిధంగా నిరాకరిస్తూ వచ్చారు:

"ముదివిటులు, విధవలంజలు
పదకవితలు, మారుబాసబాపనవారల్"

అనిన్నీ, "ద్విపదకవిత దిడ్డికంత" అనిన్నీ ఈ శ్రేణి రచనమీద తమకున్న ఏవగింపును వెల్లడించారు.

ఆదికవి నన్నయభట్టు సంస్కృత మహాభారతం మతప్రచారానికైతేనేమి, కళారాధనకైతేనేమి తెలిగించినప్పుడే ఆంధ్రకవిత్వం ఒకవిధంగా సంస్కృతసాహిత్యపు గుప్పిట్లోకి వెళ్లింది. నాడు మొదలుకొని తెలుగుసాహిత్యం చాలావరకు, సంస్కృతాలంకారాలు, గుణాలు, దోషాలు, వ్యాకరణపరిభాషలు, కారకము, ఛందస్సు మొదలైనవాటితో నిండిపోయింది. జాతీయములైన రగడ, ద్విపద, తరువోజ మొదలైన తెనుగుతోబుట్టువులైన ఛందస్సులకు తెనుగుసాహిత్యంలో ప్రాముఖ్యం సన్నగిల్లింది. సంస్కృతీయములైన శార్దూలాది వృత్తములు మన వాఙ్మయాన్ని పాలించడం మొదలుపెట్టాయి.

బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకర శాస్త్రులుగారు బసవపురాణపీఠికలో దేశికవితను గూర్చి ఇట్లా అన్నారు: "మనపూర్వులు పౌరాణికములగు నార్యకథలమీదను, సంస్కృతచ్ఛందస్సుమీదను, సంస్కృతప్రాయమైన తత్సమభాషమీదను అభిమానము గలవారై, దేశీయచ్ఛందస్సులను, దేశీయేతివృత్తములను, దేశభాషను జెదుకద్రొక్కిరి. నేఁడు మనము స్త్రీ, పామరాదుల గేయరచనములని యనాదరముగా జూచు పదరచనముల వరుసలే ద్రావిడభాషలోని ప్రౌఢకావ్యములందలి వృత్తములుగా నున్నవి."

పూర్వము దేశీయచ్ఛందమును, ఇతివృత్తమును ఆదరించి మధురమైన కావ్యరచన చేసినవారు శివకవులు. పాల్కురికి సోమనాథారాధ్యుడు దేశికవితాప్రాశస్త్యమును ఇట్లు ఉగ్గడించినాడు:

"ఒప్పను ద్విపదకావ్యోక్తి నా జనదు
* * * *
ఆరూఢ గద్యపద్యాదిప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుదెనుగు విశేషము ప్రసన్నతకు
* * * *
అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయు గాదె కవివివేకమ్ము"

ఇట్లు శివకవు లాలంబనం ఇచ్చి పోషించిన ఈకవితాశాఖ ఉత్తరకాలంలో అనేక కారణములవల్ల వ్యాప్తం కాలేకపోయింది. రంగనాథుడు, తాళ్లపాక చిన్నన్న మొదలగువారు కొద్దిమందిమాత్రమే దీనినాదరించి తమ కవితకు పాత్రం చేశారు.

రానురాను సంస్కృతప్రభావమే ఎక్కువ పనిచేసి తెనుగుసాహిత్య మంతటా ప్రబంధరచనయే యేలుబడి సాగించింది.

శ్రీ గురజాడ అప్పారావుపంతులుగారు నవ్య సాహిత్యోద్యమం లేవనెత్తి దేశీయుల దృష్టిని మరల తెనుగు జాతీయవృత్తాలమీదికి మరల్చారు.

ఆయన తెలుగుపలుకుబడికి జాతీయ ఛ్ఛందస్సులే ఎక్కువ అనువుగా ఉంటవని గమనించి ప్రముఖ గతి రగడను తీసి కొద్దిమార్పులు చేసి తెనుగు గేయ సాహిత్య నిర్మాణానికి 'పునః ప్రాణానాయమ్య' సంసిద్ధులైనారు. వారి వెంట అనేకమంది ఆంధ్రజాతీయతాభిమానులు గేయసాహిత్య పరమార్థమును గుర్తించి రకరకము లగు ద్విపదాది జాతిచ్ఛందస్సులను గ్రహించి మధురకవిత్వమును వెలయించారు.

ఇందుకు బసవరాజు అప్పారావు, కవికొండల వెంకటరావు, అడవి బాపిరాజు, చింతా దీక్షితులు గార్ల గేయరచనలు నిదర్శనములు.

క్రమక్రమంగా గేయసాహిత్యమందలి ప్రీతి విస్తరిల్లి రసవంతమైన గేయసాహిత్య నిర్మాణం జరుగుతూన్నది.

కొందరు ప్రాచీన గేయసాహిత్య ప్రియాళువులు శ్రద్ధగా అనేక గేయములను అన్వేషణచేసి సంపాదించి పత్రికలలోనూ, పుస్తకములు (చిన్నవి) గానూ ప్రకటించుతూ వచ్చారు. అట్టివారిలో శ్రీపాద గోపాల కృష్ణమూర్తి, టేకుమళ్ల కామేశ్వరరావు, నేదునూరి గంగానరంగార్లు ముఖ్యంగా చెప్పదగ్గవారు. ఇట్టి గేయాభిమానుల గవేషణవల్ల ఇప్పటి కెన్నో రసవద్గేయాలు మనకు లభించాయి. ఇంకా జానపదులలోను, వృద్ధస్త్రీలవద్దను, భిక్షుక పామరాదులవద్దను అనంతమైన ఆంధ్రగేయ సాహిత్యం నిక్షిప్తమై ఉన్నది.

ఇప్పుడు మనకు ఉపలబ్ధమవుతూన్న గేయవాఙ్మయాన్ని రెండు తరగతులుగా విభజించవచ్చు: 1. కుటుంబజీవితానికీ, జానపద జీవితానికీ, భిక్షుక విరాగులకూ చెందిన గేయాలన్నీ ఒక తరగతి;2. చరిత్ర, పురాణ కథలు, ప్రాంతీయ ఉపాఖ్యానాలు మొదలైనవానిని వర్ణిస్తూ పుస్తకరూపంగా ఉన్న గేయాలు రెండవ తరగతి.

ఇందు తొలిశ్రేణికి చెందిన గేయములు, చాటురూపముగా విశేషవిద్యాప్రసక్తి లేని స్త్రీలూ, పురుషులూ చమత్కారంగా, వినోదముగా పలుకగా ఏర్పడినవి. వాటి సహజత్వ మాధుర్యములే ప్రజల దృష్టినాకర్షించి ఒక నోటివెంట మరియొక నోటికి వచ్చి తెనుగుజాతిలో స్థిరపడ్డవి. వీటి ఛందస్సు రగడ, ద్విపద మొదలైనవానికి చెందుతుంది.

భాష నిత్యజీవితంలోని రసవద్వ్యవహార భాష. కుటుంబ జీవితానికి చెందిన గేయాలకు చాలావరకూ స్త్రీలే కవయిత్రులుగా కనబడతారు. ఏమంటే — గృహస్థజీవితంలోని అన్నివైపుల స్త్రీజీవితమూ ఇందులో సన్నిహితంగా కనబడుతుంది.

పుట్టిల్లు, అన్నలు, తమ్ములు, అక్కలు, చెల్లెళ్లు, వదినెలు, వారి సంపద, వారియందలి విశేషానురాగమున్నూ — అత్తిల్లు, అత్తలు, ఆడుబడుచులు, భర్త, బిడ్డలు, ప్రేమ, అల్లుళ్లు, రాకపోకలు, హాస్యాలు, చిరుతకోపాలు, లాలనలు మొదలైనవానిచుట్టూ ఈ వాఙ్మయం పెరిగింది.

ఈగేయంలో ఒక చక్కని కుటుంబసన్నివేశం వర్ణింపబడ్డది:

" కడవమీద కాకి వాలుచున్నది
అంతలోకే వారి అన్న లొచ్చారు
* * * *
కాళ్లకు నీళ్లిచ్చి కన్నీరు నింపె
ఎందుకూ కన్నీరు? ఏల కన్నీరు ?
తుడుచుకో కన్నీరు ముడుచుకో కురులు
ఎత్తుకో పాపడిని ఎక్కు అందలము
మీ అత్తమామలకు చెప్పిరావమ్మా
* * * *
కుర్చీపీటమీద కూర్చున్న అత్తా
మాఅన్న లొచ్చారు మమ్మంపుతారా ?
* * * *
నే నెరగ నే నెరగ నీభర్త నడుగు
* * * *
రచ్చలో ఉండేటి రాజేంద్రభోగీ
మాఅన్న లొచ్చారు మమ్మంపుతారా ?
వండుకో వరిపాలు కట్టుకో చద్ది "

బొమ్మలపెండ్లిలో తెనుగుపడుచు తన బొమ్మకు ఇల్లా నీతి చెబుతుంది :

"వీథిలో తలవిప్పి ముడువకే బొమ్మ
పల్లెత్తి గట్టిగా పలుకబోకమ్మ
పొరుగిళ్ల కెప్పుడూ పోవకే బొమ్మ
నలుగురీ నోళ్లలో నానకే బొమ్మ"

అల్లుడు రావడం చూచి అత్త కొమార్తెతో చెప్పే చమత్కారవచనం చూడండి:

"ఆటకూటమ్ములో ఆడేవు నెమలీ!
వేటగా డొచ్చాడు ఆట చాలించు
బంగారుమేడలో నవ్వావు తల్లీ
నా అల్లు డొచ్చాడు నవ్వు చాలించు."

ఈ క్రిందిగేయంలో మాతాపితృ సుధా వాత్స ల్యం అభివ్యక్త మవుతుంది:

"ఉంగరమ్ములు పెట్టి ముంగురులు దువ్వి
ఒద్దపెట్టుకు తల్లి ముద్దు లాడేది
పలకబలపా లిచ్చి పద్యాలు పాడి
నరసపెట్టుకు తండ్రి చదువు నేర్పాడు."

ఈ వాక్యములలోని శృంగారం గమనించ దగినది:

"వెన్నెలకాలాన రాకోయి దొంగ
వేదవంతుడు అన్న వీథినున్నాడు"

ఇందులో విరహోత్కంఠిత పలుకు—

"సానమీద గంధమ్ము చల్లారిపోయె
సానివాడల పోయి అత డేల రాడు?"

ఈ అర్థం శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి

"సానలం దింకె స్నానకషాయగంధ
మబల యెవ డాహరించె నీయార్ద్రహృదిని"

అన్న పద్యంలో మెరసింది.

ఇందులోని చరిత్ర, పౌరుషచ్ఛాయలు చూడండి:

"ఓయి ఓయి ఓయి ఒడ్డాదిరాజ
పోడిచి గెలిచిన రాజ బొబ్బిల్లిరాజ
బొబ్బిల్లి పోడుగాయె కిమిడీ కిందాయె
మాడుగులు మన కాయె మళ్ళుమీ రాజ!"

జానపదగేయసాహిత్యానికి ఇప్పుడు విశేష ప్రచారంలో వున్న పడవపాటలు, బండిపాటలు, మోహనరంగపాటలు మొదలైన వానిని, స్థలం చాలదు గాని, ఎన్నిటినైనా ఉదాహరించవచ్చును. వ్యవసాయం వృత్తిగాగలిగిన ఈ పల్లెటూరిపడుచు మేనత్త మేనమామబిడ్డల సరసప్రసంగం ముచ్చట గొల్పుతుంది:

"నవ్వుల నారాశి అత్తకొడుకొచ్చి
నువ్వులు నూర్చాలని నూరెడ్ల నడుగు
'పాలుతాగి మామెడ్లు పత్తి నూర్చవెళ్లె'
'పదిపుట్ల ధాన్యమ్ము నూర్చేముగాని
పత్తిచే నెన్నడూ నూర్చి యేమెరుగ'
'నూరుపుట్ల ధాన్యమ్ము నూర్చాముగాని
నువ్వుచే నెన్నడూ నూర్చి యేమెరుగ'
'అత్తకూతురు వని అడిగితినిగాని
అతిజాణవే యీమాట నిన్ను నే నెరుగ'
'మామకొడుకు వని మన్నించితినిగాని
మాటకారుడ వౌట నిన్ను నే నెరుగ'"

భిక్షుకలు పాడే పాటల్లో చిన్న చిన్న రసవంతమైన పన్నివేశాలూ, మధురమైన గృహస్థ జీవనం మొదలైనవి ప్రతిబింబిస్తాయి. ఒక భిక్షుకి సీతా వనవాసంలోని ఈ రమణీయఘట్టం పాడుతూండగా విన్నాను. సీత లవుని ఊయెలలో ఊచుతూ లాలి స్తుంది:

"ఇటునుంచి ఊచితే ఇంద్రుని ఛాయ
అటునుంచి ఊచితే చంద్రుని ఛాయ
కొండవంతలలోన కోనేటినడుమ
పాపన్న మిము గంటి బంగారుగులను
ఏడిస్తె నిన్నెవ్వ రెత్తుకుంటారు?
పుత్తడందెలు బూని పులిగోళ్లు బూని
భూదేవి మీయవ్వ వచ్చె నేడవకు—"

ఈ భిక్షుకులలో విరాగులు కొందరు గంజాయి సహాయంతో వింతే వేదాంతపు కీర్తనలు పాడి మనకు కుతూహలమును కలిగిస్తారు:

" మొనలు మీదుగ తలలు క్రిందుగ
మొలచియున్నది వృక్షము
మోద మలరగ మింటిమీదను
మదగజము విహరించెరా -
పంచవన్నెల చిలుక లైదొక
పర్వతము భక్షించెరా
మంచి తత్త్వ జ్ఞాన మిది మ
ళ్లూరి రామదయానిధీ ! "

ఇట్లాంటి తత్త్వాలు వేలకొలదీ మన దేశంలో ప్రచారంలో వున్నవి.

ఇంకా ఈ గేయసారస్వతంలో మన దేశపు ప్రాచీన సంప్రదాయాలు, కండగల తెనుగుభాష, నానుడి, మర్యాదలు, ఆచార వ్యవహారాలు మొదలైనవి ఎన్నో ఎన్నదగి ఉన్నవి. ఇందులో ఉత్ప్రేక్ష, ఉపమ, నిదర్శనం, అతిశయోక్తి మొదలైన అలంకారాలు సహృదయులను విశేషంగా ఆకర్షించుతవి.

" సీతమ్మ చిత్రకథ చెప్పేటివేళ
అడవిలో పచ్చాకు లగ్నులై మండు "

వంటి వాక్యములలోని అలంకారములు, గంభీర వాక్కు ప్రత్యేకంగా ప్రశంసించదగినవి.

రెండవ భాగంగా ఎన్నదగిన పుస్తకరూప గేయసాహిత్యం అజ్ఞానుల చేతులలో పడి పనవ లేవు లలో, రైళ్లవద్ద చవుకబారు సారస్వతంగా అమ్ము డవుతోంది.

చదువురాని స్త్రీ, పామరాదుల సన్నిధిలోనే ఇది ఆగిపోవడంవల్ల దీనిలోని భావసంపద, కవితా సౌందర్యం ప్రాజ్ఞులకు దూరమయిపోయింది. బొబ్బిలి కథ ఒక రసవత్కావ్యం. దీనిని కొందరు ముద్రించి విస్తృతంగా చేశారు. ఒకసారి గురజాడ అప్పారావు పంతులుగారు బొబ్బిలికథ విని పైమీది పట్టుఖండువా పాటకుడిపైకి విసరి, పాగా చుట్టుకు పాడమన్నారట.

స్త్రీలకు సంబంధించిన గేయవాఙ్మయంలో లంకాయాగం, కుశలవకథ, ఊర్మిళా దేవినిద్ర, లక్ష్మణ దేవర నవ్వు మొదలైనవి ఉత్తమ కావ్యాలని నా అభిప్రాయం.

ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారుడు శ్రీ కవిత్వ వేది పూర్వోక్త స్త్రీ గేయపుస్తకములను మిక్కిలి రస వంతములని ప్రశంసించాడు.

వీటిలోని కవిత్వపుసొరు శ్రద్ధగా పరిశీలించిన ప్రతి సహృదయునకూ తెలుస్తుంది. వీటిని పామరుల పంరక్షణలోనుంచి తప్పించి పండితులు చేపట్టి పరిష్కరించి అచ్చువేయిస్తే ప్రాచీనాంధ్రగేయసాహిత్య ప్రాభవం పొరుగుదేశాలకు గోచరిస్తుంది.

ఈ మధ్య ఎందరో ప్రాచీనగేయ ప్రశస్తిని గుర్తించి, పత్రికల్లో చాలా వ్యాసాలు వ్రాసి, ప్రచారం చెయ్యడం ముదావహమే. కాని —

ఈ పని ఇంతటితోనే ఆగిపోతోంది. ఇంక మనం వీటిపట్ల చూపే వాత్సాల్యం ఆపె పారవంత మైన క్రియకు ప్రయత్నించ వలసి వున్నది. ఈ నాటికే దీని నాదరించి ప్రకటించవలసిన నవ్యసాహిత్యపరిషత్తు దీనిమీద ' శీత – కన్ను ' వేసి వేరేపనులు చూసుకుం టూన్నది. మడిగట్టుకొన్న ఆంధ్రసాహిత్యపరిషత్తు దీనిని పొంతకేరానివ్వదు.

ఇప్పటికైనా ఈ సహజ దేశీయ కవితా సంపదను మారుమూలబడి ఖిలమై పోనివ్వకుండా రసజ్ఞులును, సాహిత్య పోషకులును ఐన సాహిత్య సమ్రాట్టులు, ఆంధ్రతాభిమాననిరతులైన మన విశ్వ విద్యాలయాధి కారులు, అగ్గలమైన ఆంధ్రాభిమానంతో క్రొత్తగా ఏర్పడ్డ అఖిలాంధ్ర విజ్ఞానపరిషత్తులును సహృదయులైన పండితులచే సంస్కరింపించి ప్రకటించవలసిన బాధ్యత వుంది.

అప్పుడే సర్వతోముఖమైన ఆంధ్రీయశోభకు ఆంధ్ర ప్రముఖులు తోడ్పడ్డవారవుతారు.

" దూరీకృతాః ఖలు గుణైః
ఉద్యానలతా వనలతాభిః "

— కాళిదాసు



# కాగితపు పూలు

[ కథానిక ]

శ్రీమతి ఇ. సరస్వతి

తోటలో ఒక ఏడాదిబిడ్డను ఎత్తుకొని, అటూ ఇటూ తిప్పుతూ, నడుమనడుమ గేటు దగ్గరకు వచ్చి చూస్తున్నది అచ్చమ్మ. కడుపునిండా అన్నము తిన్నా, కంటినిండా నిద్ర పోయినా, కడుపులో బాధ పోవటము లేదు. ఏమిటో అర్థము కాని బాధ, ఆవేదనా మనసులో.

తనను ఎంతో ప్రేమించిన యువకునికూడా, ఆ పిల్లకోసం, వదులుకుంది! తన నెంత ప్రేమించినా—సౌఖ్యమేకాని, సుఖముయొక్క ఫలితము వద్దని తోసిపారేస్తే ఏ మాతృహృదయము భరించగలదు?

బిడ్డ పుట్టకముందే తా నెన్నో సుఖస్వప్నాలను కన్నది. అట్లాంటిది, కనంగానే, బిడ్డను—తన బంగారు తండ్రిని — మాయంచేశారు డబ్బుకక్కుర్తికి నర్సులు! ఎంతకైనా తెగిస్తారు!

నవమాసాలు మోసి కన్న పసిబిడ్డకోసం పరితపించే హృదయాన్ని ఒక చేత్తో పట్టుకుని, పరాయి బిడ్డల సంరక్షణతో కొంతవరకు తృప్తిని కలిగించుకుంటున్నది అచ్చమ్మ.

అయినా కడుపులోంచి వచ్చే ఆ బాధ, అర్థము కాని ఆ వేదన! పట్టలేదు హృదయాన్ని!

"అమ్మా, ఏమైనా తెలిసిందా బిడ్డవిషయమై? కొంతవరకైనా భోగట్టా చేయగలిగారా? మీ కడుపున పదిమంది కొడుకులు పుట్టాలమ్మా! మీ ఋణము ఏ విధముగా తీరుస్తానో" అని ఆత్రముతో పలకరించింది, అప్పుడే కారుదిగిన శాంతను.

"తెలిసింది. అతి కష్టముమీద నీ బిడ్డ ఆచూకీ తెలిసింది. ఎక్కడుండేదీకూడా చెప్పారు నర్సులు." అని కొంచెము సందేహంతో, పెదవి విరుస్తూ చెప్పింది శాంత.

"చెప్పండి. నాబిడ్డ ఎక్కడున్నాడో. నా తండ్రికోసం నాహృదయము కొట్టుకుంటోంది. చెప్పరూ? ఈ ఊళ్లోనే ఉన్నాడా? నాదేహంలోని ప్రతినరమూ వానికోసం పరితపించి పోతున్నది."

"................................"

"చెప్పండి, ఆలస్యమెందుకు? నాకొడుకు—నాప్రేమనిధి – నానోములపంట – నన్ను సుఖసాగరంలో ముంచి తేలుస్తాడని స్వప్నాలను కంటున్నాను; మనోవీథిలో మేడలు కట్టున్నాను. నాబంగారునాయన ఎక్కడున్నాడో చెప్పి పుణ్యము కట్టుకోండి."

"అచ్చమ్మా! నీ కొడుకు...నీవు ఎత్తుకున్న వాడే! నాకొడుకని భయంతో, జాగ్రత్తగా, మాతృదేవత కంటె అధికంగా సంరక్షణచేస్తున్నావే, వాడే నీ కొడుకు! ముద్దుల జగదీశు నీ కొడుకే!" దడదడ కొట్టుకుంటున్న హృదయాన్ని ఒక చేత్తో అదుముకుంటూ, ఆయాసంతో, చెప్పలేక చెప్పలేక చెప్పింది.

"ఓసీ రాక్షసీ, నానోట మట్టి కొట్టి, నా కళ్లు మూసి, నర్సులకు లంచమిచ్చి నాబంగారు నాయనను దొంగిలించావా? ఏడాదినుంచి నా కడుపున చిచ్చుపెట్టిన మహాయిల్లాలవు నీవేనా? నీది మానవజన్మేనా?"

అచ్చమ్మ ఆవేశంతో నేలమీద విరుచుకుని పడిపోయింది. శాంత గజగజ వణికిపోయింది. భయంతో నాడులూ, నరాలూ క్రుంగిపోయినాయి. ఈ గడబిడలో ఆఫీసుకు వెళ్లిన రామమోహను రాడు కదా! అతడు వింటే కొంప మునిగిపోతుంది! తన జీవితంలో జరిగిన భయంకరమైన ఘట్టము ఒక్కసారిగా స్మృతికి తెచ్చుకుంది.

కొత్తగా పెండ్లిచేసుకొన్న శాంతారామమోహనులు మూడునిద్రల సౌఖ్యము అనుభవిస్తున్నారు. బొంబాయికి తీసుకొనివెళ్లి వింతలూ, విశేషాలూ చూపిస్తున్నాడు శాంతకు పెండ్లికొడుకు.

ఒకరోజు రాత్రి వెన్నెల్లో కూర్చుని —

"శాంతా, మన ఇద్దరి ప్రేమ శాశ్వతంగా ఉండేటందుకు ఒక కొడుకు పుట్టితే నా ధనమూ, నా కోరికలూ, నా ప్రేమా చరితార్థ మవుతాయి. నా నోములన్నీ ఫలిస్తాయి నాయిష్టదేవతలు నాకు ఒక కొడుకును ప్రసాదించితే నాపితృదేవత లంతా ధన్యులవుతారు."

ఆ సందర్భంలో, పితృదేవతల తృప్తికోసం పిల్లల్ని కోరే రామమోహనుమాటలు విని అరుచి అనిపించి, "ఇప్పటినుంచి పిల్లలయితే మన స్వేచ్ఛకు భంగం కాదూ?" అనిమాత్రము అనగలిగింది శాంత.

సమయానికి ఆమాట అన్నా రామమోహను మనస్సు గ్రహించినట్లే కనబడుతుంది శాంత. "తన కొక కొడుకు పుట్టితే అమితంగా ప్రేమిస్తా డేమో తన పెనిమిటి! ఎప్పుడూ వాడితో ఆడుకుంటూ ఇటూఅటూ తిరుగుతూఉంటాడు. తన పెనిమిటిఛాయ — భర్త యొక్క ప్రేమ శాశ్వతంగా నిలిచే చిహ్నము — ఇద్దరి ప్రణయంపు రాశి — నిజంగా పుట్టితే ఎంత ప్రేమిస్తాడో భర్త తనను?" అతనికి తెలియకుండా ఒక నిట్టూర్పు విడిచింది శాంత.

* * *

ఆరోజు సాయంకాలము రామమోహను ఆఫీసునుంచి తొందరగా ఇంటి కొచ్చాడు. భార్యాభర్తలు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, టీ త్రాగుతున్నారు.

సగం పూరీ నోట్లో పెట్టుకుని తింటూ, "యివాళ ఒక సంతోషకరమైన వార్త తెలిసింది, శాంతా! నీకు ఆసంగతి చెప్పాలని ఎంతజోరుగా కారు నడిపా ననుకున్నావు! కరాచిలో మాకంపెనీ బ్రాంచి ఒకటి ఉన్నది. అక్కడ దాన్ని వాళ్లు సరియైన పద్ధతులలో నడపకపోవటమువల్ల నష్టమువచ్చింది. అందునుంచి నన్ను అక్కడ కొంతకాలము పనిచేయమన్నారు. అంటే, ఏడాదికి తక్కువకాకుండా. నీవు కరాచి చూడలేదుకదూ? నాస్నేహితులు చాలామంది నిన్ను తీసుకునిరమ్మని వ్రాస్తున్నారు ఇదివరకే. రెండూ కలిశాయి. ఒకవారంలోపల మనము వెళ్లాలి." భుజాలు ఎగురవేస్తూ చెప్పాడు.

"నిజమా? ఈ సమయములో మీతోకూడా వస్తే, మీరు ఆఫీసుపని ఏంచేయగలుగుతారు? నాకు సేవ చేయటమే సరిపోతుంది. ఇంకా కొన్నాళ్లపాటు ఒంటరిగా మీరు —"

"ఏం? నాతో కరాచికి రావటాని కేం అభ్యంతరం? ఈ అవకాశము నేను ఎన్నో దినాలనుంచి ఎదురుచూస్తున్నా. ఎందుకు రావు?"

కెంపెక్కిన చెంపలతో, సిగ్గుతో ఒకసారి కళ్లెత్తి మళ్లీ వాల్చింది శాంత. పెదవి కొరుక్కుంటూ మాట పెగలనివ్వక చిరునవ్వు నవ్వింది.

"నాతో చెప్పలే దేమి యిన్నాళ్లు" అంటూ ప్రణయసముద్రములో ముంచిరెత్తాడు.

మాటమాత్రానికే అతనికి కలిగిన సంభ్రమమూ, తృప్తీ శాంతను ఉక్కిరిబిక్కిరిచేశాయి.

* * *

రామమోహనుకు ప్రతిరోజూ గంటలకొద్దీ కూర్చుని జాబులు వ్రాసేది శాంత. ఒక ఉత్తరం వ్రాయాలంటే ఎన్నో కాగితాలు వ్రాసి చింపేది. ఎన్ని వ్రాసినా తృప్తిలేక ఒకొక్కసారి ఫోనులో మాట్లాడేది.

అతడు కరాచికి వెళ్లిన ఆరునెలలకు మగబిడ్డ పుట్టాడనీ, మాతాశిశువులు క్షేమంగా ఉన్నారనీ జాబు వెళ్లింది.

ఇంక నిలవలేకపోయాడు. స్నేహితు లందరికీ పార్టీయిచ్చాడు.

"ఎప్పుడొచ్చి ఆకొడుకుని చూస్తునా" అనే ఉత్సాహం, ఉద్రేకం కెరటంవేస్తూ ఉండేది మనస్సులో! పాపం! ఆఉద్యోగానికి సెలవన్నా దొరకదు.

ఏం చేస్తున్నాడు, ఎట్లా ఉన్నాడు అన్న జాబులకు విధీ, విరామమూ లేదు.

* * *

ఎన్నో దినాలనుంచి ఎదురుచూసిన రోజు వచ్చింది. తన ప్రణయనిధిని చూపిద్దామని తాపత్రయపడుతున్న సమయము వచ్చింది శాంతకు. ఆసాయంకాలము రామమోహను వస్తాడు. ఆరోజల్లా తీరికే లేదు ఆమెకు. పిల్లవాడిమీద ముద్దులవర్షము కురిపిస్తూ పాటలు పాడుకుంటూ గృహాన్ని కొత్తపద్ధతిలో అలంకరించింది. ఆనందోత్సాహాలను పట్టలేకుండా ఉంది.

కొడుకుతో సహా స్టేషనుకు వెళ్లి భర్తకు స్వాగతమిచ్చింది.

ఆనందబాష్పాలు తుడుచుకుంటూ కొడుకును ఎత్తుకుని ముద్దులాడాడు.

వాళ్లిద్దర్నీ విడిచి ఒక్క క్షణమైనా ఉండలేడు.

* * *

భర్త కొడుకును ముద్దుపెట్టుకొనేటప్పుడు శాంత మనస్సంతా కలవరపడేది. వస్తున్న కళ్లనీళ్లను అతికష్టముతో ఆపుకుని ముఖము అవతలకు తిప్పుకొనేది.

ఒకసారి రామమోహనుకంట పడ్డ దాదృశ్యము.

"కళ్లనీళ్లెందుకు శాంతా? ఎంత ఆనందం అనుభవిస్తున్నావు? నీ కేదయినా లోపమయితే నాకు చెప్పు" అని బుజ్జగించి అడిగాడు.

"ఈసంతోషము — సుఖము — శాశ్వత మనుకున్నారా? భగవంతుడు అంతరాయము కల్పిస్తాడేమో! అంతవరకూ ధన్యులమే" అంటూ కళ్లు ఒత్తుకున్నది.

పైకి ఆమాట అన్నా, అంతరాత్మ అహోరాత్రులూ పీడిస్తూనే ఉండేది. తాను చేసిన ద్రోహము! తన పెనిమిటికి తాను కృత్రిమసౌఖ్యము ఒకద్రోహము వల్ల కల్పించింది! నిజంగా తనకే ఆకొడుకు పుట్టినట్లయితే తన కెంత సంతోషంగా ఉండేదో?

కాని, పాపం, ఆతల్లి, ఆసుపత్రిలో పిల్లవాడిని కనపడకుండా చేస్తే, ఎంత తహతహలాడిపోయిందో! ఎంత తపించిందో?

కృత్రిమమైన తన మాతృహృదయానికే ఒక క్షణము పిల్లవాడు కనబడకపోతే తోచదే! ఆతల్లి కో?

ఈవిధంగా పరుగులెత్తుతూ పరితపించే హృదయాన్ని పోగుచేసుకుంటూ తనజీవితంలోని గంభీరమైన రహస్యాన్ని భర్తకు తెలియకుండా కాలము గడుపుతున్నది శాంత.

* * *

జగదీశు సంరక్షణకోసం నియమింపబడ్డ అచ్చమ్మ, తనకు ఏడాదిక్రింద ఆసుపత్రిలో పుట్టిన బిడ్డను నర్సులు మాయంచేసిన విషయమై భోగట్టాచేసే వంకమీద పనికి కుదిరింది.

సంగతిసందర్భమంతా తెలిసినతరువాత పైప్రాణాలు పైన ఎగిరిపోయినాయి శాంతకు.

"ఏం చేస్తుందో అచ్చమ్మ. ఆవేదన అనుభవించే మాతృహృదయము ఎంతకైనా తెగిస్తుంది. అల్లరిచేసి పోలీసులదాకా పడితే కొంప అంటుకుపోతాయి. అన్నిటికంటె ముందు రామమోహనుకు తెలిస్తే ఇంకేమయినా ఉందా?

రామమోహనుకు నిజం తెలిసిందంటే — ఎవరిని తాను తన రక్తపుముద్ద అని ప్రేమిస్తున్నాడో, ఆవంశవర్ధనుడు తన బిడ్డకాడని తెలిసిందంటే భరించగలడా?

తన కష్టసుఖములు పంచుకుంటూ— తనకు వంశవర్ధనుణ్ణి ప్రసాదించింది శాంత అని మురుస్తున్న రామమోహనుకు, శాంత—వట్టిబూటకంతో—హృదయాన్ని కలచివేసే నాటకానికి సూత్రధారిణి అయిందని తెలిసిందంటే, ఆమెకు మనిషికి విధించే శిక్ష విధిస్తాడా? కలలో మాట!

పోనీ — తనకు సహజమైన, ప్రకృతిసిద్ధమైన స్త్రీవిధిని పాలించటానికి ఏమైనా అవకాశము ఉందా అంటే, తాను తలక్రిందుగా తపసుచేసినా బిడ్డతల్లి కాలేదని ఎంతమంది డాక్టర్లు చెప్పలేదు?"

అచ్చమ్మకు డబ్బుఆశ పెట్టింది. ఎప్పటికీ తన యింట్లో తన మాదిరిగానే ఉండమంది. ఏది కావాలంటే అది యిస్తానంది ఆబిడ్డనుతప్ప.

ఆబిడ్డ వచ్చినతరువాత తన కెంతో ప్రేమిస్తున్నాడు తన పెనిమిటి. అన్ని ఆశలు— అన్ని కోరికలు అడుగంటిపోవలసినదేనా ఆదంపతులకు?

శాంత అచ్చమ్మను పిచ్చిఆసుపత్రిలో చేర్పించింది. అచ్చమ్మ మళ్లీ మామూలుస్థితికి రాజాలదని డాక్టర్లంతా చెప్పారు.

"జగదీశు నాకొడుకు. నీవు దొంగవు-రాక్షసివి" అని కనబడ్డవాళ్లందర్నీ తిట్టూనేఉంటుంది అచ్చమ్మ.

రోజూ సాయంకాలము అచ్చమ్మను చూసి వచ్చినతరువాత కడివెడు నీళ్లకు ఏడుస్తుంది శాంత. "తాను తన పెనిమిటి అమూల్యమైన ప్రేమను కాంక్షించినంతవరకూ అచ్చమ్మ ఆవిధంగా ఉండవలసిందేకదూ"



బొంబాయి ఆంధ్ర మహిళాసభ, మూడవ వార్షికోత్సవము.

# పెంపకము

శ్రీ పిల్లలమర్రి వెంకటహనుమంతరావు

ఎప్పుడో చిన్నప్పు డల్లరిచేశానని ఎప్పుడూ అల్లాగే ఉంటానని ఎట్లా అనుకుంటారు? అయినా పిల్లలంతా చిన్నతనంలో అల్లరి చేస్తారు. అల్లరి చేస్తేనే ముద్దూ,మురిపెమూ! లేకపోతే, బెల్లంకొట్టిన రాయిలాగా కూచుంటే ఎవ్వరూ దగ్గిరికి తీయరు సామాన్యంగా. చిన్నప్పుడు ఏపనిచేసినా చక్కగానే ఉంటుంది. తప్పైనా మన పెద్దవాళ్లు నవ్వి ఊరుకుంటారు. అంతే! దాంతో చనవు ఎక్కువయిపోతుంది గారాబం పెరిగిపోతుంది. చివరికి పెద్దయినా వదలదు. అప్పుడు జబ్బలింటాం. మగపిల్లలైతే పెద్దయినా అల్లరిగా ఉంటే ఫరవాలేదు. కాని ఆడపిల్లల కొస్తుంది ఎక్కడ లేని గొడవానూ. ఏం? మేము మటుకూ ఏంలోపం చేశాము ప్రపంచానికి? ఊహ తెలియకముందట్నుంచే ఎవరికో భయపడాలి. స్వేచ్ఛ అంటే పోతుంది. పది ఏళ్లు కూడా రాకమునుపే, నవ్వితే తప్పు, వాకిట్లోకి వెళ్తే తప్పు, గట్టిగా మాట్లాడితే తప్పు. ప్రతిదీ తప్పే. అదే ఆ యీడు మగపిల్లవాడైతే చెల్లుతుంది! ఏమి టీఅన్యాయం? నిజంగా లోకమంటే ఏమిటో సరిగా తెలియని స్థితిలో నిర్బంధా లేమిటి? అర్థంలేని నిర్బంధాలు!

మొత్తానికి నాకు పేరు వచ్చేసింది. ఎట్లా పోతుంది? చిన్నప్పు డల్లరిచేసేదాన్నిట—మా అమ్మ చెబుతూ ఉంటుంది. ఉండొచ్చు. కాని ఆవిడ కొట్టూ వచ్చేది. అదిమటుకు నాకు బాగా జ్ఞాపకం. నేను మళ్లీ ఎదురు తిరిగేదాన్ని. మా నాన్నగారు నిజంగా నాపక్షం వుంటూ ఉండేవారు కాబట్టి నాకు ధైర్యం. ఇంట్లో మా నాన్నా నేనూ ఒకటి; మా అమ్మ ఒక్కత్తే ఒకటి! మా అమ్మకూ నాకూ క్షణం పడేదికాదు. ఆవిడ చెప్పినమాట వినకపోవడం పరిపాటయిపోయింది నాకు. నేను-పోయిపోయి వాళ్లకు పుట్టడంమూలాన నామీద మావాళ్ల కంతో ప్రేమ. మా అమ్మ "అబ్బో! గారాబపుబిడ్డ!" అని దెప్పుతూ ఉండేది మా నాన్నను!

మొత్తానికి నాకు మా నాన్నమాటంటే సరి అయిపోయింది. మా అమ్మతో వైరంకూడా అలవాట యింది. ఇట్లా ఉండటంలో మా నాన్నతోనే అన్నం తినడం, ఆయన ఇచ్చిన బట్టలేసుకోవడం, ఆయన తోటే సభలకు వెళ్లడం, ఆయన చదువుకుంటూన్న సమయంలో చదువుకుంటూ ఉండడం-ఎదురుగా కూచోని, మొదలైనవన్నీ మా అమ్మకు మంటగా ఉండేవి. ఆవిడగొడవే వేరు!

"మరీ మొగపిల్లవాడివై పోతున్నావు! బొత్తిగా ఇవతలచెంబు తీసి అవతల పెట్టకుండా వచ్చావు. చదువుల సరస్వతి అయిపోతున్నావు. చూడు, సీతమ్మగారి అమ్మాయి ఇంచక్కా తినంత తాను జడవేసుకొంటుంది. నూనె రాసుకోని స్నానం చేస్తుంది, చక్కగా పొన్నెమ్మమాదిరి ఎంతో ముచ్చటగా ఉంటుంది. వాళ్లమ్మకు తోడుగా ఉంటుంది పనిపాటల్లో. పిల్లల్ని సముదాయిస్తుంది. ఎంతో సహాయకారిగా ఉంటుం దాపిల్ల! నువ్వున్నావంటే దేనికి? నీ అంటు నువ్వు నీపనులు చేసుకుంటే చాలు! నాకు పదివేలు! తిన్నకంచమే కడుక్కోకుండా పరుగెత్తిపోతావు మీ నాన్నగారితో. బాగా అలవాటు చేశారు. నిన్నని ఏమిప్రయోజనం? చెపొచ్చేవారికి ఏంజవాబు చెబుతారో, నాకైతే జవాబుచెప్పగలిగారుకాని! మరీ అంతగారాబమా? చిన్నపిల్లకు ఇప్పట్నుంచే నేర్పుతున్నారు నామీద ఎక్కు మిరియాలు నూరడానికి!" అని ఒకటే సణుగుడు మా అమ్మ! నేను పెడచెవిని పెడుతూ ఉండేదాన్ని.

మా అమ్మవల్లే నేను అల్లరిపిల్లననే వదంతి పుట్టిం దని నాగట్టి అనుమానం. ఎందుకంటే, ఆవిడ ఎప్పుడూ అందరికీ వెల్లడిచేయందీ (ఏవిషయమైనా) ఆవిడకు నిద్రపట్టదు. పనిలేకపోయినా పని కల్పించుకొనైనా తనమనస్సులోది ఇతరులకు కక్కరావడం ఆవిడమతం. ఏముంది? ఆ అమ్మ యీ అమ్మకు చెప్పనూ, ఈ

అమ్మ ఆ అమ్మకు చెప్పటం! మరో అమ్మ ముక్కు మీద వేలేసుకొని 'అష్టాసమ్మా!' అని ఆశ్చర్య పోవడం. ఇల్లా పాకిపోతుంది విషయం. ఇంతా చేస్తే ఏమీలేదు మళ్లీ — మొత్తానికి నా పేరు బైటికిరావడం తప్ప.

మావాళ్లు నన్ను గారాబంగా పెంచారు కాబట్టి నాక్కావాల్సినవన్నీ మానాన్న సమకూర్చేవాడు. కాస్త కలవాళ్లబిడ్డ నవడంచేత నాకు రకరకాల పరికిణీలూ, వోణీలూ ఉండేవి. వాటిదగ్గర వచ్చేది మా అమ్మకూ, నాకూ ఘర్షణ. ఆవిడ ఇచ్చినవి నాకు ఇష్టమయ్యేవికావు. మానాన్నగారు నాకిష్టమైనవి తీసుకోమనేవారు. మా అమ్మ అనేది-"ఇక్కడైతే ఇష్టమొచ్చినట్లు జరుగుతుంది. రేపు అక్కడెట్లాగో?" అని. మాఅమ్మ పెద్దది కాబట్టి సర్దుకుపోవచ్చు. ఉహుఁ. అందుకనే గోల అయిపోయింది. నిజంగా చూస్తే నాదేమీ తప్పు లేదు. పెంచటం చాతకాకపోవడం ఆవిడదే తప్పు. అది మానాన్నమీద కోపంచేత నామీద చూపించడం చేత ఇల్లా జరిగిందని నా అభిప్రాయం. గుట్టనేది మా అమ్మకు చాతగాదు.

మా నాన్నగారు నన్ను కోప్పడి ఎరగరు. అందుకనే నే నాయనమాటంటే శిలాశాసనంలాగ భావిస్తాను. నాకు చదువుకోవాలని అభిలాష బాగా ఉండేది. మానాన్నగారుకూడా మొగపిల్లలు లేక పోవడంచేతనే కాబోలు నన్ను విద్యావతిగా చేయాలని సంకల్పించుకున్నారు. అందుకని పన్నెండేళ్లొచ్చేదాకా బళ్లోకి వెళ్లుతూ వచ్చాను. మా అమ్మకు నేను బళ్లోకి వెళ్లడం ఇష్టమైంది కాదు. "ఇంట్లో సంగీతం చెప్పిస్తున్నామాయె, చాలదా? ఆడపిల్ల అని ఉందంటే అష్టారంకేకుండా చేస్తారా? చేతికింద కాస్త తోడుగా ఉండొద్దా? చదువు లెందుకు? ఊళ్లేలాలా, ఉద్యోగాలు చెయ్యాలా? నే నేం చదువుకున్నానేమిటి? నాకు పెళ్లికాలేదూ? మీరు చేసుకోడం మానేశారా? రేపొచ్చే సంబంధాలు వెనక్కుపోతయ్యా? కాస్త పనీ, పాటా నేర్చుకోని ఉంటే నయంకాని, బళ్లోకి పంపిస్తే ఏమిటి లాభం? వెళ్లొచ్చిందిగా! చదువుకున్నంతమటుకూ చాలు! రోజూ పోట్లాటలు తీసుకురావడం దీనిపనీ, తీర్చడం మనపనీ అవుతున్నది. అంతకన్నా ఇది నేర్చుకున్నది నాకేం కనపడలా!" అని మా అమ్మవాదన.

మా అమ్మ ఎప్పుడూ పని చెప్పేది కాదు నాకు. అందువల్ల నేనేమీ వాటిజోలికి పోయి ఎరగను. అయినా, ఏమీ చెప్పకపోతే చాలనుకునేదాన్ని. లోపలనుంచి పిలిచినా వినపడనట్టు నటిస్తూ వచ్చాను. ఒక్కొక్కప్పుడు ఏమైనా పనిచేయమంటే దాన్ని నాశనం చేయడంమూలాన్ని నా కసలు పనే చెప్పేది కాదు. ఒకమాటు కాఫీ పొయ్యిమీదనుంచి దింపమంది తాను జడవేసుకుంటూ. నేను దింపబోతూ కాళ్లమీద పోసుకున్నా! సీసా గూట్లో పెట్టిరమ్మంటే తొందరలో కింద పడేశాను!— ఇటువంటివి చూసే మాఅమ్మ నాకు పనిచెప్పడం మానేసింది! నాకూ నయమే అనుకున్నాను!

నన్నెప్పుడూ పేరంటాలకు తీసికెళ్లేది కాదు మా అమ్మ. తానైతే ఎప్పుడూ ఎవరో ఒకరింటికి వెళ్లుతుంది. నే నొస్తానంటే వద్దనేది. అల్లరి చేస్తానని ఆవిడకు భయం. నే నల్లరిచేస్తే ఆవిడకు నామర్దా వస్తుందనికాబోలు! తను నన్నుగురించి చెప్పుకుంటే రాదుకామోసు! నిజంగా ఆవిడ నన్ను తనతో తీసికెళ్తూఉంటే ప్రపంచంసంగతి తెలుస్తుంది. తోటిపిల్ల లెట్లా ఉంటున్నారో గ్రహించడానికీ, పాగతాయింపు తనాన్ని నేర్చుకోవడానికీ అవకాశా లుండేవి. ఏ వూరికివెళ్లినా మా నాన్నగారిదగ్గరే ఉంచి వెళ్లుతూ ఉండేది. నేను మాబంధువులెవరినీ ఎరగను. ఇది ఎక్కడైనా కద్దా? కన్నపిల్లను ఇంట్లో అట్టే పెట్టిపోవడం! తల్లి వెళుతూంటే పిల్లను తీసికెళ్లదూ? అదేమిటంటే, "అల్లరిపిల్ల—నే చెప్పిన మాట వినదు. నలుగురిలో నగుబాట్లు!" అని ఊరుకుంటుంది! ...... ఇంతకూ నా ఖర్మ అల్లా ఉంది. ఒకర్నంటే ఏంలాభం ?

* * *

పెళ్లి సంబంధాలొచ్చాయి. అందరూ చదువూ సంగీతం చూసేవాళ్లేగాని పనీ పాటా అడగలేదు. మా నాన్నే గెలిచాడు...... మొత్తానికి నా పెళ్లి కావడం మటుకు సంగీతం చూసే అయింది. అందాకా

ఎందుకు? నా అదృష్టమే అనుకోవాలి! మా అమ్మ భయానికి తావు లేకుండాపోయింది. అదీ నాక్కావాల్సింది.

* * *

అవి మొదటిదినాలు కాబట్టి అట్టే నా కేమీ పని తగిలేదికాదు అత్తవారింట్లో. అదీగాక నన్ను ఆ ఇల్లాలు తన ఆడపిల్లలాగా చూచుకునేది. తనకూ ఒక్క మొగపిల్లవాడే మిగలటాన నన్నంత రొష్టు పెట్టి ఎరగదు, పాపం! చక్కగా ఇద్దర్నీ రెండుకళ్లమాదిరి చూసుకుంటూ వచ్చింది. నా కామె అంటే ఎంతో ఆపేక్ష కలిగింది. మా నాన్నగారి తర్వాత అంత చనువుగా, ఆపేక్షతో దగ్గరికి తీసినవారులేరు. మా అమ్మ పేరు తలుచుకుంటే భయమేసేది. ఎందుకు? ఆవిడ ఎప్పుడూ నాతో సంతోషంగా ఉండలేదు కాబట్టి.

పెళ్లికాకముందు ఆగొడవా — అయింతర్వాత అల్లుడుమీద కోపం నామీద చూపించడం! నాతో ఎన్నంటే ఏంలాభం? నేనైతే ఎవ్వరికీ ఏమి మాటలూ చెప్పేదాన్నికాదు. మళ్ళ నాకెందుకు ఆగొడవ? కాని, మా అమ్మమటుకు ఒక్కమాటు నాతో ఎన్నడూ లేని ఆప్యాయంతో మాట్లాడింది. అది మా అత్తవారింటికి వచ్చేటప్పుడు. నిజంగా ఆక్షణం నాకు ఆశ్చర్యం, కన్నీరూ ఒక్కమాటుగా వచ్చాయి. కన్నకడుపంటే అల్లా ఉంటుందని కామోసు. నాకూ — ఆవిడ చిన్నప్పటినుంచీ ఎన్నన్నా — ఓరిమైన జాలికలిగింది ఆవిడమీద. నేను మా అత్తవారింటికి వచ్చేస్తే ఆవిడకు సందడేదీ? నిజమే! ఆవిడ అన్న ముక్కలన్నీ సత్యమే... కాని నన్ను ఎందుకు అట్లా రాపాడేది?

చూసినవాళ్లంతా నన్ను "వాళ్ల నాన్న పోలికమ్మా! పట్టి బోళామనిషి. గర్వంలేదు. నిజంగా నీ వదృష్టవంతురాలవమ్మా!" అనేవాళ్లు మా అత్తగారితో......మా అత్తగారు నాకు మొదట్లోనే చెప్పేది ఏమేమిటో...అంటే, ఎవరితో ఎల్లా మాట్లాడాలో అన్నీను. ఆ తర్వాత నేనూ, ఆవిడా కలిసి ఎక్కడికైనా — ఎవరింటికి పేరంటానికైనా — వెళ్లేవాళ్లం. నిజంగా చెప్పితే మటుకు నేను బుద్ధిమంతురాలను కానూ!

ఆలోపం మా అమ్మది కాని. మెల్లిగా పనులన్నీ చేయడం చాతయినై. పుట్టుతూనే రమ్మంటే వస్తాయా? వాటిని చేయించే పద్ధతికూడా తెలియాలి తల్లికి. ఊరికే కొట్టడమే అయితే పనులు ఎట్లా నేర్చుకునేది? మా అత్తగారికి ఆవిధానాలన్నీ బాగా తెలుసు కాబట్టే నాలోపా లేమీ బయటివాళ్లకు తెలియనీకుండా, గుంభనగా, నాకు పనీ పాటా నేర్పించింది క్రమేపి. ఆవిడ మంచిది కాబట్టి అంత శ్రద్ధ తీసుకుంది. ఇంకోరైతే "పనులు నేర్పి పంపండి" అని పుట్టింటికి పంపించి నావాగోలా చేసేవారు. ఇంతకూ మా అత్తగారు మంచిది......పద్ధతులన్నీ తెలుసు... అక్కడికి వెళ్లింతర్వాతనే నే నింతబుద్ధిమంతురాలయింది!

* * *

మా అమ్మకు ఆశ్చర్యం కలిగింది, ఆవిడ మా యింటికి వచ్చేటప్పటికి నేను పనిచేస్తూండడం చూసి. "ఈపనంతా ఎక్కడ నేర్చుకున్నావే తల్లీ! నే నొక్కటైనా నేర్పలేదు. ఇదంతా అత్తవారనేసరికి వచ్చేస్తుందిగామోసు. నామాట వినవైనా వినేదానివికావు! ఇంత బుద్ధిమంతురాల వౌతా వనుకోలేదు."

ఆరాత్రి మాపక్కగదిలో వియ్యపురాండ్ర గుసగుసలు వినపడినై. పొద్దు పొయ్యేదాకా ఏమిటో రహస్యాలు! నేను విందామని ప్రయత్నించాను. మా అమ్మే ఎక్కువగా చెప్పుకున్నది ఆవిడ సంతోషం కొద్దీ.

"ఇదెంత దైందమ్మా... వాళ్ల నాన్నగారిమాదిరి బోళామనిషైనా వాళ్లాయన రహస్యాలు బైట చెప్పదు. ...మహాగుట్టు. ఎంతో పొందికా, మర్యాదా నేర్చుకున్నదమ్మా. వదినెగారూ! ఇదంతా మీచలువే సుమా."

"బాగుందమ్మా....! మా ఇంటిపిల్ల అయింతర్వాత మాగుట్టు బయటపెట్టుందేమిటి?"

"అయినా — మీమీదే ఎక్కువ ఆపేక్ష కొర్నాసికి... వాళ్లత్తగారు మంచిదిట....చక్కగా చూసుకొంటుందిట....చూశారా అమ్మా. ఇన్నాళ్లు పెంచినా మేము ఉత్తవాళ్లమేగా......"

"మాకుమటుకూ వాళ్లే కదండీ! అమ్మాయి మధ్యాహ్నాంవేళల పుస్తకాలు చదివి వినిపిస్తూ ఉంటుంది. సంగీతం పాడుతూ ఉంటుంది. చక్కగా వాళ్లిద్దరూ వెయ్యికాలాలపాటు బాగుంటమే మనకు కావాల్సింది!"

మర్నాడు ఉదయం పంచపాళీలో నించున్నాను. మా అమ్మ ప్రయాణమైంది.... నాదగ్గరకువచ్చి చెక్కిళ్లు దువ్వి, "అమ్మాయీ! వెళ్లొస్తానమ్మా — ఉత్తరం రాస్తూఉండు" అంది.

తల ఊపుతూ కనుమాపుమేర దాటి పోయ్యే బండిని చూస్తూ నిలబడ్డాను.

అల్లరిపిల్ల అనే పేరు మాసిపోయిందిగా అని నాసంతృప్తి ... అదంతా మాఅమ్మ అమాయికపు పెంపకంవల్లనే అని నా దృఢాభిప్రాయం ఇప్పటికీ.

---

# నా జ్ఞాపకములు

శ్రీ వేలూరి
= శివరామశాస్త్రి =



ఒక గొల్లగూడెము. దానికిఁ బరుగు మేరలో నొక పంటచెఱువు. దానిక్రింద నొక చిన్న యారామము. దానిచుట్టును చొఱరాని యావరణము. దానిలో నొక పెద్ద మఱ్ఱి. దానిక్రింద నొక బైరాగి. స్థావరమగు మఱ్ఱిక్రింద జంగమ మగు మఱ్ఱి.

స్థావరమగు మఱ్ఱి పిలువని పేరంటము; జంగమ మగు మఱ్ఱి ?

ఆ దారిని రాకపోకలు చేయుచు పలుమారులు నే నా వడమఱ్ఱిని జూచుచుంటిని. అదియు నన్నుఁ జూచుచుండెను.

ఒకనాఁ డా మఱ్ఱిక్రింద బైరాగుల మేళనము; మఱియొకనాఁడు స్త్రీ సభ; ఇంకొకనాఁడు సార్వజనిక సమ్మేళనము. వృక్షాగ్రమున పక్షుల అవ్యక్త ధ్వని; చెట్టుక్రింద సాధువుల అవ్యక్త ధ్వని.

నాకు లోనికి వెళ్ల వలయు నని కుతూహలము కలిగెను. వెళ్లుట కుపాయము ? వెళ్లి ? ... ఇటులు కౌతుక సందేహములు కాలమును గడపెను.

ఆ వడమఱ్ఱి కూరగాయ లమ్మునని తెలిసెను. ఇంకేమి? రాచబాట దొరికెను.

ఒక రూపాయ చూపి లోని కేగితిని. పలువురు సాధువుల నడుమఁ గూర్చుండి ఆ బైరాగి గంజాయి పీల్చుట కాయత్తుఁ డగుచుండెను. నే నీ లోపుగా వటప్రదక్షిణమున కాయత్తుఁడ నయితిని. ప్రదక్షిణము చేయుటకు వటముచుట్టును వలయాకారముగా ఊడలతో గోడ యేర్పాటు చేయఁబడెను. దీనికి మూఁడు గజముల యెడమున మఱొకటి. ఇది స్త్రీలకు. ఈమార్గమున గోడగా చేర్పడిన ప్రతియూడక్రిందను ఒక్కొక్క పుట్ట కలదు. ప్రతి పుట్టయు ఫలపుష్పములతోడను, కుంకుమచందనములతోడను పూజాపురస్కారము లందుకొనుచుండెను. ఈ రెండు మార్గములును వటమూలమునకుఁ గొంపోవును. అచట ఊడలమీఁద మట్టి మేసి యేర్పఱచిన గోడలమీఁద సజీవములైన యూడలనే పైకప్పుగా నమర్చి డాబా చేసి దానిమీఁద మఱొక గది కట్టి దానిని ద్విభూమమగు ప్రాసాదముగా చేసిన ఆబైరాగి శిల్పము మన కబ్బురము కలిగించును. క్రిందిది సమాధి గృహము, పయిది నిద్రాగృహము.

ఆ యారామము సుమా రొక యెకరము మేర ఆక్రమించియుండవచ్చును. కాని పదియెకరములలో నుండఁదగిన చెట్లుండుటఁజేసి వానిక్రింద వాని నీడకుఁగూడ తావులేదు.

నేను వటప్రదక్షిణము చేసి సాధుబృందముకడకు వచ్చి కూరుచుంటిని. కలుగఁబోవు చిత్తైకాగ్రతకు సూచకమగు జెండావలె గంజాయిపొగ అంబరవీథిలో మీఁదిమీఁది కెగసి పిడకలవలె సంతరించెను. జన్మాంతరవాసనవలె దాని వాసన నన్నుఁ బట్టుకొని వదలలేదు. కొంతసేపటికి అచటి స్థలాకాశములు రెండును నిర్మలము లాయెను. సాధువుల ముఖముద్ర నిద్రాభిముఖమగుడు ఆ వైరాగి 'ధం మహాదేవ' అని ఒక అఱపఱచెను. సాధువు లందఱు నతని ననుకరించిరి. చెట్టు మీఁది పిట్ట లన్నియు తుపాకిదెబ్బ కెగిరిపోయినటు లెగిరిపోయెను. ఆ మర్రిగూడ ఆకులచే నంబరకేశు నాహ్వానించెను. పిదప నతఁడు "మర్రిలో తొర్ర, తొర్రలో పుర్ర, పుర్రే పంచభూతాల జీవగర్ర, అంతా సింగినాదం జీలకర్ర" అని ఉపన్యసించెను. సాధువు లందఱును అత్యానందమును వెలిబుచ్చిరి.

అక్కడ నున్న చాకిసాధు వొకఁడు "పుర్రే పంచభూతాల జీవగర్ర యేమిటి?" అని ప్రశ్నించెను. ఈతఁడు క్రోసు మేర నున్న ఒక యూరి నుండి దైనందినముగ జిజ్ఞాసువై అక్కడికి వచ్చుచుండును. ప్రశ్నించుటయే అతని పని. ఈ ప్రశ్న పడఁగనే వైరాగి "పుర్రే జీవగర్ర. సార బుర్ర. పెద్ద సెర్ర. ఓరి కుర్ర" అని ప్రత్యుత్తరించెను.

సాధువు లందఱు పకపక నవ్విరి. చాకికి మాత్రము సంశయము తీరలేదు. దాన నతఁడు నాకేసి తిరిగి "అయ్యా, తమరు తెలిసినవారు, పుర్రే జీవగర్ర గాని పుర్ర జీవగర్రా?" అని అడిగెను. నేను నా యజ్ఞానము నివేదించితిని. అంత వైరాగికి కోప మెత్తుకొని వచ్చెను. "ఇదిగో పుర్రే జీవగర్ర. చాకలోడికి నాపిర్ర" అని యభినయించెను. సాధువు లందఱును చాకిసాధువును పరిహసించిరి.

ఈరీతిగా నాఁటి తత్త్వసభ ముగిసెను. వైరాగి అందఱితలలపై నక్షతలుచల్లి తనపైఁగూడఁ జల్లుకొనెను. వెంటనే యతఁ డొక కలుగు ప్రక్కఁ గూర్చుండి ముక్కుమూసికొని ఒకానొక శబ్దము చేసెను. కొన్ని యెలుక లా కలుగునుండి వెలువడి అతని జటాజూటము మీఁది కెక్కి అక్షతలను దినిపోయెను. ఈవినోదమును జూచి నేను నా కుటీరమునకు మరలితిని.

నాఁటిరేయి తీరికగా కూర్చుండి యీవైరాగి భాష కర్థ మాలోచింపఁదొడఁగితిని. చట్టున అథర్వణములోని—

"కస్మిన్నఙ్గే తిష్ఠతి భూమి రస్య
కస్మిన్నఙ్గే తిష్ఠతి అంతరిక్షమ్,
కస్మిన్నఙ్గే తిష్ఠతి ఆహితో ద్యౌః
కస్మిన్నఙ్గే తిష్ఠతి ఉత్తరం దివః"

అను సూక్తము స్మృతికిఁ దవిలెను. అంతట మర్రి యనఁగా దైవమనియు, తొర్ర యనఁగా అవ్యక్తమనియు అర్థము చెప్పుకొని సరిపెట్టుకొంటిని. కాని మరల నావైరాగికడకు వెళ్లినపు డాతనితో జరిగిన సంభాషణలకు ఫలముగా అతని మాటలలోఁగాని, బోధలలోఁగాని లోఁతులకు దిగవలసిన పని యుండదని తెలిసికొంటిని. అతఁడు తత్త్వప్రసంగములు చేయునపుడెల్ల అనర్థకములగు రూపకాతిశయోక్తులలో అంత్యప్రాసములు కల శబ్దముల నతికి దిగ్భ్రాంతి కలిగించుచు వాక్సముద్రము నుబికించుచుండును. చాకిసాధువు దర్భశయనము చేసి ప్రశ్నబాణములఁ బరఁగించుచుండును.

ఇటుపిమ్మట నాకును, వైరాగికిని తత్త్వచింతలోఁగాక కూరగాయలచింతలో సంబంధము కలిసెను. ఖాతాకూడ చేర్పడెను. వైరాగికి గంజాయికావలెను; నాకు కూరగాయలు కావలెను. గంజాయి కావలసినపుడెల్ల ఆవైరాగి నా కక్కఱలేకున్నను సుమారిరువది సపోటాలు పంపి రూపాయ వసూలుచేయ మొదలిడెను. ఇది నా కిబ్బందిగా నుండెను. '౩౫-వ సంవత్సరమున తుపానుకు అతని అరఁటితోఁట యంతయుఁ దాటాదూటమాయెను. విఱిగిన లేయనఁటి పిందెలగెల యొకటి శిష్యునిచేఁ బంపి రూపాయ ఆఱణాలకు హుండీ పంపించెను. నే నా పనికిమాలిన గెలను దూరముగా నుంచి నా కోరనివస్తు వేదియు నిఁకఁ బంపవలదని మీగురువుతోఁ జెప్పుమని అతని నంపితిని. పదివాళ్లు దాఁటినపిదప ఆవైరాగి నిండువేసముతో నాకుటీరమధ్యమునకు వచ్చి కూర్చుండి ప్రాణాయామ మొనర్చి వెంటనే ధ్యాననిద్రనుండి లేచి కను లెఱ్ఱఁజేసికొని 'రూపాయ ఆఱణాలు' అని గర్జించెను. నేను

శాంతిమార్గ మవలంబించితినిగాని లాభము లేకపోయెను. తుదకు శాప్యదండము చేకొంటిని. నన్నతఁడు బిగ్గఱగా శపించి ఆ శాపాక్షరముల అక్షరాల నడపుటకు సూర్యు నామంత్రించి ఆకసము చూచుచుఁ బాఱిపోయెను.

సూర్యుఁ డతని శాప మమలుపఱుపకపోవుటచేఁగాఁబోలు నాతఁడే కొన్నాళ్లకు స్వయముగా వచ్చెను. నే నపుడు కొండనెత్తమునుండి దిగుచుంటిని. అంధకార మప్పుడే అతనికిఁ దోడుపడెను. కాని బైరాగి నాకంటఁ బడెను. అతఁడు కంచె కొల్దరినుండి నా కుటీరమును తొంగితొంగి చూచుచుండెను. నేను గబగబ పైనుండి దిగితిని.

అతఁడు చేతికి దొరికిన రాలు పుచ్చుకొని కుటీరముమీఁదికి విసిరి ప్రత్యుత్తరమున కపేక్షించుచుండెను. ఇంతలో ననపేక్షితముగా నే నతని వెనువెనుకనే యుండి కొన్ని చిన్నగులకరా లతనిమీఁద విసరితిని. అతఁడు వెనుదిరిగి చూచి వెఱగుపడి పాఱిపోయెను. నేను వెంటాడితినిగాని అతనిని పట్టుకొన లేకపోతిని. ఆ మఱునాఁ డాతఁడు చాకిసాధువు నా పాకమీఁద రాలు రువ్వెనని ప్రచారముచేసెను. ఆచాకిసాధు వా యకార్యము తానే చేసినటుల పెద్దలముం దొప్పుకొనెనఁట.

ఆటుపిమ్మటఁ గొన్నియేండ్లవఱకును మా యిరువురకు సమావేశము కలుగలేదు. నే నొకనాఁ డొకరాదారిని బోవుచుంటిని. ఆ రాదారిప్రక్క పెంటపాడు బైరాగులమఠము కలదు. హఠాత్తుగా అచట నా బైరాగి!

అతఁ డామఠములోనుండి వచ్చుచుండెను. ఆతనికొఱ కొకఁడు బయటఁ బొంచుండెను. బైరాగి కాలు గడప కీవలఁ బడెను. పొంచున్న యతఁ డతనిగడ్డము పట్టి అటునిటు నిటునటు జాడింపఁదొడఁగెను. బైరాగి 'చస్తి, చస్తి'నని యార్చెను. గబాలున నే నాయిరువుర నడుమ దుమికితిని. అతనిగడ్డములో గుప్పెఁడు వెంట్రుక లూడినపిదపఁగాని నే నతనికి ముక్తి కలిగింపలేకపోతిని.

అతఁ డామఠములో గంజాయి దొంగిలెను. దానికి శాస్తిగా ముఖమునందలి కంబళినుండి కొన్ని వెంట్రుకలేకాక గడ్డమునందలి కొంత రక్తమునుగూడ నతఁ డీయవలసివచ్చెను.

అతఁడు నన్నుఁ జాటుచేసికొని వెనుదిరిగి చూచుచు ఒక క్రోసుమేర వచ్చెను. అక్కడ గ్రామసీమ. మేమిరువుర మొండొండ మాటాడకుండ మా మా దారులఁ బోయితిమి. అతఁ డీ దొంగతనమునుగూడ చాకిశిష్యునిపై మోపెను. ఆతఁ డొప్పుకొనెను. గురువు నపరాధము లన్నిఁటిని నిశ్చలముగా మోయు నీచాకివాఁ డెదుర పడినపుడెల్ల నా మేను పులకరించిపోయెడిది.

కొన్నాళ్లకు పలువురు లక్ష్మీపుత్రు లాబైరాగికి శిష్యులయిరి. దాన నతఁడు గంజాయి దొంగిలుట మానివేసెను. ఆశిష్యు లొక్కొక్క రొక్కొక్కరోఁ డొక్కనాఁడు ఆమర్రిక్రింద అష్టాదశ వర్ణములవారికిని సంతర్పణ మొనర్పఁబూనిరి. అందులకుఁ దెచ్చిన సంభారములలోఁ గొన్ని మాయమాయెను. ఉన్నాఁడుకదా పాపాలకెల్ల భైరవుఁడు! బైరాగి చాకివానిమీఁద నా దొంగతనము మోపుటయు, నతఁ డొప్పుకొనుటయు, దానికి ఫలముగా శాస్తి యనుభవించుటయు జరిగిపోయెను.

కొలఁదినాళ్లలోనే ఆ చాకిసాధువు శరీరము చాలించెను. పుచ్చుకుక్క నీడ్చి పాఱవేసినటు లాతని శరీరము నా మర్రిక్రిందినుండి యీడ్చి పాఱవైచిరి.

అటుపిమ్మట నయిదాఱేండ్లకు నే నా బైరాగి తోఁటప్రక్కనుండి పోవుట తటస్థించెను. అచట నా కా చాకిసాధువు గుఱుతు దవిలెను. అతఁ డచట ధ్యానము చేసికొను నేలబొరియ చూడఁగోరిక కలిగెను (ఇది పవాహారిబాబా గంగయోరఁ త్రవ్వుకొనిన బొరియవంటిది). అంత టలోని కరిగితిని.

బైరాగి కంకాపాంకములుగా జ్వరము కాయుచున్నదని తెలియవచ్చెను. నే నతని శయ్యకడ కరిగితిని. అతఁడు సంధిలో నుండెను. నే నపు డతనికి నారాయణు వందించితిని. అతఁడు 'గంజాయి గంజాయి' అనియనెను. నే నచటినుండి చాకిసాధువు నేలబొరియకడ కరిగితిని. దాని నెవరో పూడ్చివైచిరి.

మఱి పదిరోజుల కాబైరాగి మరణించెను. శిష్యు లెందఱో చేరి యాశవము నలంకరించి పెండ్లికొడుకు నూరేగించిన ట్లూరేగించిరి. పిమ్మట నచట నొకసమాధి కట్టించిరి.



# నాదశక్తి



శ్రీ జి. వి. కృష్ణరావు

కరెన్సీ నోటును అర్థం చేసికోటానికి ఎంత లోతుకు పోవాలో శబ్దసంగతి తెలిసికోటానికి అంతకన్నా లోతుకు పోవాలి. కేవలం ధ్యానంవల్ల శబ్దతత్వం తెలియదు. శబ్దాన్ని లోకాన్నుంచి విడదీయక, లోకోత్పన్నమని ఆలోచించినప్పుడే దాని తత్వం తేలుతుంది.

శబ్దానికి అభిధ, లక్షణ, వ్యంజన అనే అర్థశక్తులు మూడు ఉన్నాయని ధ్వనికారుడు విపులీకరించి చెప్పాడు. ఈశక్తులవల్ల విషయాలను, భావాలను తెలియజేయవచ్చును. పాఠకుడిలో అనుగుణములైన వికారాలను కలిగించవచ్చును. వచనకావ్యాలు ఈ పనే చేస్తున్నాయి.

ఈ మూడువిధాలైన అర్థశక్తులే కాక శబ్దానికి నాదశక్తి మరోటి వుంది. చాలామంది విమర్శకులు ఈ నాదశక్తిని అర్థశక్తులతో కలగాపులగం చేస్తున్నారు. దీన్ని వేరుచేసి చూడటం ముఖ్యం.

శబ్దానికుండే యీనాదశక్తి ఉచ్చారణలోనే వుంటుంది. అర్థశక్తులవల్ల కలిగే వికారాలను కొంతమంది నాదశక్తివల్లనే కలుగుతున్నాయని భ్రాంతిపడతారు. యాబర్‌క్రోంబీ అనే ఆంగ్ల విమర్శకుడు 'బేర్' (అంటే ఎలుగుబంటి) అనే శబ్దనాదమే భీతి కొలుపుతుం దన్నాడు. దానికి ఓ కట్టుకథ కూడా చెప్పాడు.

సృష్ట్యాదిలో ఆదాము, అవ్వ అనే దంపతులకు జంతువులను వేరువేరుగా తెలుసుకోవలసివచ్చింది. తప్పనిసరై వారు వివిధ జాతులకు నామకరణం చెయ్యాలనుకున్నారు. జంతువు లన్నిటినీ ఒక దొడ్డికి తోలింతరువాత గేటులో అవ్వ నుంచుంది. ఒక్కొక్క జంతువును ఆదాము బయటికి తోలాడు. అవ్వ "ఇది ఆవు, ఇది మేక, ఇది గేదె, ఇది బేర్" అంది. "అది 'బేర్' అని నీ కెలా తెలుసు?" అని ప్రశ్నించాడు ఆదాము. "దాని ముఖమే చెప్పతున్నది" అన్నది అవ్వ.

కాని భీతి అనేది 'బేర్' అనే శబ్దంలో లేదు. అది కేవలం అర్థాన్ని పురస్కరించుకొని వచ్చిందే.

క్రిస్టఫర్ కాడ్వెల్ మతప్రకారం శబ్దానికి రెండు గుణాలు ఉంటాయి: ఒకటి, అర్థం; రెండు, శబ్దంవల్ల కలిగే వికారాలు. అయ్య, నాన్న, తండ్రి, అప్ప, అబ్బ, బాబు, అమ్మమొగుడు సమానార్థకాలేను. కాని ఆ శబ్దాలవల్ల కలిగే వికారాలు వేరు అంటాడు. ఇది సరికాదు. ఈశబ్దాల తాత్పర్యం ఒకటే; కాని అర్థాలు వేరు. భిన్నభిన్నంగా ఉన్న అర్థాలను పురస్కరించుకొనే భిన్నభిన్న వికారాలు కలుగుతున్నాయి.

నాదంవల్ల కలిగే వికారాలు అర్థంవల్ల కలిగే వికారాలకంటే భిన్నమైనవి. బుల్‌బుల్, బిల్‌కుల్, క్లేరిబెల్, లిల్లీ అనే శబ్దాలు అర్థం తెలియనివారికైనా ఒక రకమైన వికారాన్ని

౨. పలక్కడ: ఇది యువమహారాజవిష్ణుగోపుని రాజధాని. ఉరువపల్లిశాసనముగూడ నిచ్చటి నుండియే ప్రకటింపఁబడెను. ప్రాచీనశాసనములలో పెక్కింటియందు పలక్కక, పలాశ్కట, పలక్కడ, పద్దుకరయనునామము గల స్థలములు పేర్కొనఁబడి యున్నవి. ఇవి యన్నియు నొక యూరి పేరేనని చరిత్రకారుల యభిప్రాయము (నా కట్టి నమ్మకము కుదురలేదు). కాని యాయూ రెద్దియని నిర్ధారణ సేయఁబూని పల్వు రొక్కొక్క రొక్కొక్కమార్గమును ద్రొక్కియున్నారు. సోమశేఖరశర్మగారిది యిప్పటి చెంగల్పట్టుజిల్లా పొన్నేరితాలూకాలోని పులికాటను నామాంతరము గల ప్రళయకావేరియే యని చెప్పియున్నారు.24 వెంకటరామయ్యగారీయభిప్రాయమునే యంగీకరించిరి. కృష్ణమాచార్యులవారిది నెల్లూరిజిల్లా కోవూరితాలూకాలోని పడుగుపాడుగ్రామ మని గుర్తించిరి.25 నిశ్చయించి చెప్పుటకు తగు సాధనములింకను దొరకకున్నవి. భావిపరిశోధనవల్లఁగాని వాస్తవము బయలువడలనేరదు.

24. Journal of Madras University, 1940 Pp 152-53

25. Ep. Ind. XXIV P 301.

3. దొడ్డిస్వామియాజమాన్యముక్రింద నుండిన నడిపి, లేక నడిప్పియను గ్రామ మెందుండెనో తెలియదు.

4. విష్ణుగోపమహారాజు వచనముచేత కారణిక గ్రామముగఁ జేయఁబడిన నెడుంగ్గరాయగ్రామముండిన స్థానము దెలిసికొనుటకు సాధ్యము కాకయున్నది. రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులవారిది శాసనము దొరకినట్టి సింగరాయకొండయే కావచ్చునని తలఁచుచున్నారు. రెండు గ్రామముల పేర్లకును 'ంగరాయ' సామాన్యము. 'నెడుంగ్గరాయ' యనునది 'నిడుంగురాయి'కి రూపాంతర మగునేని నది యొకవేళ నెల్లూరుజిల్లా రాపూరుతాలూకాలోని 'నిడుగల్లు' గ్రామము కావచ్చును. కాని నిశ్చయించి చెప్పుటకు సాధ్యము కాదు.

ఈ శాసనమును చదువుటయందు నేను రెండు మూఁడు స్థలములలో రావుబహదూరు సి.ఆర్.కృష్ణమాచార్యులవారియొక్క సహాయమును బడసితిని. వారికి నాకృతజ్ఞతాపూర్వకనమస్కారములను సమర్పించుచున్నాను.

మొదటిరేకు: రెండవ ప్రక్క



1 [జితమ్భ]గవతా [॥*] విజయశ్రీ పలక్కడస్థానాత్ పరమబ్రహ్మ
2 [ణ్యస్య] స్వబాహు బలార్జ్జితోర్జ్జిత క్షాత్రతపోనిధేః
3 [విహిత] సర్వ్వమర్యాదస్య స్థితిస్థితస్యామితాత్మనో
4 మహారాజస్య శ్రీస్కన్దవర్మ్మణః ప్రపౌత్ర స్యార్చ్చితశక్తి

రెండవ రేకు : మొదటి ప్రక్క



5 సిద్ధిసమ్పన్నస్య ప్రతాపోపనత రా[జ]మణ్డలస్య మహా
6 రాజస్య వసుధాతలైకవీరస్య శ్రీ వీరవర్మ్మణః
7 పౌత్రస్య దేవ ద్విజగురు వృ[ద్ధో]పచాయినో వివృద్ధ
8 వి[న]యస్యానేక గోహిరణ్య భూమ్యాది ప్రదానైః ప్రవృద్ధ

రెండవ రేకు : రెండవ ప్రక్క



9 *వినయస్యానేక గోహిరణ్యభూమ్యాది ప్రదానైః ప్రవృద్ధ
10 ధర్మ్మ స[ఞ్చ]యస్య ప్రజ[ా]పాలన [దక్షస]స్య లోకపాలానా
11 మ్పఞ్చమస్య లోకపాలస్య సత్యాత్మనో మహాత్మనో
12 మహా రాజస్య శ్రీస్కన్ద వర్మ్మణః పుత్రస్య భగ[వద్భ]క్తి

* ప్రమాదవశమున లేఖకుఁడీ పఙ్క్తిని ఇచట మరల చెక్కెనని తోఁచుచున్నది.

మూఁడవ రేకు : మొదటి ప్రక్క

13 సద్భావ సమ్భావిత సర్వ్వకల్యాన[ణ] స్య ప్రజాసంరక్షనప
14 రిపాలనోద్యోగ సతత సత్ర వ్రతదీక్షి[త]స్య అనేక
15 సమరసాహసావమర్ద్దలబ్ధ విజయ యగ (శ)ః ప్రకాశ
16 [స్య] కలియుగదోషావసన్న ధర్మ్మోద్ధ[ర]ణ నిత్యసన్న

మూఁడవ రేకు : రెండవ ప్రక్క

17 [ద్ధ]స్య రాజర్షిగుణ సర్వ్వ సన్దోహ విజిగీషో[ర్ద్ధ]ర్మ్మ
18 విజిగీషో ర్భగవత్పా[దా]నుధ్యాతస్య బప్ప భట్ట (ట్టా) ర
19 కమహారాజ పాదభక్తస్య పరమ భాగవతస్య
20 భారద్వాజస్య పల్లవానామ్ యువమహారాజ శ్రీవిష్ణుగోపస్య

నాలుగవ రేకు : మొదటి ప్రక్క



21 వచనేన ముణ్డరాష్ట్రే నెడుఙ్గరాయే గ్రామేయకాః
22 వ_క్తవ్యాః[॥*]ఏష గ్రామః శారణిక నడిప్పిభోజ
23 దొడ్డిస్వామి కణ్ణస్వామి నన్దిస్వామిభ్యః భాగత్రయం
24 కృత్వా తత్రాపి భా[గత్రయే]నడిపి భోజకస్య భాగ

నాలుగవ రేకు : రెండవ ప్రక్క



25 ద్వయ[క]మ్[।*]కణ్ణస్వామి నన్దిస్వామినో రేకో భాగః [।*] తత్రా
26 [ప్యే]కస్మి న్భాగే భాగద్వయం కణ్ణస్వామినః [।*] ఏకో భాగో
27 నన్దిస్వామినః[॥*] ఏవం విభజ్య శారణిక గ్రామం కృత్వా
28 అష్టాదశ* జాతిభిః పరిహారై రుపేతో దేవభోగహల

* లేఖకుఁడు మొదట 'శ' ను విడిచి, తరువాత దానిని పంక్తికి దిగువ 'ద' 'జా' ల మధ్య చెక్కెను.

ఐదవ రేకు : మొదటి ప్రక్క

29 వర్జ్యం అస్మదాయుర్బలవర్ద్ధనీయ మస్మాభి స్సప్ర(మ్ప్ర)దత్తః[॥*]
30 తదవగమ్య తస్మిన్విషయే సర్వ్వాయుక్తకాః సర్వ్వనైయ్యో
31 గికాః రాజవల్లభాః సంఞ్చా*రన్తశ్చ తద్గ్రామం తథైవ
32 పరిహారైః పరిహరన్తు పరిహారయన్తుచ [॥*] యశ్చే దస్మ

ఐదవ రేకు : రెండవ ప్రక్క

33 చ్ఛాసన మతిక్రామే త్సపాపన్గ(శ్చా)రీరదణ్డమర్హతి[॥*]
34 (శ్రీ) సింహవర్మ్మణ మహారాజస్య విజయ సంవత్సరే
35 ద్వాదశమే జ్యేష్ఠమాసే కృష్ణపక్షే త్రయో
36 దశ్యామ్ మయా దత్తా తాంబ్ర (బ) పట్టికా[॥*]

---

* 'సఞ్చా' యని చదువవలయును. ఇందు లేఖకుడు మొదట 'యంఞ్చా' యని వ్రాసి తరువాత 'య' ను 'స' గ దిద్దినాడు.



ఈ మాత్రము శ్రద్ధవహించిన

మీ ముఖమునకు

# కోమలత్వము

నిక్కముగా చేకూరును

మీ ముఖసౌందర్యమునకు మృదుత్వము, శుభ్రతయు చాలా అవసరము. ఇట్టి సౌందర్యమును ప్రతిస్త్రీయును పొందగలదు. ముఖకాంతిని నిర్లక్ష్యముచేయవద్దు. నిత్యము సామాన్యపు శ్రద్ధవహించిన మీ ముఖమునకు ఇదివరకెన్నడు కానబడని కోమలము, కాంతి, అందమును ఇచ్చును.

నిత్యము ఉదయమును, రాత్రియును కొంచెము "పాండ్స్ కోల్డుక్రీము"ను ముఖమునకు మర్దనచేయుడు. దానిలోనుండు శుభ్రపరచు తైలములు చర్మరంధ్రములలో జొరపడి చేరుకొనిన మురికినంతను నిర్మూలనముచేసి చర్మమును శుభ్రపరచును. మెత్తనిగుడ్డతోగాని, పాండ్స్ ఫేస్ టిష్యూలతోగాని తుడిచివేయుడు. అదేమాదిరి రెండవతూరి చేయుము, రాత్రివేళ మరికొంచెము ఈక్రీమును ముఖమునకుపూసి ఉదయము వరకు అట్లే ఉంచుము.

పగటివేళ ఎండతాపము, వేడిగాలినుండి రక్షించుకొనుటకై **"పాండ్సు వ్యానిషింగ్ క్రీము"** నుపయోగించుడు. అది జిగటలేనిది; మరియు పూసుకొనగానే అతుకుకొని పోవును.

మీ ముఖకాంతిని కాపాడుటకు తక్షణమే పాండ్సుక్రీముల నుపయోగింపుడు. రెండువారముల తరువాత మీచర్మము కోమలముగాను, కాంతియుతముగాను, అతిమృదువుగా నుండుటచూచి, మీరే ఆనందించగలరు.



పాండ్స్ కోల్డ్ క్రీమ్: చర్మమును చాలానిర్మలముగను మృదువుగ నుంచును. రాత్రియందు ఉదయమందు దీన్ని ఉపయోగింపుడు.



పాండ్స్ వ్యానిషింగ్ క్రీం: ఎండతాపము వేడిగాలినుండి మీచర్మమును జాగ్రతపరచును.

## ముఖ సౌందర్యమునకు

# పాండ్స్ క్రీములు

కలిగిస్తాయి. Buzz, Hiss, Murmur అనే శబ్దాలనాదమే వాటి అర్థాన్ని తెలుపుతూ వుంది. తెలుగులోని గుసగుస యిలాంటి దే.

"Tiger, Tiger, burning bright" అనే చరణానికి అర్థం తెలియకపోయినా కావలసిన వికారం కలుగుతుంది. శాఫో కవయిత్రి వ్రాసిన "Golden sandaled dance" అనే చరణం, షెల్లీ వ్రాసిన "Sweet as a singing rain of silver dawn" అనే చరణం అల్లాంటి దే.

ఒకసారి ఇంగ్లీషు తెలియనివాడిదగ్గిర —
"Water water every where
Not a drop to drink."

అన్న పద్యాన్ని చదివి నీ కేమనిపిస్తున్న దంటే, ఏదో అవస్థ పడుతున్నట్టు కనిపిస్తుం దన్నాడు. ఇది కేవలం నాదశక్తివల్ల కలిగిం దే.

జయదేవుని గీతగోవింద మంతా ఈ నాదశక్తికి లక్ష్యంగా చూపించవచ్చును. మరీ అష్టపదులు ఈ విషయంలో లోకోత్తరాలు.

ఇలాంటి నాదశక్తిని గ్రహించి సంపూర్ణంగా వినియోగించుకొన్నది తెలుగుకవుల్లో కవిబ్రహ్మ ఒక్కడే. ఈ శక్తి ఒకటి ఉందని నన్నయకు తెలియదు; ఎఱ్ఱాప్రగడ ఎరగడు. జాగ్రత్తగా చూస్తే నన్నయకు సంగీతజ్ఞానం లేదేమో అనిపిస్తుంది. అయితే పద్యం హాయిగా నడుస్తుందే అంటే దానికి సంగీతజ్ఞానం అక్కరలేదు.

అర్థాన్ని త్యజించి కేవలం నాదం కోసమే జాగ్రత్తపడితే సంగీత మౌతుంది కాని కవిత్వం కాదు. ఆధునికుల్లో ముఖ్యంగా 'ఇమేజిస్టు'లు, 'సర్ రియలిస్టు'లు నాదం ద్వారా రససిద్ధి చేకూర్చటానికి శబ్దాలు పోగు చేస్తున్నారు; విచిత్ర శబ్దాల్ని సృష్టిస్తున్నారు. ఇలాంటివి జేమ్సు జాయిస్ వ్రాసిన యులిసిస్‌లో కోకొల్లలుగా ఉన్నాయి.

కవిబ్రహ్మ అర్థవంతమైన శబ్దాల నాదశక్తిని విరివిగా వాడుతాడు. ద్రౌపది కీచకుణ్ణి

"దుర్వారోద్యమబాహువిక్రమరసా
స్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీరనిర్మథనవి
ద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దో
ర్లీలన్ వెసం గిట్టి—"

ఏదో చేస్తారు సుమా అంటుంది. ఈ పద్యనాదమే ఆమెకోపాన్ని వెళ్లగ్రక్కుతుంది.

ఉత్తరుడు—

"భీష్మద్రోణ కృపాది ధన్వి నికరా
ఖిలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాప విసరా
కీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలా
త్యుగ్రం బుద్యగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్యమిది నే
జేరంగ శక్యంబె నే."

అని బృహన్నలతో అంటాడు. నిజంగా భయపడటానికి కారణ ముందని ఆ పద్యనాదమే తెలుపుతూవుంది.

నన్నయకవిత్వంలో ఈ నాదశక్తి కనిపించదు. నిండుసభలో పాంచాలిని భంగపరచినప్పుడు భీముడు ప్రతిజ్ఞ చేస్తాడు:

"ధారుణి రాజ్యసంపదను
దంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరు దేశమున
నుండఁగఁ బిల్చిన యిద్ధరాత్ముఁ దు
ర్వార మదీయ బాహుపరి
వర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సు
యోధను నుగ్ర రణాంతరంబునన్"

గీటుంచిన భాగాల్లో తప్ప భీముని ప్రతిజ్ఞ ప్రతిజ్ఞగానే కనిపించదు.

భావాని కనుగుణంగా తిక్కన పద్యాలెప్పుడూ కదంతొక్కుతూ వుంటాయి. అర్జునుడు ఇలా అన్నాడు అని సంజయుడు చెప్పే—

"గాండీవ గుణరవం బొండొండు చెలఁగంగ
శరపరంపర లాకసంబు గప్పు."

అనే పద్యం పోయినకొలదీ జెరిలాగా పరుగెడుతూ అర్జునుని భావాలను వినిపిస్తోంది. ఇది టెన్నీసన్ "Break, break" అనే పద్యాన్ని తల దన్నుతూవుంది. కవిబ్రహ్మ నాదబ్రహ్మ కావటంవల్ల 'గాండీవ' అని వాడి చరణాన్ని తిరిగ్గా పెండ్లినడకలు నడవకుండా, 'గాండీవ' అని త్రుంచివేసి నడకలో కర్కశత్వాన్ని తీసుకొచ్చాడు. ఎత్తుగీతంలో చిన్నచిన్న పదాలు వేసి పద్యధాటీపాటవాన్ని ఇనుమడింపజేశాడు. ఇలా భావాని కనుగుణంగా ఎప్పుడూ పద్యాన్ని నడపగలిగింది తెలుగులో తిక్కన ఒక్కడే. అతడు ప్రతి ఘట్టంలోనూ ఈ నాదశక్తిని వాడుతాడు. స్తిమితంగా యుక్తియుక్తంగా మాటాడవలసినప్పుడు గడబిడ లేకుండా చిన్నచిన్న వాక్యాలతో అతని పద్యం నడుస్తుంది.

"ఈవంశంబున కల్గ నీవ కురు రిం
దెవ్వారి చందంబు లె
క్కై వర్తిల్లిన కీడు మేలు తుది నీ
యం దొంచెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలి వృ
త్తంబున్ జనస్తుత్యముల్
గావింపందగు నీక యెవ్విధమునన్
గౌరవ్యవంశాగ్రణీ!"

మనుచరిత్రలో రెండో ఆశ్వాసం మొదట్లో ప్రవరుడితోపాటు,

"... ... ...
అంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠద
భంగతరంగ మృదంగ నిస్వన
స్ఫుటనటనానురూప పరి
ఫుల్లకలాప కలాపి జాలమున్
కటకచరత్కరేణు కర
కంపిత సాలము శీతశైలమున్"

---



# "రెంటికిం జెడిన రేవణ"



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

గత చైత్ర భారతి సంచికలో ఈ లోకోక్తిమీద ఒక చిన్నచర్చ కనపడ్డందు వల్ల ఈ రేవణశబ్దాన్వేషణకు బయలుదేరడ మైనది. సంస్కృతవాఙ్మయంలో దీనికి సాధు శబ్దము 'రేవణ' అని. కాని ఏకారణంచేతనో ఇది తెలుగులోకి 'రేవడ'గా మారింది.

రేవణశబ్దము ఒక మనుష్యుని పేరు. ఈయన పూర్వమీమాంసా పునరుద్ధారణ కర్తలైన శ్రీ కుమారిలభట్టపాదుల శిష్యు లని ప్రాయోవాక్యము. కుమారిలాను యాయులవలంబించే మతానికి భాట్ట మీ మాంస అని అంటారు. ఈ సందర్భంలో ఒక కారిక కనబడుతుంది.

"ఉంవేకః కారికాం వేత్తి
తంత్రం వేత్తి ప్రభాకరః,
మండనస్తూభయం వేత్తి
నోభయం వేత్తి రేవణః."

"ఉంవేకునకు కారికమాత్రము తెలియును. ప్రభాకరునకు తంత్రము తెలియును. మండనునకు ఈ రెండును తెలియును. రేవణునికి ఈ రెండును తెలియవు" అని దీని అర్థము.

జైమిని వ్రాసిన పూర్వ మీమాంసా సూత్రాలకు శబరస్వామి భాష్యం వ్రాసి నాడు. కుమారిలభట్టు ఆ భాష్యంమీద వార్తికాలు రచించినాడు. ఆ వార్తికాలను మూడువిభాగాలుగా విభజింపవచ్చును. ప్రథమ తర్కపాదానికి కారికారూపంలో శ్లోకవార్తికం వ్రాయటంచేత దీనికి 'కారికా' అనే పేరు రూఢిఅయిపోయింది. ఈ ఉంవేకుడు కుమారిలుని శిష్యుడని ప్రాయోవాదము. శ్లోకవార్తికంమీదా, మండనుని భావనావివేకంమీదా ఇతని వ్యాఖ్య లున్నవి. మండనుడు కుమారిలుని శిష్యుడు. కాని అతని భావనావివేక వ్యాఖ్యానావస రంలో ఉంవేకుడు పాఠాంతరాలను చాలా చూపించటంచేత ఇతడుకూడా కుమారిలుని శిష్యుడనటంలో చిక్కులు కలుగుతై. ఏదెలా ఉన్నా ఈ కారికలోనివారంతా

పూర్వమీమాంసాశాస్త్రంలో కృషిచేసిన వారు.

తంత్రవార్తికం క్షుణ్ణంగా తెలిసికొన్న వాడు ప్రభాకరుడు. ఇతనికే 'గురు'వని ఇంకొక పేరుంది. ఇతని మతాన్ని ప్రాభాకర మీమాంస అనీ, గురుమత మనీ వ్యవహరిస్తారు. కుమారిలుని శిష్యు డని అనుశ్రుతంగా వచ్చే కథ లున్నవి. ఏమైనా ఇతడు కుమారిలుని సమకాలీను డని చెప్పవలసి వస్తుంది. ఇతడు భాట్ట మీమాంసకుల మతాన్ని ఒప్పుకోకుండా వేరే మతాన్ని స్థాపించటానికి పూనుకొని శాబరభాష్యానికి వ్యాఖ్య చేసినాడు. ఈ వ్యాఖ్యనే 'బృహతి' అని అంటారు.

మండనుడు ప్రాక్ఛంకరాద్వైతమున 'బ్రహ్మసిద్ధి' వ్రాసినాడు. కుమారిలుని శిష్యుడు. శ్లోకతంత్ర వార్తికాలు రెండూ ఇతనికి బాగా తెలుసునట. ఇచ్చట తంత్రశబ్దం టుప్టీకనుకూడా తెలియజేస్తుందని అనుకోవలసి ఉంటుంది.

రేవణుడు కుమారిలుని శిష్యుడో, పూర్వమీమాంసలో కృషి సల్పినవాడో అయిఉంటాడు. ఈయనకు శ్లోకవార్తికమూ తెలియదు, తంత్రవార్తికమూ తెలియదు. పాపం, ఎన్నేళ్లు శుశ్రూష చేసినా, ఎంత కాలం చదివినా ఈ రేవణునకు ఇవేవీ తలకెక్కలేదు. అందుచేతనే ఉభయభ్రష్టు అయినాడు. ఈయనకు కారికా తెలియదు, తంత్రవార్తికమూ తెలియదు. అందుకనే "రెంటికీ చెడ్డ రేవణు"డని సామెతలోనికి దిగినాడు. అంతేగాని ఇక్కడ వేరే అర్థాలేమీ లేవని తోస్తుంది.

ఇక్కడ ఉదాహరించిన కారిక అనుస్యూతంగా పండిత సంప్రదాయాల్లో వస్తున్నది. దీనికి పాఠభేదంతో ఇంకొక కారిక ఉన్నా చివర పంక్తిమాత్రం "నోభయం వేత్తి రేవణః" అనే.



# సామగాన విచారము




"సామధ్వనా వృగ్యజూంషి, నాధీయీత కదాచన,
వేద స్యాధీత్య వాప్యంత మారణ్యక మధీత్యచ"
(మను. iv, ౧౨౩)

"ఋగ్వేదో దేవదైవత్యో యజుర్వేదస్తు మానుషః,
సామవేద స్స్మృతః పిత్ర్యః తస్మాత్తస్యాఽశుచి ర్ధ్వనిః"
(మను. iv, ౧౨౪)

మనుస్మృతిలోని యీశ్లోకములు సామవేదము పిత్ర్యము, అనఁగాఁ బితృదేవతాసంబంధి. దానంజేసి దాని ధ్వనియే అశుచి యనియు, వందువలన సామధ్వని వినిపించుచుండ ఋగ్యజుస్సు లధ్యయన మొనర్ప రాదనియు మన్నగు సంగతులు నివేదించుచున్నవి. మనుస్మృతివచనములు "యన్మనురబ్రవీత్ తద్భేషజ" మ్మనెడి శ్రుతివాక్యము ననుసరించి యాస్తికులకుఁ బరమమూర్ధన్యము లగుటంజేసియు, నట్టి స్మృతివరిష్ఠమం దిట్టి కర్ణశూలాయితంబులగు వాక్యములు గన్పడుటంజేసియు, సామగాన మపవిత్రమనియు, దానంజేసి శుభకార్యములపట్ల నాశీఃప్రవచనాదికమం దప్రయుజ్యమనియు వాదింపఁ దగుచున్నది. అటు లనుటంబట్టియు, "సామవేదా దిదం గీతం సంజగ్రాహ పితామహః" ఇత్యాది భరతశాస్త్రప్రమాణముంబట్టియు, గానము సామవేదమునుండి పుట్టినదగుట నయ్యదియు నమంగళాత్మకమై శుభంబులఁ బ్రయోగార్హంబు కాక తప్పదని పరిణమించుచున్నది.

కాని వివాహాదిశుభకార్యములందు సామగాన ప్రయుక్తముగ నాశీర్వాదమొనర్చుచుంట యనాదిశిష్టాచారసమ్మతంబుగఁ గాన్పించెడిని. అటులనే గానము కూడ ముఖ్యముగ శుభంబులందుఁ బ్రారంభంబునుండి యంతమువరకు మంగళవాద్యాభిధేయంబులగు వీణావేణుమృదంగాదివాద్యధ్వనులతోడను, గానసభాజకములతోడను నిర్వర్తింపఁబడుటయు ననాదిశిష్టాచారసమ్మతముగనే ప్రవర్తిల్లుచుండెడిని. ఇట్టి శిష్టాచారము మనుస్మృతివాక్యముల కట్టి యర్థము గల్పించినయెడల గర్హించి దూరీకరింపవలసివచ్చుచున్నది. కాని

"యా న్యస్మాకగ్ం సుచరితాని - తాని త్వయోపాస్యాని - నో ఇతరాణి" (తై. ఉ.)

"శ్రుతి స్స్మృతి స్సదాచారః
స్వస్యచ ప్రియ మాత్మనః". (మను.)

ఇత్యాది శ్రుతిస్మృతివాక్యములచే ననాదిశిష్టాచారంబును ద్రోసిపుచ్చుటకును వీలుండదు.

ఇట్టిచో స్మృత్యాచారములు సమన్వయార్హములా, కావా యని విచారించి సిద్ధాంత మొనర్పవలసిన యవసరము గలిగినది. అట్టి నా సమన్వయ మేమెయో యుపపత్తిపురస్సరముగ నివేదించువాఁడ నవధరింపుఁడు:

స్మృత్యాచారములు రెండును బరతఃప్రమాణములుగాని స్వతఃప్రమాణములు గాఁజాలవు. అనఁగా "వేదస్య హి నిరపేక్షం స్వార్థే ప్రామాణ్యం రవేరివ రూపవిషయే. పురుషవచసాంతు మూలాంతరాపేక్షం వక్తృస్మృతివ్యవహితం చేతి విప్రకర్షః" (శాం. సూ. భా. II. i. ౧) ఇత్యాదివచనములఁబట్టి వేద మొక్కటియే ప్రమాణాంతరనిరపేక్షంబగుటచే స్వతఃప్రమాణమనియు, స్మృత్యాదులు మూలశ్రుత్యపేక్షకములై ప్రమాణము లగుచుంటచేఁ బరతఃప్రమాణము లనియు తెలుపఁబడుచుండునని తాత్పర్యము. మూలభూతంబగు శ్రుతివాక్యము లగపడనియప్పుడు అట్టివాక్యమొకటి యెచ్చటనో యుండనిది స్మృత్యాచారములు పుట్టనేరవనెడి యనుమితిరచనచే నట్టివి ప్రమాణము లగుచుండును; కాని ప్రత్యక్షతః కన్పించెడి శ్రుతివాక్యములకు స్మృత్యాచారములు విరోధించునేని యయ్యవి ప్రమాణములు గాఁజాలవు; ఈ మున్నగు విషయములు స్మృత్యధికరణమున శ్రీశంకరభగవత్పాదాద్యాచార్య

పురుషు లందఱు ఏకగ్రీవముగ సిద్ధాంతీకరించిరి. దానం జేసి పై స్మృత్యాచారములు రెంటికిని మూలభూతంబు లగు శ్రుతు లున్నప్పుడే యవి ప్రమాణములు గాఁగలవు. లేనిచోఁ గానేరవు. ఇచ్చట రెండును విరోధించు చున్నటులుఁ గాన్పించుటచే మూలశ్రుతులుఁగూడ విరోధించునని చెప్పుటకు వీలులేదు. "ఉదితే జుహోతి- అనుదితే జుహోతి" ఇత్యాదిపరస్పరవిరోధశ్రుతులు గన్పడునేని అయ్యవి వికల్పసాధకము లని జైమిని మతానుసారముగ వేదవిదులు సిద్ధాంత మొనర్చి యున్నారు. అట్టి న్యాయము ననుసరించి యిచ్చటఁ గూడ వికల్పము సాధింతుముగాక యన్న "సామవేదః స్మృతః పిత్ర్యః తస్మా త్తస్యాశుచి ర్ధ్వనిః" అని యుండి శంకోక్తిచేఁ దద్వ్యతిరిక్తమగు భావమును బ్రతిపాదించెడి శ్రుతివాక్యము ననుమానించి తన్మూలముగ వికల్పమును సాధించుటకుఁ దావు లేకున్నది. ఇట్టిచో స్మృత్యాచారములు రెండును సుసమన్వితములే యని నిశ్చయించుటకు నే నీక్రింది వాక్యార్థము రచించుచున్నాఁడ, సాదరభావముతోఁ దిలకింపనగును.

మున్ముందుగ నీస్మృతివచనములకు వ్యాఖ్యాతలు రచించిన వ్యాఖ్యానము లెవ్వియో యెఱుంగఁదగి యున్నవి. మనుస్మృతికి వ్యాఖ్యానములు రచించిన పెద్దలు పలువురు గలరు. వారిలోన మేధాతిథి అతి ప్రాచీనుఁడు. వీని వ్యాఖ్యానము సర్వత్ర సర్వతోముఖముగ శోభిల్లుచున్నది. దీనిని వరవడిగఁ బెట్టికొనియే తక్కినవారు తమ తమ వ్యాఖ్యానములు అచ్చటచ్చట రుచిభేదములు గల్పించుచు విరచించియున్నారు. ఇట్టివారిలోనఁ గుల్లూకభట్టుగారి వ్యాఖ్యానము సర్వాదరణీయముగ నెగడుచున్నది. నందనుఁడు అనెడి మఱియొక వ్యాఖ్యాతగారి వ్యాఖ్యానముఁగూడ నే నిందు పొందుపరచుచున్నాఁడను:

౧౨౩ శ్లో.

మేధా. "ఋగ్యజుషీ సామధ్వనౌ శ్రూయమాణే నాధీయీత. ఋగ్వేదయజుర్వేదబ్రాహ్మణయో రప్రతిషేధః. పంచవింశేచ శ్రూయమాణఋగ్యజుషోరపి అయం ప్రతిషేధః. వేదస్య అంతో, యత్ర వేదః సమాప్తిముపైతి మంత్రాంతః బ్రాహ్మణాంతశ్చ. ఆరణ్యకో నామ వేదైకదేశః. త మధీత్య, అన్యో గ్రంథః నాఽధ్యేతవ్యః."

కుల్లూ. "సామధ్వనౌ చ శ్రూయమాణే ఋగ్యజుషే కదాచి దధ్యయనం నకుర్యాత్. వేదంచ సమాప్య, ఆరణ్యకాఖ్యంచ వేదైకదేశ మధీత్య, తద హోరాత్రే వేదాంతరం నాధీయీత."

నంద. "సామధ్వనౌ సామగానే. సామాధీత్య తత్క్షణ ఏవ ఋగ్యజుషీ నాధీయీత. కదాచన ఆపద్యపి. అధ్యాయకాలేఽపి వేదస్యాంతం ఉపనిషదం ఆరణ్యకం మశ్వకేతుకంచ అధీత్య తత్క్షణ ఏవ ఋగ్యజుషీ నాధీయీత."

౧౨౪ శ్లో.

"సామధ్వనా ఋగ్యజుషో రనాధ్యాయ ఉక్తః. తత్రాయ మర్థవాదః. దేవా దేవతా అస్యేతి దేవదైవత్యః. దేవతాస్తుతిపర ఇత్యర్థః. ఋచః ప్రాయేణ స్తుతిప్రధానాః. అత ఉక్తం దేవదైవత్య ఇతి. మనుష్యాణాం కర్మప్రధానత్వాత్, యజుర్వేదేచ కర్మణాం బాహుళ్యోపదేశాత్. ఏతేన సామ్యేన యజుర్వేదో మానుష ఇత్యుచ్యతే. మానుషశబ్దః మనుష్యజాతివచనః. అభేదాధ్యాసాత్ యజుర్వేదో మానుష ఇత్యుక్తం. పిత్ర్యః పితృభ్యో హితః, పితరోవా దేవతా అస్యేతి యథాకథంచిత్ పితృశబ్దసంబంధేన శ్రూయతే. త్రయో లోకాః, తేషాం త్రయ ఏవ అధిష్ఠాతారః- దివో దేవతాః, భూమే ర్మనుష్యా, అంతరిక్షస్య పితరః. ఏవం త్రయో వేదాః. ద్వయో ర్దేవమనుష్య సంబంధోక్తత్వాత్ పారిశేష్యాత్ పిత్ర్య స్సామవేదః. తస్య అశుచి ర్ధ్వనిః. నాఽత్ర తదీయస్య ధ్వనే రశుచిత్వం పరమార్థతో విజ్ఞేయం. కిం తర్హి-యథాఽశుచిసన్నిధానే నాఽధ్యేతవ్యం, ఏవం తత్సన్నిధానే ఇతి సామాన్య మశుచిత్వాలంబనం. అయంచ అధ్యయనవిధౌ ప్రకరణాత్ సామ్ని గీయమానే ఋగ్యజుషోః ప్రతిషేధో న యజ్ఞప్రయోగే."

కుల్లూ. "సామగానశ్రుతౌ ఋగ్యజుషో రనాధ్యాయ ఉక్తః. తస్యాయ మనువాదః. ఋగ్వేదో

దివమేవ దేవతా అస్యేతి దేవదైవత్యః. యజుర్వేదో మానుషః, మానుష దేవతాకత్వాత్. ప్రాయేణ మానుష కర్మోపదేశా ద్వా మానుషః. సామవేదః పితృదేవతాకత్వాత్ పిత్ర్యః. పితృకర్మ కృత్వా జలోపస్పర్శనం స్మరంతి. తస్మాత్తస్య అశుచిరివ ధ్వనిః — నతు అశుచి రేవ. తస్మిన్ శ్రూయమాణే ఋగ్యజుషీ నాధీయాత."

ఈ వ్యాఖ్యానముల సంగ్రహార్థ మేమనిన —

౧౨౩ శ్లో. సామగానము వినిపించుచుండఁగా ఋగ్యజుస్సు లధ్యయన మొనర్పఁదగదు. ఋగ్వేద యజుర్వేద బ్రాహ్మణముల కీప్రతిషేధము లేదు. వేదసమాప్తిని బఠించి, అనఁగా మంత్రబ్రాహ్మణాంత ములఁ బఠించియుఁ, అథవా ఉపనిషత్తులఁ బఠించియు, వారణ్యక మను వేదైకదేశమును బఠించియు నా యహోరాత్రమందు వేదాంతరము నధ్యయన మొనర్ప రాదు.

౧౨౪ శ్లో. ఈ శ్లోకార్థము వెనుకటి శ్లోక ములోఁ గల విధితో నేకవాక్యముగ నన్వయింపఁదగు నను వాదరూప మగు నర్థవాదము; అనఁగా వెనుకటి శ్లోకములోని ‘సామగానమును వినుచుండఁగా ఋగ్యజుస్సు లధ్యయనమొనర్పఁ దగదు’ అనియెడి నిషేధము నుపపత్తిపూర్వముగ విశేషించునది యీ శ్లోకార్థమని తాత్పర్యము. ఉపపత్తి యెట్టి దనిన — ఋగ్వేదము దేవదైవత్యము, అనఁగా దేవదేవతాకము; యజుర్వేదము మానుషము; సామవేదము పిత్ర్యము. దానం జేసి సామధ్వని యశుచి యగుచున్నదికాన నట్టి నిషేధము ప్రవర్తిల్లెడిని. దేవదైవత్యము, మానుషము, పిత్ర్యము అను శబ్దములు తద్ధితవృత్తిచే నగు శబ్దరూపములు; తత్తత్సంబంధద్యోతకములు. ఋగ్వేదములోని మంత్రములు ప్రాయికముగా దేవతాస్తుతిపరంబు లగుటంబట్టి ఋగ్వేదము దేవదైవత్య మనియు, మనుష్యు లొనర్పఁ దగిన కర్మబాహుళ్యము యజుర్వేద ముపదేశించుటం జేసి యజుర్వేదము మానుషము, అనఁగా మనుష్య సంబంధి యగుచున్న దనియు, నిఁక సామవేదము పిత్ర్య మనఁగా నేమి యనిన: ద్యులోకాంతరిక్ష లోక భూలోకములు మూఁడు. వాని కధిష్ఠాతలు క్రమముగా దేవతలు, పితరులు, మనుష్యులు అను ముప్పురగుచున్నారు. ఋగ్యజుస్సులు దేవమనుష్య సంబంధములుగఁ జెప్పఁబడుటచే మిగిలిన సామవేదము పారిశేష్యమనెడి కల్పిత సంబంధముచేఁ బిత్ర్యముగఁ జెప్పఁబడుచున్నది. అందువలన సామగానము పరమార్థతః యశుచి గానేర దనియు, నశుచిసన్నిధానమున నధ్యయన మొనర్పఁదగ దనియెడి సాదృశ్యము ననుసరించి యశుచిగా వాకొనఁబడుచున్న దనియుఁ దాత్పర్యము. ఇట్టి నిషేధమైనను ప్రకరణబలమున నధ్యయనమునకే కాని యజ్ఞప్రయోగమందు వర్తింపదు.

ఈపైన వివరించిన శ్లోకార్థము మేధాతిథి వ్యాఖ్యానము ననుసరించి వ్రాయఁబడినది. కుల్లూకభట్టు వ్యాఖ్యానము మేధాతిథివ్యాఖ్యానమున కగు సంగ్రహముగ మాత్రమే పొడఁగట్టుచున్నది. కాని స్వతంత్రములగు విశేషభావము లందేమియుఁ గన్పింపవు. అయితే దేవదైవత్య మన్న దేవదేవతాక మనియు, మానుషమనిన మానుషదేవతాక మనియుఁ, బిత్ర్య మనఁగాఁ బితృదేవతాక మనియు శబ్దార్థవివరణ మొనర్చినాఁడు. దేవదేవతాకము, మానుషదేవతాకము అను శబ్దముల కర్థము మేధాతిథి ననుసరించియే వ్రాయుచున్నాఁడు. కాని పితృదేవతాక మన్న నేమో తన యభిప్రాయము వివరింపలేదు. మాన మంగీకారసూచక మనెడి న్యాయము ననుసరించి యిచ్చటఁ గూడ మేధాతిథి వ్యాఖ్యానము ననుసరించినట్లే యెంచఁదగును. లేకున్నఁ బితృదేవతాకత్వ మనినఁ బితృదేవతాధిష్ఠాతృత్వమా, తత్స్తుతిపరత్వమా, లేక తద్ద్రష్టృత్వమా యని వికల్పములు గల్పించి వాని భావ మన్వేషింపఁదగును. ఈ ముందు వివరింపఁబోవుదానిని బట్టి ద్రష్టృత్వాఽధిష్ఠాతృత్వము లేమాత్రమును బొసఁగ నేరవు. ఇఁక స్తుతిపరత్వమయినను ఋగ్వేదము దేవదైవత్య మనుచోఁ బ్రాయశః దేవతాస్తుతిపర మను లాగున, సామవేదము ప్రాయశః పితృదేవతాస్తుతిపర మని సాధించుటకుఁ దగియుండలేదు. ఋగ్యజుస్సామ వేదములు మూఁటియందుఁ గూడఁ బితృశ్రాద్ధాదికర్మల కుపయుక్తములగు మంత్రము లుండియే తీరునుగాన నీ పక్షమున మూఁడువేదములను బిత్ర్యములని చెప్ప వలసియుండును. అట్టిచో సామవేద మొక్కటియే

పిత్ర్యమని చెప్పవీలులేదు. కాన మేధాతిథివ్యాఖ్యానమే యత్యంతా౽నవద్యమై పరమమూర్ధన్య మగుచున్నది.

ఇట్టి మేధాతిథివ్యాఖ్యానము బహుగంభీరమై విరాజిల్లుచున్నది. దాని గాంభీర్యమును దిలకింపవలె నన్న ముందుగ వేదమన్న నేమో, దేవమనుష్యపితృ శబ్దవాచ్యు లెవరో యన్నగు విషయము లవధరింపఁ దగియున్నది.

(౧) "తత్ర ధర్మబ్రహ్మప్రతిపాదకం అపౌరుషేయం ప్రమాణవాక్యం వేదః" (ప్ర. ఖే.)

(౨) "అరే౽స్య మహతో భూతస్య నిశ్వసిత మేత ద్య దృగ్వేదో యజుర్వేద స్సామవేదో౽థర్వాంగిరసః" (బృ. vi. v. ii)

(౩) "ద్వివిధో హి వేదోక్తో ధర్మః – ప్రవృత్తిలక్షణో నివృత్తిలక్షణశ్చ. జగతః స్థితికారణం, ప్రాణినాం సాక్షాదభ్యుదయనిశ్శ్రేయసహేతు ర్యః స ధర్మః. బ్రాహ్మణాద్యైః వర్ణిభి రాశ్రమిభిశ్చ శ్రేయోర్థిభి రనుష్ఠీయమానః" (శాం. గీతా. పీఠిక)

(౪) "మనుష్యాధికారిత్వాత్" (బ్ర. సూ. i. iii. ౨౫)

(౫) "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా౽నాశకేన" (బృ. vi. iv. ౨౨)

(౬) "సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్" (బ్ర. సూ. iii. iv. ౨౬)

(౭) "అతఏవ చ నిత్యత్వం" (బ్ర. సూ. i.iii.౨౯)

ఇత్యాది ప్రమాణములనుబట్టి జగద్ధితార్థమగు ప్రవృత్తి నివృత్తిరూపధర్మద్వయమును బోధించునది వేదమనియు, నయ్యది కేవల మీశ్వరకర్తృకం బగుట నపౌరుషేయ మనియుఁ బ్రత్యక్షాద్యన్యప్రమాణనిరపేక్ష మగుచు స్వతఃప్రమాణ మనెడు సంజ్ఞ నొంది నిరవద్య మగుననియుఁ, దత్తదుక్తధర్మసమస్తము శ్రేయో౽ర్థులగు చాతుర్వర్ణ్యులచే యథాధికారముగ ననుష్ఠీయమాన మగుచుఁ దమ కభ్యుదయనిశ్శ్రేయసములఁ గూర్చుటయేకాక సమస్తలోకములకును స్వాస్థ్య సంపాదన మొనర్పఁదగి తద్ద్వారమున సర్వప్రాణులకు సుఖమొనఁగూర్చునది యనియు, మఱియు నయ్యది నిత్య మనియు, ననఁగాఁ ద్రికాలముల నేకరీతి నుండునది యనియుఁ, బ్రళయకాలమున నీశ్వరతాదాత్మ్యము నొంది సృష్ట్యాదియందు "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం" ఇత్యాదివచనములఁబట్టి హిరణ్యగర్భున కుపదేశింపఁబడి యనంతరము "యుగాంతే౽ంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః, లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువా" ఇత్యాది వచనములచే మంత్రద్రష్ట లనఁబడు మహర్షులవలన నప్పటప్పట లోకమం దభివ్యక్త మగుచుండు ననియు, నయ్యది ఋగ్యజుస్సామాథర్వణంబు లనెడి విభాగము నొంది వేదచతుష్టయముగ నెఱుంగఁబడుచున్న దనియు, నిట్టి వేదచతుష్టయములోని ప్రతివేదమును బూర్వోత్తర కాండ లనియెడి విభాగము నొంది పూర్వకాండ మిష్టాపూర్తదత్తంబు లనెడి కర్మభేదముచే నలరారు ప్రవృత్తిధర్మము నుపదేశించు ననియు, నుత్తరకాండ మన్న 'జ్ఞానవైరాగ్యలక్షణం' బగు నివృత్తిధర్మము నుపదేశించు ననియు నన్నగు నంశములు గ్రహింపఁ దగును. ఇచ్చో నిష్టాపూర్తదత్తంబు లనిన నేమి యని విచారింపఁ దగును:

"అగ్నిహోత్రం తప స్సత్యం
వేదానాం చానుపాలనం,
ఆతిథ్యం వైశ్వదేవంచ ఇష్ట మిత్యభిధీయతే"

"వాపీకూపతటాకాది
దేవతాయతనానిచ,
అన్నప్రదాన మారామః
పూర్త మిత్యభిధీయతే"

"శరణాగతసంత్రాణం
భూతానాం చాప్యహింసనమ్,
బహిర్వేదిచ యద్దానం
దత్తమిత్యభిధీయతే"

తపస్సత్యాదివ్రతానుష్ఠానపూర్వకంబులగు నగ్నిహోత్రశబ్దోపలక్షితయాగాది నిత్యనైమిత్తిక కామ్య

కర్మసమస్తము ఇష్టశబ్దగ్రాహ్యమనియు, వాపీకూప తటాక నిర్మాణాది లోకహితార్థమగు కర్మజాలము పూర్తశబ్దాభిధేయ మనియు, శరణాగతత్రాణాది భూతదయాపర్యవసితంబగు కర్మబాహుళ్యము దత్తశబ్దసంజ్ఞితంబనియుఁ దాత్పర్యము.

ఇట్టి కర్మసంగ్రహము నంతను బోధించునది ప్రతివేదముయొక్క పూర్వభాగ మయ్యెను, అందగ్నిహోత్రశబ్దోపలక్షితంబగు జ్యోతిష్టోమయాగాద్యనుష్ఠానపర మగునది యత్యంతబహుళ మని యెఱుంగఁదగును. ఇట్టి జ్యోతిష్టోమయాగాదికంబు —

"త్రయస్త్రింశద్వై దేవా సోమపాః - త్రయస్త్రింశ దసోమపాః - అష్టౌ వసవః ఏకాదశ రుద్రాః ద్వాదశాదిత్యాః ప్రజాపతిశ్చ వషట్కార శ్చైతే దేవా సోమపాః - ఏకాదశ ప్రయాజాః ఏకాదశానుయాజాః ఏకాదశోపయాజా ఏతే సోమపాః పశుభాజనాః సోమేన సోమపాన్ ప్రీణాతి పశునాఽసోమపాన్" (ఐత. బ్రా. vii. అధ్యా. viii ౨౧౦)

"వస్వాదీనాం వషట్కారాంతానాం దేవానాం సోమయాగేన ప్రీతిః. సమిదాద్యా ఏకాదశ ప్రయాజదేవతాః ... బర్హిరాద్యా ఏకాదశానుయాజదేవతాః సముద్రాదయ ఏకాదశోపయాజదేవతాః ... సర్వా అపి సోమపానవర్జితాః పశుమేవ భజంతే." (సా. భా)

ఇత్యాది ప్రమాణములవలన నింద్రాదిదేవతాప్రీత్యర్థమగునది యనియు,

"ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహుః- అథో దివ్యః సుపర్ణో గరుత్మాన్ - ఏకం సద్విప్రా బహుధా వదంతి - అగ్నిం యమం మాతరిశ్వాన మాహుః" (శ్రుతి)

"యద్యపీంద్రాదయః తత్రతత్ర హూయంతే తథాపి పరమేశ్వరస్యైవ ఇంద్రాదిరూపేణాఽవస్థానాత్" (సా. భా. ఋ. టీక)

ఇత్యాదివచనములంబట్టి పరమేశ్వర ప్రీత్యర్థమయ్యెడి దనియు నవధార్యము.

ఇఁక తైత్తిరీయస్వాధ్యాయబ్రాహ్మణమందును, దదుపనిషత్తులోని యానుశాసనానువాకమందును బఠింపఁబడిన దేవయజ్ఞాదిపంచకములో సమామ్నాతమగు పితృయజ్ఞముచే ననుష్ఠేయముగ విధింపఁబడినది పితృదేవతాకంబగు శ్రాద్ధాదికర్మను బోధించెడిని. అట్టి పైతృకకర్మపరంబగు వేదభాగము ప్రతివేదమందును నుండిరే తీరునుగాని యయ్యది స్వల్పంబుగ నుండునుగాని బహుళంబుగ నుండ నేరదని వెన్క వివరించిన దానినిబట్టి స్పష్టముగాఁగలదు.

ఈ పైవాక్యార్థమువలనఁ దేలిన దేమనఁగా—

(౧) వేదచతుష్టయము పరమేశ్వరనిశ్వసితము- హిరణ్యగర్భాధిష్ఠితము – మహర్షిదృష్టము.

(౨) అయ్యది ప్రవృత్తి నివృత్తిరూప ధర్మద్వయబోధకము.

(౩) అట్టి ధర్మద్వయము ప్రాయశః మనుష్యాధికృతము. అనఁగాఁ జాతుర్వర్ణ్యజనులచే యథాశాస్త్రముగను, యథాధికారముగను ననుష్ఠేయ మగునది. 'ప్రాయశః' అనుటచే శాస్త్రోక్తరీతి ననుసరించి యితరులుగూడ ననుష్ఠింపఁదగినది ధర్మలేశ మున్నదని భావము.

(౪) ప్రవృత్తిరూప ధర్మబోధకం బగునది వేద చతుష్టయములోని పూర్వభాగ మనియు, నయ్యది "సచ మంత్ర బ్రాహ్మణాత్మకః" అనెడి లక్షణముచే ద్విధా భిన్న మగుచున్న దనియు,

"తత్ర మంత్రా అనుష్ఠానకారక భూత ద్రవ్య దేవతాప్రకాశాః" (ప్ర. భే.)

"మంత్ర బ్రాహ్మణాత్మకే వేదే బ్రాహ్మణస్య మంత్ర వ్యాఖ్యానోపయోగిత్వాత్" (సా. భా. ఋ. పీ.)

ఇత్యాది వచనములచే మంత్రములు దేవతాది ప్రకాశనపరము లనియు, బ్రాహ్మణము విధ్యర్థవాదాత్మకమై మంత్రవ్యాఖ్యానోపయోగి యనియు నెఱుంగఁదగును.

(౫) అట్టి ప్రవృత్తిరూప ధర్మబోధకంబగు పూర్వభాగమందు నింద్రాదిదేవతా ప్రీత్యర్థమగు యాగాదిని బోధించెడు భాగము బహుళముగా నున్నది.

పితృదేవతాప్రీత్యర్థ మగు శ్రాద్ధాదుల బోధించెడు భాగము బహుస్వల్పము.

ఈ పైన వివరించిన వాక్యార్థము పట్టున నీక్రింది ప్రమాణవచనములుగూడ నవధరింపఁదగును:

(౧) " తస్మా ద్యజ్ఞా త్సర్వహుతః - ఋచ స్సామాని జజ్ఞిరే - ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ - యజు స్తస్మా దజాయత " (శ్రుతి)

(౨) " త్రయో వేదా అజాయంత. ఋగ్వేద ఏవ అగ్నే రజాయత, యజుర్వేదో వాయోః, సామ వేద ఆదిత్యాత్." (ఐత. బ్రా.)

(౩) " ఋగ్యజుస్సామాథర్వాణ శ్చత్వారో వేదాః " (ఛా. ఉ)

(౪) " తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః " (ముం. ఉ.)

ఇత్యాది శ్రుతులందుఁ గొన్ని శ్రుతులు వేదములు నాల్గనియుఁ, గొన్ని మూఁడనియుఁ జాటుచున్నవి. అదిగాక త్రయీశబ్దము రూఢిచే వేదపరముగ నున్నది. అట్టిశబ్దము వ్యుత్పత్తిచే ఋగ్యజుస్సామంబుల మూఁటినే సూచించుచున్నట్లు గ్రహింపనగుచున్నది. ఇట్టిచో సమన్వయ మెటులనిన —

(౧) " త్రైవిధ్యంతు వేదగత మంత్రాభిప్రాయం" (సా. భా. సామ. పీ.)

(౨) " త్రిష్వేవచ వేదేషు అంతర్భూతోఽథర్వవేదః " (ఆనం. బృ. v. i. ౨.)

ఇత్యాది వచనములనుబట్టి యథర్వవేదము ప్రత్యేకవేదముగ నెన్నఁబడునపుడు వేదచతుష్టయము గను, వేదత్రయాంతర్భూతముగ నెన్నఁబడునపుడు వేదత్రయముగను సమన్వయించుకొనగును. అటులగునేని యథర్వవేదముయొక్క ప్రయోజన మేమని యడుగం దగును. ఈ విషయము ముందు వివరింపఁబడును.

వేదముయొక్క పూర్వభాగము కర్మప్రతిపాదక మన్నదేమో ఇంతవఱకు సంగ్రహముగ వివరింపఁబడినది. ఇఁక పశ్చిమభాగమన్నచో నుపనిషచ్ఛబ్దవాచ్యమై సగుణనిర్గుణ బ్రహ్మతదుపాసనాది ప్రతిపాదకమై యలరారెడిదని చెప్పిన నిప్పట్టునఁ జాలునని తద్వివరణమునుండి విరమించువాఁడను. " నేయం బ్రహ్మవిద్యా ఉపనిషచ్ఛబ్దవాచ్యా. తత్పరాణాం సహేతో స్సంసారస్య అత్యంతావసాదనాత్. ఉప నిపూర్వస్య సదేః తదర్థత్వాత్. తాదర్థ్యాత్ గ్రంథోఽప్యుపనిష దుచ్యతే" (శా. బృ. భా. పీ.) ఇత్యాది వాక్యము లిచ్చో నవధేయములు.

ప్రకృతవిషయము "స్వాధ్యాయోఽధ్యేతవ్యః", "స్వాధ్యాయా న్మా ప్రమదః" ఇత్యాదివిధిప్రాప్తమైన స్వాధ్యాయాఽధ్యయనవిశేషపర మైనందునను, స్వాధ్యాయాఽధ్యయనము కర్తవ్యైకదేశమయినందునను ఏతన్నిషేధపరమగు మనుస్మృతివాక్యార్థము వేదచతుష్టయ - అథవా వేదత్రయస్వరూపప్రయోగాది వివరణపురస్సరంబుగనే విమర్శింపనగును. అందు వేదప్రయోగాదికమునుగూర్చి ముచ్చటించువాఁడ నవధారుఁడు:

(౧) "నను యజ్ఞం వ్యాఖ్యాస్యామః—స త్రిభి ర్వేదై ర్విధీయతే (సత్యా. i - ౧) ఇతి స్మరణాత్ ఋగ్యజుస్సామ్నామేవ ఫలవత్కర్మశేషత్వ మవసీయతే............ అస్య (అథర్వవేదస్య) తు త్రయీవ్యతిరిక్తస్య కర్మశేషత్వాఽభావాత్ న వ్యాఖ్యానార్హతా ......... అత్రోచ్యతే – ఋగ్వేదేన హౌత్రమేవ ప్రతిపాద్యతే, యజుషా ఆధ్వర్యవం, సామ్నా ఔద్గాత్రం – ఇతి వేదత్రయస్య ప్రతినియత ప్రయోగప్రతిపాదనపరత్వాత్ అవశిష్టబ్రహ్మకర్తవ్యతా ప్రతిపాదక శ్చతుర్థో వేదో వ్యాఖ్యేయః – తదభావే యజ్ఞశరీరస్య అనిష్పత్తేరితి" .. "మైవం — 'ఋగ్వేదేన హోతా కరోతి, సామవేదే నోద్గాతా, యజుర్వేదేన అధ్వర్యుః, సర్వై ర్బ్రహ్మే' ఇత్యతః చతుర్ణాం ఋత్విజాం అపేక్షితస్య క్రియాకలాపస్య త్రయ్యా ఏవ సిద్ధత్వాత్ న చతుర్థస్య వేదస్య ఆకాంక్షాఽస్తి... అత్రోచ్యతే — హౌత్ర మాధ్వర్యవ మౌద్గాత్ర మితి సమాఖ్యయా త్రయాణామపి వేదానాం ప్రతినియత హౌత్రాదికర్తవ్యప్రతిపాదనపరత్వావగమాత్ న బ్రహ్మకర్తవ్యప్రతిపాదనే తాత్పర్యం భవతి" (సా. భా. అథ. పీ.)

(౨) "అర్థజ్ఞానస్యతు యజ్ఞానుష్ఠానార్థత్వాత్ తత్రతు యజుర్వేదస్యైవ ప్రధానత్వాత్ తద్వ్యాఖ్యాన మాదౌ యుక్తం ... ఏవంసతి అధ్వర్యుసంబంధిని యజుర్వేదే నిష్పన్నం యజ్ఞశరీర ముపజీవ్య తదపేక్షితా స్తోత్రశస్త్రరూపౌ అవయవౌ ఇతరేణ వేదద్వయేన పూర్యేతే ఇతి ఉపజీవ్యస్య యజుర్వేదస్య ప్రథమతః వ్యాఖ్యానం యుక్తం. తత ఊర్ధ్వం సామ్నాం ఋగాశ్రితత్వాత్ ఉభయోర్మధ్యే – ఇతీదానీం వ్యాఖ్యాయతే" (సా. భా. ఋగ్వే. పీ.)

కర్మకాండాత్మకమగు వేదత్రయము, అథవా వేదచతుష్టయము యజ్ఞశరీర నిష్పత్త్యర్థ మనియు, వనఁగా యాగాద్యనుష్ఠాననిర్వాహక మనియు, నట్టి యనుష్ఠాన విషయమున "తస్య యజురేవ శిరః" ఇత్యాదివచనరీతిచే యజుర్వేదము శిరస్థానీయ మనియు, ఋక్సామంబు లవయవస్థానీయము లనియు, నట్టియజ్ఞమునందు యజ్ఞకర్తయగు యజమానితోఁబాటు హోత, అధ్వర్యుఁడు, ఉద్గాత, బ్రహ్మ యను నల్వురు ఋత్విక్కులు యజ్ఞాంగములుగఁ బ్రవర్తించుచుందు రనియు, యజుర్వేదముచే నధ్వర్యుఁ డాధ్వర్యవమును, ఋగ్వేదముచే హోత హౌత్రమును, సామవేదముచే నుద్గాత యౌద్గాత్రమును, సర్వవేదములచేతను, ముఖ్యముగా నథర్వవేదముచే బ్రహ్మ బ్రహ్మత్వమును నిర్వర్తించుచుందు రనియు నీపైన వివరించినదానినిబట్టి గ్రహింపఁదగును. మఱియు నిట్టి యాగాద్యనుష్ఠానము ఇంద్రాదిదేవతా ప్రీత్యర్థ మగుచుఁ దద్ద్వారమునఁ బరమేశ్వరప్రీత్యర్థమై శ్రేయఃపరంపరాప్రాపక మగుచుండుననియు స్మరింపనగును. "సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః" ఇత్యాదిగీతాప్రకరణము ఈ పైవిషయమునే బోధించుచున్నది. ఇదియ దేవయజ్ఞము. యజ్ఞశబ్దము రూఢిచే నీదేవయజ్ఞబోధకమే, కాని గౌణీవృత్తిచే బ్రహ్మయజ్ఞాదీతరమనుష్యాధికృతసమస్త శ్రౌతస్మార్తకర్మపరముగను, జ్ఞానపరముగనుగూడ నతిదేశమొనర్పఁబడుచున్నది. ఈవిషయము భగవద్గీతా చతుర్థాధ్యాయమున భగవద్వాక్యముల విస్తరింపఁబడినది. అట్టి యతిదేశము స్వాధ్యాయబ్రాహ్మణమును బట్టియు, బృహదారణ్యాద్యుపనిషచ్ఛ్రుతిపాదనములఁ బట్టియు సంభవించుచున్న దని గ్రహింపఁదగును.

ఈవివేచనము ప్రాసంగికముగఁ బ్రాప్తించినది. వేదత్రయము దేవయజ్ఞశేషమని నిశ్చయించుటయే ప్రకృతాధికరణసారము. ఇట్టి యజ్ఞసమస్తము యథాధికారముగ ద్విజులచే ననుష్ఠేయమనియు, నింద్రాది దేవతాధిష్ఠిత మనియు, హోత్రాదిఋత్విక్ప్రయోక్తం బనియు నుక్తార్థసారసంగ్రహముగ గ్రహింపఁదగును.



# శ్రీ తల్లాప్రగడ సుబ్బారావుగారు

భారత దేశమున రాజకీయములందును, సంఘసంస్కారమునందును, మతవిషయములందును, చరిత్రపరిశోధనలందును తరువాత కలిగిన వికాసమునకును, జాతీయ చైతన్యమునకును దారితీసిన ఆంధ్రమహాపురుషుని జీవితగాథ

● శ్రీ దిగవల్లి వెంకటశివరావు ●

బ్రహ్మశ్రీ తల్లాప్రగడ సుబ్బారావుపంతులుగారు గడచిన శతాబ్దాంతమున చెన్నపట్టణమున నుండి పేరుపొందిన ఆంధ్రమహాపురుషుడు. కీర్తిశేషులగు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు వీరి గొప్పదనమును ఎరిగినవారగుటచే ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు ప్రకటించుట ప్రారంభించిన రెండవ యేట-౧౯౧౧ లో ప్రకటించిన ఆంధ్రప్రముఖుల చిత్తరువులలో వీరి పటముకూడ చేర్చినారు.

శ్రీ సుబ్బారావుగారి రూపపటము యొకటి అడయారులో దివ్యజ్ఞానసమాజభవనమున నున్నది.

సుబ్బారావుపంతులుగారు తమ ముప్పదినాలుగవయేట చెన్నపట్టణములో ౧౮౯౦-వ సంవత్సరము జూను ౨౪-వ తేదీన దేహము చాలించినారు. ఇంత చిన్నవయస్సులోనే సుప్రసిద్ధన్యాయవాది యనియు, గొప్ప సంస్కృతవిద్వాంసు డనియు, బ్రహ్మవిద్యాపారంగతు డనియు, అత్యద్భుత మేధాసంపన్ను డనియు, మహావక్త యనియు తమ సమకాలికులై ఆనాడు చెన్నపట్టణమున మహామహులుగా నుండిన సర్ టి. మాధవరావు, దివాన్‌బహద్దరు ఆర్. రఘునాథరావు, కర్నల్ ఆల్కాటు, మడాం బ్లావట్‌స్కీ మొదలగువారివలన మన్ననల నందినారు. ఈయనప్రతిభ నెరిగిన ఆల్కాటుగారును, సర్ ఎస్. సుబ్రహ్మణ్యఅయ్యరుగారును, సర్ పి. ఎస్. శివస్వామి అయ్యరుగారు మొదలగువారును ఈయన గొప్పదనమును గూర్చి కొన్ని గ్రంథములలో వ్రాసిన సంగతులు తప్ప ఈయనజీవితచరిత్ర సంగ్రహముగా నైనను ఇంతవరకు నెచ్చటను ప్రకటింపబడకపోవుట విచారకరము.

౧౮౯౦-వ సంవత్సరము మొదలు శ్రీ సుబ్బారావుగారి నిర్యాణమువరకును ఈయనదగ్గరనే యుండి కాలేజీలో చదువుకొనుచుండిన వీరి మేనమామ కొమారుడును, ఇటీవల పుదుక్కోట్టై స్టేటులో దివానుగానుండి కొలువు చాలించుకొన్నవారును, మా అన్నగారు నైన కీ. శే. శ్రీ దిగవల్లి తిమ్మరాజుపంతులుగారికి వీరి జీవిత విశేషములనేకములు తెలిసియున్నందున వీరి జీవితమును సమగ్రముగా వ్రాయుమని నే నేనోమారులు వారిని కోరియుంటిని. అలాగుననే చేయుదుమని యనుచుండిరి కాని వ్రాయరైరి. ఇంతలో శ్రీ సుబ్బారావుగారి సుప్రసిద్ధగ్రంథమగు భగవద్గీతోపన్యాసములను ఇంగ్లీషునుండి తెనుగులోనికి కనువదించి ప్రకటించు సందర్భమున మాఅన్నగారు శ్రీ సుబ్బారావుగారి జీవిత సంగ్రహము నొకదానిని వ్రాసిరిగాని పుస్తకము ప్రకటించునప్పుడు సుబ్బారావుగారినిగురించి ఇంగ్లీషులో ఇతరులు వ్రాసియున్న సంగతులకు తెనుగుతర్జుమా చేర్చుచున్నందున ఈజీవితసంగ్రహము చేర్చుట అనవసరమని తలచి యుపేక్షించి ఆ జీవితసంగ్రహపు చిత్తులనుకూడ వారెక్కడనో పడవేసిరి. ఇంతలో వారు ౧౯౩౬-వ సంవత్సరము మే ౨-వ తేదీన దివంగతులగుట వలన ఆకాగితము లెక్కడ నున్నవో తెలియుటకైన

అవకాశము చిక్కలేదు. ఇట్టిస్థితిలో ఇటీవల మాకుటుంబము యొక్క పాతగ్రంథ సముదాయము, కాగితములు, కవిలెలు వెదకుచుండగా మా అన్నగారు రచియించిన పుస్తకముయొక్క మొదటి చిత్తులును, ఈ జీవితసంగ్రహము యొక్క చిత్తులు రెండును కనబడినవి. అందొకదానియందు లేనివి రెండవదానియందు కొన్ని కొన్ని విశేషము లుండుటవలన వానిని సమన్వయము చేసి నేను సమకూర్చిన మరికొన్ని విషయములను జేర్చి యీ జీవితసంగ్రహము నిప్పుడు ప్రకటించుచున్నాను.

* "శ్రీ తల్లాప్రగడ సుబ్బారావుపంతులుగారు నాకు మేనత్తకుమారుడును, తోబుట్టువు వెనిమిటియు నై యుండిరి. నేను ౧౮౭౦-వ సంవత్సరము మొదలుకొని వారు స్వర్గస్థులగునంతవరకును వారివద్ద మద్రాసులోనుండి విద్యాభ్యాసము నొందితిని. వారి జీవితములోని ముఖ్యాంశములనుసరించి నే నెరిగియున్నంతవరకు నిక్కడ వ్రాయుచున్నాను.

శ్రీ సుబ్బారావుపంతులుగారు నలనామ సంవత్సర ఆషాఢశుద్ధ ౮ ఆదివారము రాత్రి ౭ గంటలకు, అనగా క్రీ. శ. ౧౮౫౬-వ సం. జూలై ౬-వ తేదీ రాత్రి గోదావరిజిల్లా కాకినాడ గ్రామమున జన్మించిరి. వారి తండ్రిగారి పేరు వీరవెంకటనారాయణగారు; తల్లిగారిపేరు వేంకటమాణిక్యాంబగారు. వారి పెదతండ్రిగారు తల్లాప్రగడ వేంకట నృసింహారావుగారు ఇప్పటికి పడమటి గోదావరిజిల్లాలో చేరిన యర్నగూడెంతాలూకా దొమ్మేరు గ్రామమునకు మిరాసీదారును, కరణము నై యుండిరి. సుబ్బారావుపంతులుగారి మాతామహుడు కాకినాడ కాపురస్థులు దిగవల్లి తిమ్మరాజుపంతులుగారు. వీరు కుంఫిణీప్రభుత్వమున అనేకోద్యోగములు చేసి ఉపకారవేతన మందునాటికి రాజమహేంద్రవరముజిల్లా కలెక్టరుఆఫీసులో హుజూరుశిరస్తాదారుగా నుండెడివారు(వీరు ౧౮౫౬-వ సంవత్సరము ఫిబ్రవరి ౯-వ తేదీన స్వర్గస్థులైనారు). వీరవెంకటనారాయణగారు అత్తవారి యింటివద్దనే యుండెడివారు. సుబ్బారావుపంతులుగారు జన్మించిన కొద్దికాలమునకే ౧౮౫౭-వ సం. ఫిబ్రవరి ౨౨-వ తేదీని కాకినాడ గ్రామములోనే తండ్రి వీరవెంకటనారాయణగారు స్వర్గస్థులైరి. మాతామహుడు దిగవల్లి తిమ్మరాజుపంతులుగారికి ఇద్దరు కుమాళ్లు. వారి పేర్లు వేంకటశివరావు, వేంకటరత్నంగార్లు. వారిలో వేంకటరత్నముగారు మా తండ్రిగారు. వేంకటశివరావుపంతులుగారు పిఠాపురం యెస్టేటులో దివానుగా నుండెడివారు. వేంకటరత్నముగారు మేజస్ట్రేటు ఉద్యోగము చేసిరి. సుబ్బారావుపంతులుగారు బాల్యదశలో మేనమామల సంరక్షణలో నుండి విద్యాభ్యాసము చేసిరి.

సుబ్బారావుగారు బాల్యదశలో దుందుడుకుగా నుండి చాల అల్లరిపనులు చేయుచుండెడి వారని వారి తల్లిగారు చెప్పుచుండిరి. వారికి బాల్యదశలోనే, యనగా ౧౮౬౫-వ సం. (క్రోధన)లో ప్రథమవివాహము జరిగెను గాని ఆ ప్రథమభార్య కలరాజాడ్యమున ౧౮౬౬-వ సం. జూను ౮-వ తేదీని చనిపోయెను.

మూడుసంవత్సరముల తరువాత పంతులవారు మేనమామగారి కుటుంబముతోను, తల్లిగారితోను (౧౮౬౯ డిశంబరు ౧౪-వ తేదీని) కాశీయాత్రకు బయలుదేరి, ౧౮౭౦-వ సంవత్సరము మార్చిలో కాశీ చేరిరి. కాశీలో నుండగా నొకదినము ఉదయము కొన్ని గంటలకాలము వారు కనుపింప లేదనియు, ఆకాలములో వారు దిగంబరిగానున్న సన్యాసినొకరిని దర్శించి వచ్చినట్లును మా కుటుంబములో వాడుకగలదు. వారికి వయస్సువచ్చినవెనుక తాను పూర్వజన్మమున కాశీనివాసస్థుడననియు, తనబాల్యములో కాశీకి వెళ్లినప్పుడు అక్కడ కొన్నిస్థలములలో పూర్వపరిచయ ముండినట్లు తనకు గనిపించెననియు వారు చెప్పుచుండెడివారు (౧౮౭౦-వ సం. జూనునెలలో కాశీనుండి కాకినాడ చేరిరి).

సుబ్బారావు పంతులుగారు కాకినాడ గ్రామములో నున్న హిందూ హైస్కూలునందు చదువుకొనిరి. వారు మూడవతరగతిలో నుండగా వారి విద్యాబుద్ధులను బరీక్షించి, యాకాలమునందా పాఠశాలకు

* ఇది మా అన్నగారైన శ్రీ దిగవల్లి తిమ్మరాజు పంతులుగారు రచించిన భాగము.

ప్రధానోపాధ్యాయుడుగ నున్న 'కెన్నీ' (Kenny) దొరగారు వారిని మెట్రిక్యులేషన్ క్లాసులో చేర్చుకొనిరి. మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసు అయిన వెనుక మద్రాసుకు తనతల్లిగారితో వచ్చి తిరువళిక్కేణిలో కాపురముండి ప్రెసిడెన్సీకాలేజీలో ప్రవేశించి ౧౮౭౬-వ సం.లో బి.ఏ. పరీక్షలో ప్రెసిడెన్సీకి అగ్రగణ్యులుగ నుత్తీర్ణులైరి. వారధ్యయనముచేసిన ప్రతి శాస్త్రమువందును 'ప్రొఫిషెంటు', అనగా ప్రవీణుడని యోగ్యతాపత్రికలను, బహుమతులను ఇచ్చిరి. అప్పుడు ప్రెసిడెన్సీ కాలేజీకి యి. థాంసన్ దొరగారు ప్రిన్సిపాలుగా నుండెడివారు. క్రిస్టియన్ కాలేజీకి మిల్లరు దొరగారు ప్రిన్సిపాలుగా నుండెడివారు. క్రిస్టియన్ కాలేజీలో నున్న యొకవిద్యార్థియగు అడాలుఘస్సు అను వారికిని, సుబ్బారావుగారికిని పరీక్షలలో పోటీగా నుండెను. ఎఫ్. ఏ. లో ప్రెసిడెన్సీమొత్తమున అడాలుఘస్సుగారు మొదటివారుగను, సుబ్బారావుగారు రెండవవారుగను నుత్తీర్ణులైరి. బి. ఏ. పరీక్షలో సుబ్బారావు గారు మొదటివారుగను, అడాలుఘస్సుగారు రెండవ వారుగను నుత్తీర్ణులైరి.

బి. ఏ. పరీక్షలో కృతార్థులైన వెనుక — ౧౮౭౬-సం. మే ౧౫-వ తారీఖున వారికి రెండవ వివాహము జరిగెను. మేనమామయగు మాతండ్రి వేంకటరత్నముగారి ప్రథమపుత్రిక సుందరమ్మగారి నిచ్చి పెండ్లిచేసిరి (౧౫-౫-౧౮౭౬). వారి యద్భుతమేధాశక్తిని గనిపెట్టి యాకాలమున బరోడారాజ్యమునకు దివానుగానుండిన గా నున్న రాజా సర్ టి. మాధవరావు పంతులుగారు వారిని బరోడాకు దీసుకొనివెళ్లి నెల 1-కి రు. ౭౦౦-౦-౦ లు జీతముపైన అక్కడ ప్రధానహైకోర్టులో రిజిస్ట్రారుగా నియామకముచేసిరి. సుబ్బారావుగారు సుమారొక సంవత్సరముమాత్రము అక్కడ నుండి జ్వరపీడితులై ఆయుద్యోగమునకు రాజీనామా నిచ్చి ౧౮౭౯-వ సంవత్సరము జనవరి ౧౧-వ తేదీన మద్రాసు చేరిరి. వారు బరోడాలో నుండినప్పుడు మరాటీ గుజరాతీ భాషల నభ్యసించిరి.

మద్రాసు ప్రవేశించినవెనుక బి. యల్. పరీక్ష ప్యాసుచేసి ౧౮౭౯-వ సంవత్సరము ఏప్రిల్ ౨౩-వ తారీఖున గ్రాంటు (Grant) దొరగారి వద్ద అప్రెంటిస్‌గా ప్రవేశించి ౧౮౮౦-వ సంవత్సరములో హైకోర్టువకీలు సన్నదును బొంది హైకోర్టు న్యాయవాదిగా పనిచేయుసాగిరి. న్యాయవాదిగా పని చేయు కాలములో నూతనముగా ౧౮౮౫-వ సంవత్సరములో ఏర్పాటుకాబడిన ప్రావిన్షియల్ సివిల్ సర్వీసు పోటీపరీక్షకు వెళ్లిరి. పరీక్ష ౧౫ దినము లున్నదనగా పరీక్షకు రావలసినవారికి మద్రాసు గవర్నమెంటువారు నోటీసులు పంపిరి. ఇదియుగాక ఆపరీక్ష కదివరకెన్నడును పంతులుగారు చదవని జీయాలజీశాస్త్రము పరీక్షించు శాస్త్రములలో నొకటిగా నేర్పాటుచేసిరి. అట్లు చేసినను ఆపరీక్షలో నుత్తీర్ణులైనవారందరిలో నగ్రగణ్యులుగ జేరిరి. అయితే ఆకాలమందు మద్రాసు గవర్నమెంటువారి యనుగ్రహమునకు పాత్రులుగనున్న రాజా తుమ్మలపల్లి రామారావుపంతులుగారి కొమారుడు వరదరావు పంతులవారికి అసిస్టెంటు కలెక్టరు పదవి నిచ్చి సుబ్బారావుపంతులుగారికి డిప్యూటీ కలెక్టరు పనిగాని,సబార్డినేటుజడ్జీ పదవిగాని యిచ్చెదమని యనిరి. అందుకు పంతులుగారు అంగీకరించలేదు.

సుబ్బారావుపంతులుగారు ౧౮౯౦-వ సం. జూను మాసములో పెంఫిగస్ (pemphigus) బొబ్బల వ్యాధిపీడితులై జూను ౨౮-వ తేదీ మంగళవారం రాత్రి ౧౦ గంటలకు మద్రాసు ఎగ్మూరులో స్వర్గస్థులైరి. వారు స్వర్గస్థులగు సమయమునకు వారికి ముఖ్యస్నేహితులుగ నున్నవారు చాలమంది మద్రాసులో లేరు. హైకోర్టుశెలవుదినము లగుటచే వారు గ్రామాంతరములకు వెళ్లియుండిరి.

ఆకాలమున సిటీకోర్టు జడ్జిగానున్న పతికి శ్రీనివాసరావుపంతులుగారు సుబ్బారావుగారి మరణదినము ఉదయమున వారిని చూచుటకు వచ్చిరి. వారియెదుట తనకు సంతానము లేనందున తనభార్య దత్తతచేసుకొనుటకు అధికార మిచ్చితినని సెలవిచ్చిరి.

సుబ్బారావుపంతులుగారు చాలా దేహదార్ఢ్యము గలవారు. అద్భుతమేధాశక్తి గలిగియుండిరి. వారు సంస్కృతభాషను పాఠశాలలో నెక్కడను అభ్యసింపలేదు. అయితే సంస్కృతభాషలో నున్న సమస్త

గ్రంథములకును, ఉపనిషత్తులకును, బ్రహ్మసూత్రములకును, వానిపై భాష్యములకును అర్థము చెప్పగల సామర్థ్యమును వారు సంపాదించిరి. బి. ఏ. పరీక్ష ప్యాసుచేసిన పిదప వాల్మీకిరామాయణమునందొక కాండ పఠనము చేయుటచేత తమకు సంస్కృతభాషాజ్ఞానము గలిగినదని వారు చెప్పుచుండిరి. వారి జీవితకాలము బహుస్వల్పమగుటచే వారికిగల యద్భుతశక్తి పూర్వజన్మములలో సంపాదింపబడియుండవలయు నని మన మూహింపక తీరదు. వారికి జ్ఞాపకశక్తి అత్యధికము. వారిని ఏకసంధాగ్రాహియని మనము చెప్పవచ్చును. ఏ గ్రంథమునందున్న ఏశ్లోకమునుగాని, పద్యమునుగాని మనము చదివిన యాశ్లోకము, పద్యము ఏసందర్భమున చెప్పబడ్డదో వారు వెంటనే చెప్పుచుండెడివారు.

ప్రాతఃకాలమున శీతోదకస్నానముచేసి షుమారు రెండుగంటల కాలము దైవప్రార్థనలోను, ధ్యానములోను, సమాధిలోను నుండెడివారు. ప్రాణాయామము విశేషము చేయుచుండుట గలదు. వారి జీవితకాల మంతయు జ్ఞానార్జనముకొరకు వినియోగింపబడినదని మన మెంచవచ్చును. మద్రాసునందున్న పుస్తకభాండాగారమునుండి వివిధశాస్త్రములనుగురించిన గ్రంథములను వారు తీసుకొనివచ్చి రాత్రి షుమారు ౧౨ గంటలవరకు చదువుచుండెడివారు. ప్రకృతి శాస్త్రములను గురించి ప్రకటింపబడు మాసపత్రికల నన్నిటిని చదువుచుండెడివారు. తరుచు వారు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునకు పోయి అక్కడ తాటియాకుల పుస్తకములను చదువుచుండెడివారు. అచ్చుపడిన గ్రంథములలో ప్రక్షిప్తములున్నదీ లేనిదీ, ఆగ్రంథము లంతకు పూర్వమేలాగున నుండినదీ, ప్రక్షిప్తము లున్నచో నేకారణముచే వానిని ప్రక్షిప్తములుగ మన మెంచదగి యున్నదీ, యీయంశములను వారు శోధించుచుండిరి. కాలమెన్నడును వారు వృథాపుచ్చియుండలేదు. అనవసరమగు లోకాభిరామాయణము మాటలయందు వారి కిష్టముండునది గాదు. ప్రతిజీవుడును జ్ఞానము సంపాదించుటకు ఉత్పత్తి కాబడెనని వారు మాకు చెప్పుచుండెడివారు.

గుప్తవిద్యాసంబంధ మయిన రహస్యములను గురించి గాక తదితర శాస్త్రసంబంధమైన చర్చలలో వారు విశేషముగ మాటలాడుట గలదు. వారికి మాండూక్యోపనిషత్తునందును, గౌడపాద కారికలయందును చాల అభిమానము. తరుచు ఆ యుపనిషత్తునందున్న శ్లోకముల యర్థమునుగురించి పండితులతో వాదన చేయుచుండెడివారు. ముఖ్యముగా వారు తరుచు "నాంతఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం" అను శ్లోకమున కర్థము చెప్పుమని పండితుల కిచ్చుట కలదు.

దివ్యజ్ఞానసమాజ ప్రధానకార్యాలయము అంతకు పూర్వము బొంబాయినగరమున నుండగా దానిని మద్రాసునందు నెలకొల్పుటకు కృషిచేసినవారిలో సుబ్బారావుపంతులవారు ముఖ్యులు.

మడాం బ్లావట్‌స్కీ, కర్నలు ఆల్కాటుగార్లు మద్రాసుకు రాకపూర్వమే వారికిని, పంతులుగారికిని ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచుండెను. 'థియాసఫిస్టు' అను పత్రికకు వారు వ్యాసములు వ్రాసి పంపుచుండిరి. సమాజస్థాపకులు మద్రాసునకు 'క్లాన్ లైక మాకింటాష్' అను పేరుగల ఓడమైన వచ్చిచేరిరి. వారు ముందుగా సుబ్బారావుపంతులుగారికి తంతి నిచ్చిరి. వారిని మద్రాసు హార్బరువద్ద కలుసుకొని స్వాగత మిచ్చుటకు మద్రాసులోనున్న ప్రముఖులును, పంతులవారును, * నేనును వెళ్లితిమి. వారిని గనసెట్టు వాద్యములతో తీసికొనివచ్చి మైలాపూరులో లజ్జరోడ్డునందున్న రాజా సర్ టి. మాధవరావుగారి 'మాధవబాగు'లో విడిదిచేయించితిమి. మరికొన్ని మాసములకు అడయారులో నొక బంగాళాను పుచ్చుకొనిరి. వీరు ౧౮౮౨-వ సం. ఏప్రిల్ ౧౧ తేదీని మద్రాసు చేరిరి. పలువురు ప్రముఖులు వారిని దర్శించి గౌరవించిరి. ౨౬-౪-౧౮౮౨ తేదీని ఆల్కాటుగారు పచ్చయ్యప్ప మొదలియారు హైస్కూలు హాలులో అన్ని మతముల కును మూలమాత్ర మొక్కటే యను విషయమును గురించి ఉపన్యసించిరి. ఆ మరునాడు మరి ౨౧ మంది దివ్యజ్ఞానసమాజమున చేరిరి. అంతట ఆర్. రఘునాథ

* మా అన్నగారు.

రావుగారు అధ్యక్షుడుగను, సుబ్బారావుపంతులుగారు కార్యదర్శిగను దివ్యజ్ఞానసమాజశాఖ యేర్పడెను.

"వంగరాష్ట్రమునను, బొంబాయిలోను తెలాంగు, భండార్కరుగారివంటి విద్యాధురీణులు చాలమంది యున్నారు కాని ప్రాచీన విజ్ఞాన రహస్యములను గ్రహించుటలో తల్లాప్రగడ సుబ్బారావు గారితో సమాన ధీశక్తి కలవారు మాత్రము నాకు కనపడలేదు. ఆయన మద్రాసులో నుండుటయే మేము మా కార్యస్థానము నారాజధానిలో స్థాపించుటకు గల మూలకారణములలో నొకటి. అతడు దివంగతుడైన చని నాడుగాని మే మట్లు స్థిరపరచినందుకు చింతించుట లేదు. అడయారు ఒక భూతలస్వర్గము" అని అల్కాటు గారు 'Old Diary Leaves 2nd Series' అను గ్రంథము ౩౬౩-వ పుటలో వ్రాసివారు. ఈ పుస్తకము ౧౯౦౦-వ సంవత్సరములో ప్రకటింపబడినది. సుబ్బారావుపంతులుగారు ప్రస్థానత్రయము నాధారము చేసికొని ఒక గ్రంథమును వ్రాయవలయునని యుద్దేశించిరి గాని అది కొనసాగలేదు. వారు థియాసఫిస్టుపత్రిక కప్పుడప్పుడు వ్రాయుచుండిన వ్యాసములు, భగవద్గీతోపన్యాసములు తప్ప వారిగ్రంథము లెవ్వియు లేవు. 'థియాసఫిస్టు'కు వ్రాసిన వ్యాసములు 'ఇసోటరిక్ రైటింగ్సు' (గుప్త విద్యా సంబంధమైన వ్యాసములు) అను పేరుతో నొక పుస్తకముగా అచ్చువేయబడినవి.

స్వామి సుబ్బారావుపంతులుగారు ౧౮౮౫-౧౮౮౬ సం. లలో భగవద్గీతనుగురించి దివ్యజ్ఞానసమాజ వార్షిక సమావేశములప్పుడు ప్రసంగించిరి. ౧౮౮౫-వ సం. లో చేసిన ప్రసంగము ౧౮౮౬-వ సం. లో వారు ప్రసంగించిన నాలుగు ఉపన్యాసములకును ఉపోద్ఘాతమని వారు సెలవిచ్చిరి.

సుబ్బారావుపంతులుగారు గొప్ప సంస్కృత విద్వాంసులై వైదికమతధర్మములందును, ప్రాచీనార్య తత్త్వశాస్త్రమునందును, బౌద్ధధర్మమునందును ఈయనకు తెలియని విషయములు లేవను ప్రఖ్యాతిని బొందిరి. "ఈయన గొప్ప అద్వైత వేదాంతి. ఈతడు ఉపదేశము పొందిన బ్రహ్మజ్ఞాని యనియు, మత రహస్యములను బయలుపెట్టుటకు అంగీకరింపడనియు" బ్లావట్‌స్కీగారు పయొనీరుపత్రిక సంపాదకులగు ఎ. పి. సిన్నెటుగారికి వ్రాసిన లేఖలలో ౯౫-వ పుటలో వ్రాసివారు. బ్లావట్‌స్కీగారు వ్రాయు పుస్తకముల నాయనచే సరిచూపించుకొనువారు. ఎవ్వరి కే సందేహము వచ్చినను ఈయనవలన దీర్చుకొనుచుందురు. ఆ నాడు దివ్యజ్ఞాన సమాజ సభ్యులైనవారిలో అద్వైతము, వైదిక మతధర్మము, బౌద్ధవిజ్ఞానము నేర్చుకొనదలచినవారిని సుబ్బారావుగారికి శిష్యులుగా చేయుచుండిరి. అట్లు వీరికి శిష్యులైనవారిలో సుప్రసిద్ధ ఐ. సి. యస్. ఉద్యోగియు, కాంగ్రెసు మహాసభ మూల పురుషుడగు ఏ. ఓ. హ్యూముగారును, పయొనీర్ అను ఆంగ్లేయపత్రికా సంపాదకులగు ఎ. పి. సిన్నెట్టు గారును ముఖ్యులు. వారిరువురు ౧౮౮౧ లో దివ్యజ్ఞాన సమాజ సభ్యులైరి. హ్యూముగారిని, సిన్నెటుగారిని శిష్యులుగా అంగీకరింపుడని బ్లావట్‌స్కీగారు సుబ్బారావుగారిని కోరగా ఆయన మొదట సమ్మతింపలేదు. "ఏ యింగ్లీషు జాతివారుగాని ఏదో లోపల ఒక ఉద్దేశ్యములేనిది కేవలము పరమార్థచింతతో మా భారతీయుల క్షేమముకొరకు పాటుపడునని నేను అంత సులభముగా విశ్వసింపను. మహాత్ములయందును, విూయందును గల గౌరవమువలన నేను హ్యూముగారికిని, సిన్నెటుగారికిని మత రహస్యములను బోధించుటకంగీకరించితిని." అని ఆయన బ్లావట్‌స్కీగారికి ౧౮౮౨ ఆగష్టులో వ్రాసిరి (బ్లావట్‌స్కీ లేఖలు, పుట ౩౧౮). "నా దేశమునకును, దివ్యజ్ఞానసమాజమునకును నాచేతనైనంత సేవ చేసెద" నని ఇంకొక లేఖ వ్రాసిరి. హ్యూముగారిని, సిన్నెట్టుగారిని శిష్యులుగా నంగీకరించుటకు ముందీయన వారిని నియమమును, నిష్ఠయు కలిగియుండవలెననియు, తాము వారికి బోధించు రహస్యములను దివ్యజ్ఞాన సమాజ సభ్యులకుగూడ వెల్లడింపగూడదనియు నిబంధన నేర్పరచుచు కాకినాడ నుండి ౪-౫-౧౮౮౨ తేదీన సిన్నెటుగారి కొక లేఖ వ్రాసిరి. సుబ్బారావుగారు ప్రతిభాశాలి యనియు, గొప్ప అద్వైతియనియు ఆయన శిష్యులైన సిన్నెటు గారును, బ్లావట్‌స్కీగారును, ఇతరులును వ్రాసియున్నారు (మహాత్మ లేఖలు, పుట ౭౪).

ఈసుబ్బారావుపంతులుగారు కేవలము వేదాంత తత్వశాస్త్రములందే గాక జ్యోతిషశాస్త్రమున, చరిత్ర పరిశోధనలందుగూడ నిపుణులు. వీరనేక సుప్రసిద్ధవ్యాసములను వ్రాసియున్నారు. ఆ నాడు ఆంగ్లేయ చరిత్రకారులు క్రీ. పూ. ౪౭౭ అని నిర్ణయించిన బుద్ధ నిర్యాణకాలము తప్పు అనియు, బుద్ధ భగవానుడు క్రీ. పూ. ౫౪౩ లో నిర్యాణము చెందెననియు ఈయన నిర్ణయించెను. ౧౯౧౯ లో బయల్పడిన ఖారవేల శాసనమువలన నీయనకాలనిర్ణయమే నిజమని తేలినది. శంకరులవారి కాలము క్రీస్తు తరువాత ౮-వ శతాబ్దమని వ్రాయు వ్రాతలను వీరు ఖండించి, ఆదిశంకరులవారు క్రీస్తుపూర్వము ౫౦౦ సం. ల క్రిందట నుండిరని సహేతుకముగా నిర్ణయించినారు. శంకరాచార్య గురు పరంపర త్రివిష్టప లేఖ్యములు, శంకరులవారి గురువు గౌడపాదులు పతంజలి శిష్యుడగుట, అతడు పుష్యమిత్రునిచేత యజ్ఞము చేయించుటయు నీయన చూపిన ఆధారములు. ఈయన రచించిన వ్యాసములందును, చెప్పిన రహస్యములందును కొన్నిటిని మాత్రమే దివ్యజ్ఞాన సమాజమువారు ప్రకటించినారు.

ఆ కాలమున క్రొత్తగా స్థాపింపబడిన హిందూ పత్రికలో వీరనేక రాజకీయ సాంఘిక విషయములను గూర్చిన అమూల్య వ్యాసములను వ్రాసియున్నారు. న్యాపతి సుబ్బారావుపంతులుగా రీయనకు మిత్రులు.

పూర్వకాలమునాటి సుప్రసిద్ధ న్యాయవాదులను గురించి ముచ్చటించుచు సర్ పి. ఎస్. శివస్వామి అయ్యరుగారు వ్రాయుచు శ్రీ సుబ్బారావుగారి ప్రతిభావిశేషములను వర్ణించియున్నారు. ఈయన గొప్ప మేధావి యనియు, ఆశ్చర్యమును గలిగించు జ్ఞాపకశక్తి కలవాడనియు, మహావక్త యనియు, నిరాడంబరుడనియు, సత్యశీలు డనియు వ్రాసినారు. దివ్యజ్ఞానసమాజపక్షమున సుబ్బారావుగారి భగవద్గీతోపన్యాసములను పునర్ముద్రణము చేయునప్పుడు పరిచయ వాక్యములు వ్రాయుచు సర్ ఎస్. సుబ్రహ్మణ్య అయ్యరుగారును వీరిని గురించి ప్రశంసించినారు. ౧౮౮౨ లో తమకు వీరి పరిచయభాగ్యము గలిగిన దనియు, క్రొత్తగా స్థాపింపబడిన భారత జాతీయ కాంగ్రెసు మహాసభ కలకత్తా సమావేశమునకు పోవలసిన దని సుబ్బారావుగారు తమ్ము బలవంతము చేయుచుండి రనియు, దివ్యజ్ఞానసమాజ వార్షికసభలో భగవద్గీతలను గురించి సుబ్బారావుగారు ఉపన్యసించుట కంగీకరించినచో తాము కలకత్తాకు పోయెద మని చెప్పితి మనియు, అట్లు సుబ్బారావుగా రిచ్చిన యుపన్యాసములకు పార్టుహోండులో వ్రాయించితి మనియు వ్రాసినారు.

బ్లావట్‌స్కీగారు రష్యాదేశపు స్త్రీ యగుట వలన రష్యా దండెత్తివచ్చు నను భయము ఆ నాడు ఆంగ్లేయుల కున్నందున బ్రిటిషు గవర్నమెంటువారి కామెపై ననుమాన ముండెను. ఆమెకు సాయము చేయుచున్నాడని సుబ్బారావుగారిని కూడ అనుమానించుచుండి రని ప్రభుత్వమున పలుకుబడిగల హ్యూముగారే ఈయనకు చెప్పిరని సిన్నెటుగారి మహాత్ముల లేఖలలో ౩౬౩-వ పుటలో వ్రాయబడినది.

హ్యూముగారు ఫించను పుచ్చుకొనిన పిదప ద్విగుణీకృతోత్సాహముతో భారతదేశ ప్రజల క్షేమలాభములకొరకు పనిచేయుటయు, పయోనీరు పత్రికాధిపతియగు ఎ. పి. సిన్నెటుగారు ఆంగ్లేయులై యుండియు ఆ పత్రికా యజమానులకుగూడ కోపము వచ్చి ఆయనపని తీసివేయునంత తీవ్రముగా ఆంగ్ల జాతీయ గర్వమును, ప్రభుత్వ చర్యలను విమర్శించుటయు వారికి భారతదేశముపైన గలిగిన గాఢమైన అభిమానమువలననే. ఈ అభిమానమునకు కారణము వారిరువురును దివ్యజ్ఞానసమాజసభ్యులై సుబ్బారావుగారికి శిష్యులై వారివలన భారతదేశ బ్రహ్మవిద్యా రహస్యములు, ప్రాచీనార్యవిజ్ఞానమును ఉపదేశము పొందుటయే యని దివ్యజ్ఞానసమాజమునందలి ప్రముఖులు వ్రాసిన గ్రంథములయందే చెప్పబడియున్నది. (Early teachings of the Masters, 1881-1883 by C. Jinarajadasa and Mahatma Letters —A. P. Sinnet) దివ్యజ్ఞాన సమాజముయొక్క సభ్యుల కెల్లరకును సుబ్బారావుగారియందు గొప్ప భక్తి విశ్వాసము లుండెను. అయితే సుబ్బారావుగారు

౧౮౮౬-వ సంవత్సరము డిసెంబరులో భగవద్గీతలను గురించి యిచ్చిన ఉపన్యాసములలోని కొన్ని మత సిద్ధాంతములనుగురించి బ్లావట్‌స్కీగారికిని, ఆయనకును అభిప్రాయ భేదములు కలిగెను. ఆమె పరోపాకు వెళ్లిన పిదప పత్రికలలో గొప్ప వాద ప్రతి వాదములు ప్రారంభమయ్యెను. ఆమెకు కోపము వచ్చెను. అంతట సుబ్బారావుగారు దివ్యజ్ఞాన సమాజమునకు తరచుగా వెళ్లుట మానిరి. ఆరోజులలోనే అమెరికా దేశపు దివ్యజ్ఞానసమాజసభ్యుడొకడు సుబ్బారావుగారికి మహాత్ములనుగూర్చి తెలిసిన విషయములను పాశ్చాత్య దివ్యజ్ఞాన సామాజికులకు సరిగా వెల్లడించుటలేదనియు, ఆయన బ్రాహ్మణుడగుటవలన గుప్త విద్యను వెల్లడించుట కిష్టపడుట లేదనియు, ఇది సర్వసమాన దృష్టికి విరుద్ధ మనియు విమర్శించెను. అంతట నొకనాటి సాయంత్రము సుబ్బారావుగారు టెన్నిసు ఆట అయిన తరువాత * టెన్నిసు ఆటలో ప్రవీణులును, తమకు మిత్రులును, దివ్యజ్ఞాన సమాజ సభ్యులు నైన డాక్టరు కుక్కుగారితో మాట లాడుచు తాను సమాజమునుండి పోవుకొందు మని చెప్పి అటుతరువాత కొద్దిరోజులలోనే తమ సభ్యత్వమునకు రాజీనామా నిచ్చిరి. తరువాత ప్రతి దినము కాస్మాపాలిటను క్లబ్బులో టెన్నిసు ఆట ఆడిన తరువాత క్లబ్బుప్రక్కగా నున్న డాక్టరు కుక్కుగారి యింటికి వెళ్లి అక్కడకు వచ్చు ఆంగ్లేయ స్త్రీ పురుషులతోను, ఇతర మిత్రులతోను సంభాషించుచు కొంతసేపు కూర్చుండుచుండిరి. అక్కడకు సర్ సుబ్రహ్మణ్య అయ్యరుగారుకూడా వచ్చుచు సుబ్బారావుగారి సంభాషణలు వినుచుండిరి. కూపర్ ఊక్లె దొరగారు ఈ సంభాషణలలోని ముఖ్యవిషయములను వ్రాసికొనుచుండిరి. ఇట్లు సుబ్బారావుగారు సమాజముతో సంబంధము వదలుకొన్నను సామాజికు లాయనను వదలలేరు. ఇప్పటికిని దివ్యజ్ఞాన సమాజమునం దాయన వ్రాతలకు, అభిప్రాయములకు అత్యంత గౌరవము కలదు. వారిని 'స్వామి' సుబ్బారావుగా రని సామాజికు లెల్లరును స్మరించుచుందురు.

సుబ్బారావుగారి శిష్యులును, స్నేహితులు నగు ఆల్లెన్ ఆక్టేవియన్ హ్యూముగారుకూడా బ్లావట్‌స్కీగారితో అభిప్రాయభేదములు కలిగి సమాజము నుండి తొలగిరి. సిన్నెట్టుగారుమాత్రము సమాజమునందే యుండిరి. బ్లావట్‌స్కీగారికిని, సుబ్బారావుగారికిని కలిగిన అభిప్రాయభేదముల విషయమున సుబ్బారావు గారిదే హిందూమతానుసారమైన సిద్ధాంతమని చాల మంది యభిప్రాయము."

న్యాయవాదుల వృత్తిలో చేరుటకు తర్ఫీదు పొందు అప్రెంటిసులకు పూర్వపు న్యాయవాదుల ముచ్చటలు చెప్పుచు సర్ పి. ఎస్. శివస్వామి అయ్యరుగారు ౧౯౨౯ లో కొన్ని యుపన్యాసముల నిచ్చిరి. అవి మద్రాసు లాజర్నల్ ౫౪-వ సంపుటములో ప్రకటింపబడినవి. శ్రీ తల్లాప్రగడ సుబ్బారావు పంతులుగారిని గురించి వారిట్లు ముచ్చటించిరి:

"మంచి నవయౌవనముననే మృత్యువువాతను బడిన ఇంకొక మేధావి – అఖండమైన మేధావి యొకడుండెను. ఆయన టి. సుబ్బారావుగారు. ఇతడు కృష్ణా జిల్లా కాపురస్థుడగు తెలుగువాడు. విశ్వ విద్యాలయములో నితడు చదువుకొను దినములలో నితని అద్వితీయ జ్ఞాపకశక్తిని జూచి ఇతని తోడి విద్యార్థులితనికి పిశాచి యని పేరుపెట్టి రని నాకు జ్ఞాపకము. విశ్వ విద్యాలయమునం దితడు మంచి ప్రజ్ఞావంతు డని పేరుపొందిన విద్యార్థి. ఇతడు కుశాగ్రబుద్ధి. మంచి గణితశాస్త్రజ్ఞుడు. ఇతడు తరువాత దివ్యజ్ఞానసమాజ సభ్యుడై దివ్యజ్ఞానసామాజికు లందరును మెచ్చుకొను భగవద్గీతోపన్యాసముల నిచ్చినాడు. అయితే దివ్యజ్ఞాన విషయములయం దితడు చేసిన కృషినిగురించి నే నిప్పుడు మాటలాడ దలపలేదు. సుబ్బారావుగారికి గల ఇతర శక్తి సామర్థ్యములనుగురించియే నే నిప్పుడు చెప్పదలచినాను. సర్ వి. భాష్యం అయ్యంగారి వలెనే ఇతడును మంచి ధారణాశక్తి యలవరచుకొన్నాడు. నాలుగైదువందల పుటల రికార్డుగల కేసులలో జ్ఞాపక ముంచుకొనవలసిన అంశములను వ్రాసు

* ఆనాటి భారతీయులలో సుబ్బారావుగారు గొప్ప టెన్నిసు ఆటకాడని సర్ సుబ్రహ్మణ్య అయ్యరుగారు వ్రాసినారు.

కున్న చిన్న కాగితమైనను లేకుండా ఆ కేసులోని సంగతుల నెల్ల జ్ఞాపక ముంచుకొని అతిసమర్థతతో వాదించుట నేను స్వయముగా చూచియున్నాను. ఆయనకు ప్రవాహమువంటి వాగ్ధోరణియు, భావ ప్రకటన శక్తియు నుండెను. అతడు మంచి నేర్పరియైన మాటకారి. అతడు భావోద్రేకముతో ప్రసంగించుచు, ఇతరుల మనస్సుల నాకర్షింపగలడు. మహావక్త. ఆయన మాటలాడుచున్నప్పుడింకను వినవలెనను కుతూహలము కలుగుచుండును. అతడు బ్రదికి యుండినచో దివ్యజ్ఞానమునందు, వేదాంత వ్యాసంగములందు నిమగ్నుడై విరాగి కానిచో అత్యున్నతపదవి నందవలసిన ప్రతిభాశాలి. అప్పటికే అతడు హైకోర్టు న్యాయవాదులలో మొదటి వరుసలో నున్న పెద్దల తరువాత చెన్నదగిన ప్రాక్టీసు కలిగి యుండెను. అతడు ఆవేళల ప్రక్కనున్నాడన్నచో జాగ్రత్తపడవలసి యుండు నన్న బెదురును ప్రత్యర్థిపక్షపు న్యాయవాదికి కలిగించుచుండెను.

సుబ్బారావుగారి స్వభావము చాలా మంచిది. అతడు హృదయము నిచ్చు స్నేహపాత్రుడు. నిగర్వి. సత్యశీలుడు. మంచి తెలివి తేటలు గలవాడు. సరసుడు. అతని బుద్ధి వికాసమును, ప్రతిభను నేను స్వయముగా చూచియున్నాను. ఏ విషయమునుగురించియైనను ఆరుగురు విద్యార్థులు అతితీవ్రముగా ఎడతెగని వాగ్వాదము లాడుచున్నా రనుకొనుడు: అత డావాగ్వాదములో చొరబడి ఒక్క వేటులో దానిని తన నిశిత బుద్ధితో ఖండించి అందరును నిరుత్తరులనునట్లు దానిని పరిష్కరించు చుండును. అతనిది కేవలము మేధాశక్తితో కూడిన వాగ్ఝరి. దురదృష్టవశమున — నేను పైన చెప్పినట్లు మంచి యౌవనదశలోనే అత డకాల మృత్యువువాతను బడినాడు. అతడు దివంగతుడగు నప్పటి కాతనికి ముప్పదియైదు వత్సరములైన నుండు నని నాకు తోచదు."

కీర్తిశేషులైన శ్రీ కల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు ౧౯౩౧ లో ప్రకటించిన తమ స్వీయ చరిత్రలో నిట్లు వ్రాసిరి: "పూర్వము నలుబదిసంవత్సరముల క్రిందట బి. ఏ. పరీక్ష మద్రాసులోనే జరుపు చుండిరి ... ౧౮౮౮-వ సం. డిసెంబరు నెలలో కాకినాడలో మా మేనమామల యింటికివచ్చి, హిమాలయా స్టీమరుమీద చెన్నపట్టణము మూడవరోజు ఉదయమునకు మే ముభయులము చేరితిమి ...... ఆ దినములలో సముద్రతీరమందున్న ఉత్తరసర్కారులకును, మద్రాసునకును రైలుమార్గము లేదు. కాబట్టి మనదేశపు తెలుగువారు మిక్కిలి అరుదు. ఆంధ్రవకీళ్లలో తల్లాప్రగడ సుబ్బారావుగారు, తుమ్మలపల్లి రామారావుగారు, రెంటాల వెంకటసుబ్బారావుగార్లు ముఖ్యులు. మొదటివారు గొప్ప ప్రతిభాశాలురు. స్టాట్యూటరీ సివిలు సర్వీసులో మొదటివాడైనను, శాసనసభలో నుంటూ మిక్కిలి పలుకుబడిగల రెండవ ఆయన కుమారునికి కలెక్టరు ఉద్యోగము అన్యాయముగా యీయబడినది. మూడవవారు నావలెనే స్వకాయ కష్టము మీదనే యాధారపడి గుంటూరు కాలేజీలో ఉపాధ్యాయ పదవియం దుండి ... హైకోర్టుపట్టా పుచ్చుకొని ... ఒక సంవత్సరముమాత్రము ప్రాక్టీసుచేసి న్యాయవాద వృత్తి-దానివలన కలుగు వరుంబడికిని, అసంతృప్తికిని అసహ్యము కలిగి Made easy series వ్రాసి అధిక ధనము సంపాదించ గలుగుచుండిరి. (అడ్వకేటు జనరల్) షెపర్డుగారు ఆయనను ప్రాక్టీసు విడువవలదనియు, హైకోర్టుజడ్జీపదవి ఆయన ప్రతిభావంతుడగుటచే తప్పక లభించుననియు ఎంత బోధించినను హైకోర్టు జడ్జీకంటె తా నెక్కువ సులభముగ రెట్టెక్కువ ధనమును సంపాదించుకొనగలననియు, తన గౌరవము హెచ్చుగా నుండును గాని తగ్గదనియు జవాబు చెప్పుచుండెను (మూడు. పుట ౨౭, ౨౯, ౩౬, ౩౭)."

ఇట్లు శ్రీ తల్లాప్రగడ సుబ్బారావుగారి జీవితము సర్వతోముఖమైన ప్రతిభ గలిగినది. భారతదేశమున రాజకీయములందును, సంఘ సంస్కారమునందును, మతవిషయములందును, చరిత్రపరిశోధనలందును తరువాత కలిగిన వికాసమునకును, జాతీయచైతన్యమునకును దారిదీసిన మహాపురుషులలో సుబ్బారావుగా రొకరని నిస్సంశయముగా చెప్పవచ్చును.

---




# యుద్ధ విమానములు

శ్రీ పింగళి వెంకటరామయ్య

### యుద్ధమునందు విజ్ఞానము:

సర్వమానవ సౌభాగ్యమునకు విజ్ఞాన మత్యవసరము. అట్టి విజ్ఞానము నేడు ఐరోపా దేశమునందు తాండవమాడుచున్న యుద్ధపిశాచమునకు దురాశాపీడితు లగు నియంతలచే చేయబడుచున్న మారణహోమమునందు ఘృతముగా నుపయోగింపబడుచున్నది. వైజ్ఞానికులచే కనిపెట్టబడిన నూత్న మారణయంత్రములు అమాయకులైన బాలురపైనను, అసహాయలైన స్త్రీలపైనను దయాదాక్షిణ్యము లీషణ్మాత్రమైనను లేకయే ఉపయోగింపబడుచున్నవి. బాధ్యులెవరైనను కానిండు. ఆధునిక యుద్ధములలో విజ్ఞానభావములు, విజ్ఞానానుభవము, విజ్ఞాన ప్రయోగములు మాత్రమే జయమును సమకూర్చుటకు ముఖ్యమగు సాధనములు.

### వాయు యానము:

ఆధునిక సంగ్రామములలో విమానయుద్ధమునకే ప్రాముఖ్యము ఎక్కువగా నున్నది. ఇందులకు కారణము ఈ యుద్ధముచే శత్రువులకు కలుగజేయజాలిన భీభత్సమే. యుద్ధములు చేయు నుద్దేశముతో విమాన నిర్మాణ పరిణామము జరుగలేదు. ప్రపంచమునందే నాడు మానవజాతి ఆరంభమైనదో ఆ నాటినుండియే వాయుయానాభిలాష కలిగినది. వాయుయానమొనర్చు పక్షిజాతిని చూచుటవలన ఈ అభిలాష కలిగియుండ వచ్చును. ఈ అభిలాషను నెరవేర్చుకొనెడి కుతూహలముతో తత్ప్రయత్నములుకూడ మానవుడు అనాది నుండియు చేయుచున్నట్లు వివిధ దేశములందలి జాతుల యొక్క చరిత్రల నవలోకించినప్పుడు గ్రహించవచ్చును. ఆయా జాతుల అనాదిసిద్ధములగు పురాణములను వివరముగా పఠించినచో వాయుయానమును గూర్చిన విషయము లనేకములు గాంచగలుగుదుము. క్రమముగా ప్రపంచమునందు విజ్ఞాన మభివృద్ధి చెందిన కొలదిని విమాన నిర్మాణమున వికాసముచెంది పరిపక్వము నొందినది. నేడు ఐరోపా దేశమునందు కార్య నిర్వహణమున కుచితములగు వివిధరకముల విమానము లనేకములు నిర్మింపబడుచున్నవి. బహువిధములగు విమానయుద్ధపద్ధతు లనుసరణలోనికి వచ్చినవి. ఈ విమానయుద్ధములచే సైన్యములకే కాక, నిరాయుధు లగు మానవులకును, పురాతన కళాశోభితములైన పట్టణములకును తీరని నష్టము కలుగుచున్నది.

### బెలూనులు:

వాయుయానమునందు విమానములకంటె ఆకాశబుట్టలు (Balloons) ముందు నిర్మింపబడినవి. నీటియందు పడవలు తేలినట్లు బెలూనులు గాలియందు తేలిపోవును. ఆకాశబుట్టచే తొలగింపబడిన గాలికంటె ఆ బుట్టయొక్క బరువు తక్కువగా నుండవలెను,

అందుకొరకు గాలికంటె తేలికయగు బొగ్గువాయువు, లేక ఉదజనివాయువుతో ఈ బుట్టలను నింపెడివారు. వీనిని నడుపుటకు యంత్రములను, అవసరమగువైపు నకు త్రిప్పుటకు చుక్కానులను ఉపయోగింతురు. వీనిని ప్రయాణములకు వీలగునట్లుగా నిర్మించినవాడు జర్మనీదేశస్థుడగు జెప్లిను. వీనిని 'జెప్లిను' లందురు. గడచిన ౧౯౧౪-౧౮ నాటి ఐరోపామహాసంగ్రామములో జర్మనులు తమ జెప్లినుల నుపయోగించియే బాంబులను వేయుచుండిరి. కాని వీనియందు ఉదజని యుండుటచే, వీనిపై తుపాకులను ప్రేల్చినవెంటనే యివి మండిపోయెడివి. అందుచే జెప్లినులు యుద్ధమునం దెక్కువగా విజయవంతము కాలేదు. ఆ యుద్ధము ముగిసిన తరువాత మండనట్టి హీలియము (Helium) అను వాయువును కనిపెట్టి బెలూనులలో నింపుచున్నారు. నేటి యుద్ధమునందు విమానములే ఎక్కువగా ఉపయోగింపబడుచున్నను, బెలూనుల ఉపయోగముకూడ లేకపోలేదు. విమానదాడులందు పెద్ద పట్టణములను రక్షించుటకు బెలూనుల నెక్కువగా నుపయోగించుచున్నారు. పెద్ద భవనములమీద ఎత్తుగా అచ్చటచ్చట దగ్గరగా నుండునట్లు తీగలచే బెలూనులను కట్టియుంతురు. సుమారు ౧౦౦౦౦ అడుగుల ఎత్తులోపల ఎచ్చటనైనను వీనిని ఎగురుచుండునట్లు చేయవచ్చును. వీనిక్రిందకు శత్రువిమానములు దిగి బాంబులను వేయుటకు ప్రయత్నించునప్పుడు ఆ విమానములు బెలూనులకుగాని, వానికి కట్టిన తీగెలకుగాని తగిలి బోల్తాపడిపోయి విధ్వంస మగును. విమానము క్రిందకు దిగినచో భవనములపై బాంబులువేయుటకు గురి బాగుగా నుండును. బెలూను లున్నచోట బెలూనులకు పైననే ఎగురవలెను కాని క్రిందకు దిగజాలవు. ఎత్తున నున్నప్పుడే విమానవిధ్వంసక తుపాకులు ప్రేల్చగలుగునుగాని మిక్కిలి క్రిందకు దిగిన విమానములను ప్రేల్చజాలవు. కావున బెలూనులు శత్రువిమానములను ఎత్తున నుండునట్లు చేయుటవలన వానికి బాంబులు వేయుట కష్టమగుటయేకాక విమానవిధ్వంసక ఫిరంగులకుకూడ అవి సులభముగా ఆహుతియగును. బెలూనులను మడిచియుంచినప్పుడు మోటారులపై కొనిపోవుదురు. ఈ మోటారుబండ్లమీదనే వీనిని నింపు హైడ్రజను సిలండరులు, తీగెలుకూడ ఉండును. ఈ బెలూనులను మోటారుబండ్లపైనుండి తొందరగా ఎగురునట్లును, దింపునట్లును, ఒక చోటినుండి మరియొకచోటికి తీసికొనిపోవుటయును సులభముగా నుండును. ఈ బెలూనుల నుపయోగించుటకు ప్రత్యేకపు తర్ఫీదు పొందిన సైనికు లుందురు. సముద్రతీరములను రక్షించుటకును, పెద్ద దేశములయందు యుద్ధసమయములలో ఒకచోటినుండి మరియొక చోటికి సైన్యములను తీసికొనిపోవుటకును బెలూనులు మిక్కిలి ఉపయోగకరముగా నుండగలవని అమెరికా సైనికశాస్త్రవేత్తలు నేడుకూడ తలచుచున్నారు.

విమానములు:

బెలూనులవలెకాక విమానములు తాము తొలగించగలుగు గాలికంటె ఎక్కువబరువుగా నుండును. ఐనను ఇవి గాలియందు మిక్కిలి సులభముగా ఎగురగలుగుచున్నవి. విమానమునకు ముందుభాగమున ప్రొపెలరు గిరగిర తిరుగుటవలన అది బ్రమ్మామేకువలె గాలిలో చొచ్చుకుపోవును. వేగమువలన రెక్కలక్రిందకు వీచు గాలి విమానమును గాలిలోనికి ఎత్తివైచును. ప్రొపెలరు వేగము ఎక్కువైనకొలదిని విమానవేగముకూడ ఎక్కువగును. ప్రొపెలరును నడుపుటకు లోపల యంత్రము లమర్చబడియుండును. విమానమునకు వెనుకభాగమునం దమర్చబడిన 'ఎలివేటరు' అను సమతలమగు చెక్కసహాయముచే విమానమును పైకిగాని, క్రిందకుగాని పోవునట్లు చేయవచ్చును. వెనుకభాగమునందు నిలువుగా బిగించబడిన మరియొక చెక్కసహాయముచే విమానమును పడవను చుక్కానిసహాయముచే ప్రక్కలకు త్రిప్పునట్లు చేయవచ్చును. రెక్కలకు చివరభాగములం దమర్చబడిన ఏలిరానలు అను చెక్కలను పైకిని, క్రిందికిని ఎత్తుటవలన విమానము ప్రక్కలకు వరగకుండునట్లుగా చేయవచ్చును. మోటారుకారును నడుపు చోదకునివలెనే విమానమును నడుపువాడుకూడ విమానముయొక్క విషయములన్నియు పూర్తిగా నేర్చుకొనియుండవలెను. మోటారుడ్రైవరుయొక్క రెండుచేతులకును, కాళ్లకును అందుబాటులో నుండునట్లు యంత్రముల మీటలన్నియు ఎట్లు అమర్చబడియుండునో, అట్లే విమానమునందును

చోదకునికి విమానమును నడుపుటకవసరమగు మరలన్నియు అందుబాటులో నుండును. విమానములలో మోనోప్లేనులనియు, బైప్లేనులనియు కలవు. మోనోప్లేను లనగా ఇరువైపులను ఒక్కొక్క రెక్కమాత్ర ముండును. బైప్లేనులలో ఒక్కొక్కవైపున రెండేసి రెక్కలుండును. ఈ రెండురకముల విమానములనుకూడ యుద్ధవిమానములుగా నుపయోగించుచున్నారు. హైడ్రోప్లేనులను విమానములు నీటిపైకూడ ఆగగలవు. ఆటోగైరోలను విమానములు నేలమీద పరుగెత్త నవసరములేకుండగనే తిన్నగా పైకి ఎగురగలవు. యుద్ధమునందు వివిధములగు పనుల కుపయోగించుటకు వివిధరకములగు విమానములను నిర్మించుచున్నారు.

### వివిధరకముల యుద్ధవిమానములు:

౧౯౧౪ నాటి ఐరోపాయుద్ధములో నుపయోగించిన యుద్ధవిమానములకును, నేడుపయోగించుచున్న విమానములకును చాల భేదము కలదు. ఆనాటి విమానము గంటకు ఏబది, లేక అరువదిమైళ్లు పోగలిగెడిది. ౮౫౦౦ అడుగుల ఎత్తున కెగిరి గాలియందు నాలుగున్నరగంటల కాలము మాత్రము ఏకదమ్ముగ ప్రయాణము చేయగలిగెడిది. నేటి యుద్ధవిమానములు గంటకు ౩౫౦మైళ్లకు పైగా పోగలుగుచున్నవి; ౨౦,౦౦౦ అడుగుల ఎత్తునకు సులభముగా పోగలుగుచున్నవి. అదిగాక ప్రత్యేకరకపు కార్యములకు ప్రత్యేకవిధములగు విమానములు నేడుపయోగములో నున్నవి. యుద్ధవిమానములను ముఖ్యముగా బాంబరులు, పోట్లాటవిమానములు అని రెండువిధములుగా విడదీయవచ్చును. బాంబరులు ప్రత్యేకముగా శత్రువుల సైన్యస్థానములమీదను, పట్టణములమీదను, నౌకాశ్రయములమీదను, ఓడలమీదను బాంబులను వేసి నాశనముచేయును. పోట్లాటవిమానములు శత్రువిమానములతో పోట్లాడి స్వదేశముమీదకు దండెత్తు శత్రువుల బాంబరువిమానములను అటకాయించును. ఇవిగాక శత్రుస్థానముల మర్మములను ఛాయాచిత్రముల సహాయముచే తెలిసికొనుటకుగూడ ప్రత్యేకరకపు విమానము లుపయోగింపబడుచున్నవి.

బ్రిటిషువారికి పోట్లాటవిమానములలో ముఖ్యమైనవి హర్రికేను, స్పిట్‌ఫైరు అనునవి. ఈరెంటియందును ౧౦౩౦ అశ్వజవము (Horse-Power) గలిగిన రోల్సు-రాయస్ 'మెర్లిన్' ఇంజను లమర్చియుండును. ఇవి ౩౩౦, ౩౬౦ మైళ్ల వేగముతో పోగలుగును. స్పిట్‌ఫైరు ౧౧,౦౦౦ అడుగుల ఎత్తు అయిదునిముషములలో ఎక్కగలదు. దాని రెక్కలయందు ఎనిమిది బ్రౌనింగుమెషనుతుపాకు లమర్చియుండును. ఈతుపాకి ఒక్కొక్కటి సెకండుకు ౨౦ మారులు ప్రేల్చగల్గును. వందలకొలది తోటాలు అమర్చబడిన బెల్టులలో నుండి ఈ తుపాకులలోనికి తోటాలు వాటంతటవియే తొందరగా వచ్చుచుండును. ఈమెషనుతుపాకు లన్నిటియొద్దను మనుష్యు లుండనక్కరలేదు. విమానచోదకుడు త్రోయుదండముమీద నున్న మీటను నొక్కిన తక్షణమే ఎనిమిది తుపాకులును ఒకేమారు ప్రేలిపోవును. ప్రేలినవెంటనే మరల వానిలోనికి బెల్టులలోని తోటాలు వచ్చి మరల ప్రేల్చుటకు సిద్ధముగా నుండును. మీట నొక్కినతక్షణమే స్పిట్‌ఫైరు శత్రువిమానముమీద నిప్పులవర్షమును కురిపించును. ఇది హర్రికేనుకంటె కొంచెము చిన్నదిగను, తేలికగను నుండును. దీని వేగము గంటకు ౩౯౫ మైళ్ల వరకు నుండును. వీనిలో పెట్రోలుటాంకులకును, చోదకునకును గుండ్లుతగులకుండ లోహపురేకులు కవచముగ బిగించియుండును. ఈరెంటికంటెను ఎక్కువవేగముగా పోగలిగినది 'డిఫైంట్' (Defiant) పోట్లాటవిమానము. ఇందు ఇద్దరు సైనికులకు తావు కలదు. ఇది మోనోప్లేను. ఇది పూర్తిగా ఒత్తిడిలోహముతో చేయబడినది. ఇది ఎక్కువదూరపు ప్రయాణములోనచ్చి అత్యద్భుతముగ పోట్లాట జరుపును. దీనిలో కూడ ౧౦౩౦ అశ్వజవము కలిగిన రోల్సురాయి ఏకయంత్రము లమర్చబడినవి. దీని రెక్కల వెడల్పు ౩౯ అడుగుల ౬ అంగుళములు. ఇందలి క్రొత్తవిశేషమేమన, రెండు మెషనుతుపాకులు బిగించి స్వతంత్రముగా పనిచేయునట్టి పీఠము (Turret). దీని రెక్కలలోకూడ ముందుకు ప్రేల్చునట్టి మెషను తుపాకులు గలవు.

బ్రిటిషు బాంబరులలో ముఖ్యమైనది 'బ్లెన్ హైమ్' (Blenheim) బాంబరువిమానము. దీనిలో ౮౪౦ అశ్వజవము కలిగిన రెండు బ్రిస్టల్ మెర్క్యూరీ యంత్రము లమర్చియుండును. ఇవన్నియు ఒత్తిడిలోహముతోనే చేయబడినవి. దీని రెక్కల పొడవు ౫౬ అడుగుల ౪ అంగుళములు. వీనిని శత్రుస్థానముల రహస్యములు కనుగొనుటకును, పోట్లాటలకునుగూడ ఉపయోగించవచ్చును. ౧౫౦౦౦ అడుగుల ఎత్తున దీనికి గంటకు ౨౮౫ మైళ్ల వేగము కలదు. గంటకు ౨౮౫ మైళ్ల చొప్పున ౫½ గంటలకాలము ఇది తిరుగ గలదు. ఒక్కనిముషములో ౧౫౪౦ అడుగుల ఎత్తునకు ఎక్కగలదు. ఇది ఎక్కువదూరమువరకును మిక్కిలి బరువైన బాంబులను కొనిపోగలదు. 'బ్యూఫోర్ట్' (Beaufort) అను బాంబరువిమానము బ్లెన్ హైమువలెనే యుండును. ఇందు ముగ్గురు సైనికు లుండురు. దీనిలో ౧౦౬౫ అశ్వజవము కలిగిన రెండు టారస్ యంత్రము లమర్చియుండును. వెల్లింగ్టన్, విట్లీబాంబరులుకూడ మిక్కిలి తీవ్రమైనవే. వెల్లస్లీ బాంబరు ౧౯౩౮ లో ఒకేదమ్మున ఈజిప్టునుండి ఆస్ట్రేలియాకు ౭౧౫౯ మైళ్లు ఎగిరి బహుమానము పొందినది. ౧౯౬౮౦ అడుగుల ఎత్తున దీనికి గంటకు ౨౨౮ మైళ్ల వేగము కలదు. ఫ్రెంచివారికి పొటెజ్, బ్రీగెట్, బ్లాక్, మొరేన్ సాల్నియర్, కూల్ హోవెన్, యువైటిన్ మొదలగు యుద్ధవిమానములు కలవు. ఇవన్నియు ఇంచుమించుగా బ్రిటిషుయుద్ధవిమానములనే పోలియుండును.

యుద్ధము ప్రారంభ మగునాటికి జర్మనీకి ౧౦,౦౦౦ యుద్ధవిమానములు కలవని బ్రిటిషువారు అంచనా వేసియున్నారు. జర్మనీకి పోట్లాటవిమానముల కంటె బాంబరులే యెక్కువగా గలవు. జర్మనీ పోట్లాట విమానములలో హైన్ కెల్ "హె. ౧౧౨" (Heinkel "He 112") ముఖ్యమైనది. ఇందులో విమానచోదకు డొక్కడే సైనికు డుండును. దీని వేగము గంటకు ౩౧౦ మైళ్లు. దీని అస్థిపంజరములో రెండు మిషను తుపాకులును, రెక్కలలో ముందు ౨౩ మిల్లీమీటరుల జోర్లికన్ తుపాకులు రెండును ఉండును. మెసర్ ష్మిట్ (Messer Schmit) విమానములుకూడ ముఖ్యమైనవే. వాని వేగము గంటకు ౩౫౪ మైళ్లు. వానికి రెక్కలలో రెండు మిషనుతుపాకు లుండును. ఇంజను లపై మీదుగా రెండు తుపాకు లుండును. ఇవిగాక దాని ముక్కునందుకూడ ఒక తుపాకి యుండును. ఇది నిముషమునకు ౫౦౦ గుండ్లు ప్రేల్చును. ఈగుండ్లు సెకండునకు ౨౮,౦౦౦ అడుగుల వేగముతో ప్రయాణము చేయును. మెసర్ ష్మిట్ ౧౧౦ విమానము బ్రిటిషు డిఫైంట్ వలె నిర్మించబడినది. ఇది ఎక్కువ దూరపు పోట్లాటలకు బాగుగా నుపయోగించును. ౧౬,౫౦౦ అడుగుల ఎత్తున వానివేగము గంటకు ౩౬౫ మైళ్లు. దానిలో ముందుకు ప్రేల్చుటకు రెండు తుపాకులు గాక నాలుగు మిషనుతుపాకు లుండును. వెనుకటి రెండు తుపాకులు ముక్కునందు క్రిందుగా అమర్చియుండును. ఇవి ముప్పాతిక అంగుళపు గుండ్లను ౬౦౦ గజముల దూరమువరకు వేయుగల్గును. మిషనుతుపాకులలో రెండు బిగించియుండును; రెండు పైవైపుకు కావలసిన ఆవైపుకు ప్రేల్చుటకు వీలుగా నుండును. ౪౦౦ గాలనుల పెట్రోలు పట్టు టాంకులు రెక్కలలో నమర్చియుండును. ఈ పెట్రోలు సహాయముతో ౧౬౦ మైళ్ల వేగముతో ౧౭౦౦ మైళ్లు పోవచ్చును. జర్మను విమానబలములో ముఖ్యమైనది జంకరు "జ ౧౮౭" (Junker, Ju 187). దీనిని దూకి బాంబువేయుటకు (డైవు బాంబింగు) ఎక్కువగా నుపయోగించుచున్నారు. దీనిలో ౧౧౦౦ పౌనుల బాంబు ఒకటియు, ౧౧౦ పౌనుల బాంబులు నాలుగును కొనిపోవచ్చును. బాంబులను రెక్కల అడుగున పెట్టుదురు. రెక్కలకు ముందువ మిషనుతుపాకులుకూడ ఉండును. జంకరు "జ ౮౬", జంకరు "జ ౮౮" బాంబరులనుకూడ జర్మనీ వారు యుద్ధములో ఎక్కువగా నుపయోగించుచున్నారు. దాని వేగము గంటకు ౩౦౦ మైళ్లు. ౧౨౦౦ మైళ్లు ప్రయాణము చేయుగలదు. "జ. ౯౦" విమానమునందు నాలుగు ఇంజనుల నమర్చి సైన్యముల నొకచోటినుండి మరియొకచోటికి కొనిపోవుటకు జర్మనీవారుపయోగించుచున్నారు. డోర్నియర్ "డో. ౨౧౫" విమానము మిక్కిలి తీవ్రయుద్ధము చేయుగలదు. ఇది పోలెండుయుద్ధమునం దెక్కువగా ఉపయోగింపబడినది.

అమెరికా దేశమునందు క్రొత్తరకపు విమాన మొకటి నిర్మించబడినది. దానికి వాస్ గార్డ్ అని పేరు. ఈ విమానము నేలమీదనుండి నిముషమునకు ౮౦౦౦ అ. ఎత్తునకు ఎగురగలదు. దాని ప్రయాణవేగము గంటకు నాలుగువందల మైళ్లు. ఈ విమానమును నడుపు యంత్రములయొక్క అశ్వజవము ౧౨౦౦. ఈ విమానము యుద్ధములందు బోర్లపడకుండను, తలక్రిందులు కాకుండను నిలబడి సుస్థిరత్వముతో పోట్లాడగలదు. విమానములు పోరాటమందు ఎత్తునుండి క్రిందకు అకస్మాత్తుగా దిగునప్పుడు బొంగరమువలె గిరగిర తిరిగిపోయి పల్లటీలు కొట్టుట తటస్థించును. కాని వాస్ గార్డ్ అట్లు పల్లటీలు కొట్టదు. అమెరికా దేశము నుండి దానిని కొనుటకు యుద్ధను్యయు దేశములవారు ఆతురపడుచున్నారు.

ఇట్టిదే మరియొకరకపు విమానమునుకూడ అమెరికాలో నిర్మించుచున్నారు. ఈవిమానము నిముషమునకు ఒకమైలు ఎత్తునకు ఎగురగలదు. ఇంత తొందరగా ఎక్కగలిగిన విమానభేదము ఇంతవరకును లేదు. దీనికి మూడు ఆకులు కలిగిన ప్రొపెలరుండును. క్రిందనున్న చక్రముల బండిని ఎగురునప్పుడు రెక్కలక్రిందకు ముడిచివేయవచ్చును. ఇది గంటకు ౩౦౦ మైళ్లకంటె ఎక్కువ వేగముగా ప్రయాణము చేయగలదు; ౩౬౨౦౦ అడుగుల ఎత్తునకు ఎగురగలదు.

ప్రపంచమునందంతటికిని పెద్దదను దగ్గసు విమానము అమెరికాలో తయారగుచున్నది. దీనిని రాక్షసవిమానమనవచ్చును. ఇది ౨టన్నుల బరువు కలిగిన తొమ్మిదిబాంబుల నందుకొని అమెరికాయందు బయలుదేరి యూరపునకు పోయి, ఆబాంబులను వైచి, ఆగకుండ అట్లాంటిక్ సముద్రము దాటి అమెరికా చేరగలదు. ఈబాంబుల బరువుతో ౨౨౦౦౦ అడుగుల ఎత్తునకు పోయి, గంటకు ౨౧౦ మైళ్ల వేగముతో ప్రయాణము చేయును. దీని రెక్కలు ౨౧౨ అడుగుల పొడవుండును. ౨౦౦౦ అశ్వజవము కల్గిన రేడియలు ఇంజనులు ఇందు అమర్చబడినవి. ౧౬ అడుగుల పొడవైన మూడు ఆకులచే దీని ప్రొపెలరు చేయబడినది. దీనిని నిర్మించుటకు ౫౦౦ యంత్రశాస్త్రజ్ఞులు రహస్యముగా పని చేసిరి. దీని మొత్తముబరువు ౧౮౦,౦౦౦ పౌనులు. దీని నిర్మాణమునందు వేగముకంటె ఎక్కువమారము తుపాకులను ప్రేల్చగల్గుటయే ముఖ్యవిషయము. ౭౦ అంగుళముల వ్యాసము గలిగిన మూడు చక్రముల సైకిలుబండి దీనికి అడుగున అమర్చబడినది. దీనిని ఎగురునప్పుడు ముడిచివేయవచ్చును. ఈవిమానము తోకనుండి ముఖమునకు ౧౩౪ అడుగుల పొడవుండును. చిన్నచిన్న డబ్బాలలో పెట్రోలు నుంచి దీని రెక్కలలో నిలువయుంచవచ్చును. అందుచే తుపాకిగుండు రెక్కలకు తగిలినను అన్నిడబ్బాలకును ఒకేసారి నష్టము కలుగదు. ఇది ఎగురునట్టి యొక బ్రహ్మాండమగు కోటయని చెప్పవచ్చును.



# నాట్యవేదము

[గత సంచిక తరువాయి]

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ

నాట్యమనేది ఒక కళ అనటంలో ఎవరికిని విప్రతిపత్తి లేదు. శాస్త్రీయాంశము వడబోతపోయబడి కళగా వచ్చిందనిమాత్రం గుర్తుపెట్టుకోవాలి. ఏదో ఉద్దేశాన్ని నెరవేర్చటానికి శాస్త్రప్రవాహం బయలుదేరిందని మనము తెలుసుకోగలము. ప్రవాహానికి ఒక గమ్యం ఉంటుంది. మధ్యలో అది చిత్రగమనికల సౌందర్యం చూపించుతుంది. జలప్రవాహానికి గమ్యగతి లోకప్రయోజనమును సంపాదించుతున్నదా, లేదా అనేది వేరే విషయం. శాస్త్రాదుల మహాగమ్యం ప్రయోజనకారి కాదని ఎవరూ అనరు. వానిలోని అవాంతర ఘట్టాలనే లోకం అభిమానించినా లక్ష్యమును ద్వేషించటాన్ని మన మింకా నేర్చుకోలేదు. కళాజీవనగతిలో ఇంకో పరమార్థం ఉన్నది. మహాఫలమునకు సంబంధించిన అవాంతరఫలాలు అందులో సుమిగూడి ఉంటవి. అన్నిటిలోనూ మహాఫలచ్ఛాయ ఉంటుంది. ప్రతి అవాంతరఫలమూ ముఖ్యలక్ష్యమును అందచేస్తుంది. మహాఫల మొక్కటే అనేకరూపాలతో అవతరించుతుందని గ్రహించవచ్చు. కళను కళకొరకే ఆరాధించుతా మనేవాళ్లు కూడా కళాగమ్యమును పొంద చూస్తున్నారు అనే భావించుతాము. ఎక్కడైనా అసమర్థలోకం కళాప్రయోజనాన్ని వెతుక్కోలేకపోవచ్చు. వారు గ్రహించక పోయినా ప్రయోజనవత్త ఉన్నదని నిశ్చయించాలి. ధర్మమార్గనిరతులైనవారికి ధర్మోపదేశము లివ్వటానికి నాట్యము సర్వసమర్థమైనట్లే అధర్మాసక్తులను ధర్మానురాగులనుగా చేసి ధర్మపథాల ప్రవేశపెట్టడానికి కూడ నాట్యమే సర్వసమర్థము. అవాంతర ప్రయోజనాలలో ధర్మము ముఖ్యము కాబట్టి నాట్యము అందుకొరకు సమర్థమయ్యేటట్లే చూడాలి. నానా రసభావ సమన్వితమైన నాట్యపథంలో త్రైలోక్య భావానుకీర్తనం ఉంటుందని భరతుడు చెప్పుచున్నాడు. ఉన్నచోటనే ఉన్న సామాజికునకు మూడు లోకాలను మూటకట్టి ముందు పెట్టేది నాట్యమే. దీన్ని మరచిపోరాదు.

## అభినయం

అభినయ మనేది నటుని ధర్మం. మహాఫలాన్ని అవాంతర ఫలసంయుక్తంగా చేసి ఏకార్థత్వాన్ని సంపాదించటానికి ధర్మమే సమర్థం. ధార్మికచిత్తవృత్తి వికాసం పొందినప్పుడు నటత్వం సిద్ధించుతుంది. జన్మాంతర సంస్కారముల సంసిద్ధత ఉంటేనేగాని నటుడు కావటం కష్టం. అసలు నటుడై పుట్టాలిగాని పుట్టి నటుడు కావటం దుర్లభం. సూక్ష్మ దేహానికి సంస్కృతి ఉంటేనే నటత్వం వస్తుంది. నట జీవితంలో అనుకరణం ముఖ్యం. మానవ జీవితానికి అనుకరణ మవసరము. దానివలననే శక్తులకు వికాసం కలుగుతుంది. భావనాబలంతో అనుకృతిని స్వాధీనం చేసుకొంటే జీవితం పరిమళించుతుంది. స్త్రీలు కూడా నటనానికి అర్హతకలిగే ఉన్నారని భరతుడు కంఠరవేణ పల్కుతున్నాడు. వాస్తవికత్వానికి ఆరోప కల్పన అవసరం. కాకపోతే ఆస్వాదనపుట్టదు. అందువలన పురుషుడు స్త్రీపాత్రాభినయం చేస్తే, స్త్రీ పురుషపాత్రాభినయం చేస్తే భావానుకీర్తనం బాగా ఉంటుందని కొందరు అనుభవజ్ఞుల అప్రతిక్షేప్యమైన వచనంలో వాస్తవికత్వం భాసించాలి అని అనుకోరాదు. ఏ విధంగా ఎవరు ఎట్లా అభినయించినా వాస్తవికత్వం రాదు. అది రావటానికని నాట్యాభిమానులు ప్రయత్నం చేయటం వ్యర్థం. అటువంటి ప్రయత్నమునే వాళ్లు స్వీకరించితే భావనాబలం ఉన్న సామాజికులను చక్కగా మోసగించటానికి ఉద్యమించుతున్నారన్నమాట. అటువంటి మోసగించే ప్రయత్నం మానుకొని భావకుల భావనకే అన్ని హక్కులనూ విడిచిపెట్టితే నాట్యాభినయం సఫలమవుతుంది. చిన్నపిల్లవాడు ముసలివానివలె నటిం

చితే మనం ముచ్చటపడతాము. ముసలితనం వీరిలో ఉందా, లేదా అని మడి ఆలోచనలను చేయము. స్త్రీ వలె ఉండే పురుషుని చూచినప్పుడు కలిగే విశేషం స్త్రీని చూచినప్పుడుగాని, మగరాయడు మాదిరి ఉన్న మగువను చూచినప్పుడు కలిగే విశేషం మగవానిని చూచినప్పుడుగాని కలుగదని అంటే సహృదయులు తమ అనుభవాన్ని సాక్ష్యంగా చూచుకొని సంతసం పడతారు. కాబట్టి పురుషుడు స్త్రీ వేషాన్ని, స్త్రీ పురుషవేషాన్ని ధరించి అభినయించేటప్పుడు ఆ లోపధర్మములో సకలత్వం ఉంటుంది కాబట్టి సామాజికులు తమ నిశితభావనకు ఒరిపిడి పెట్టుకోవచ్చు. స్త్రీకి స్త్రీ, పురుషునకు పురుషుడు తగునని భరతుడంటున్నాడు. కాని వ్యత్యాసమును నిషేధించటం లేదు. భావనానిశితత్వం లేనివాళ్లు ఏ విధంగానూ అభినయపరమార్థం తెలుసుకోలేరు. వాళ్లనుకూడా భరతుడుద్దేశించి తన రచనలో తదనుగుణవచనాలకు అవకాశం ఇచ్చాడు.

అభినయం నాలుగువిధాలు. వీటిలో ఏ ఒక్కటో ప్రధానం అని తలచరాదు. అభినయశరీరంగా ఉన్న ఈ నాలింటిలో దేనికి లోటువచ్చినా లోటు ఉండనే ఉన్నది. కాబట్టి సర్వాంగీణమైన అభినయ సంపదను సంపాదించటానికి నటుడవశ్యంగా ప్రయత్నించాలి. అన్ని అభినయాలలోను శారీరికాభినయంలో భరతుని చర్చ అధికంగా కనిపించుచున్నది. చేష్టలు భావనాఫలాలను అందించటానికి అందుబాటులో ఉంటవికదా. సామాన్యంగా ముఖహస్తాదులకు సంబంధించిన అభినయములతోకూడా రసభావములకు అనుగుణంగా చెప్పిన విధాన విశేషాలు అత్యంత రమణీయంగా ఉన్నవి. ఇంకా అంగహారాలు, కరణాలు, చారి మండలగతులు, ధ్రువాగానానికి సంబంధించిన విషయాలు ఎన్నో తెలియతగినవి ఉన్నవి. వీని నన్నిటిని భావించితే అభినయింపవలసిన నటుడు మహాయోగిప్రజ్ఞ కలవాడుగా ఉండవలె కాబోలు అనిపించుతుంది. నిజంగా నటుడు ఒక లలితయోగి. తన కవితను తానే చూచి మెచ్చుకొని ఆనందించే కవి ఉన్నాడు. తనగానాన్ని అభినందించే గాయకు డున్నాడు. వాళ్లందరూ కూడా ఆయా సమయాలలో ఎంతో భావోద్వేగం పొందిఉంటారన్నమాట. ఆ విధంగానే నిస్సీమభావోద్వేగం పొంది అభినయక్రియానందమును అనుభవించే నటావతంసు లున్నారు.

## నటులు

నటజీవిక చాలా లలితమైనది. స్పృహణీయమైన కళ అందులో ఉన్నది. ఉదాత్తరేఖ లందులో కనపడుతవి. భరతుని పుత్రులు, శిష్యులు అందరూ నటజీవనమును అవలంబించారు. లోకాన్ని ఆనందింపచేశారు. మెప్పులు పొందినారు. ప్రశంస ఎప్పటికైనా ప్రమాదపాటు కలుగచేస్తుంది. వారు ఒకప్పుడు గర్వించి సమీపంలో ఉన్న ఋషాన్యకులను వికటంగా అభినయించి అపహసించటంమూలాన శాపగ్రస్తులైనారు. ఋషులు కోపంతో 'పొండి, మీది శూద్రవృత్తి' అని విదిలించుకున్నారు. ఈ విషయాన్ని నాట్యశాస్త్రంలో చూచిన పరమధార్మికులు కొందరు నటులను దరిచేరనీయక, పంక్తిభోజనాలు పెట్టక, ఇంకా అవకాశాలు ఇవ్వక ధుమధుమలాడసాగారు. ఇది అన్యాయం. అప్పు డందరూ శపింపబడ్డారా? ఏకొందరో అప్పటి సమావేశానికి రాకుండా ఉన్న భరతపుత్రులు లేరా? వాళ్లకు ఈ శాపం లేదే? ఇప్పటినటుల సంప్రదాయమంతా వాళ్లదే అని మనము గ్రహింపవచ్చునే! శపింపబడినవాళ్లు పశ్చాత్తప్తులై ఇతరమార్గాలను అనుసరించి ఉంటారు. శపింపబడనివారు తమ సంప్రదాయాలను ప్రచారం చేశారు. పవిత్రమైన ధార్మిక నటసంప్రదాయాన్ని ధార్మికుల మనుకునేవాళ్లు నిరసించుట పొరపాటు. ఇప్పు డందరూ అన్నీ సవరించుకొన్నారు. సర్వసామాన్యంగా అందరకూ రసానందమును సంపాదించే నటులు పూజ్యులు. ఇప్పటిలో వారు ధార్మిక విధానమును అనుసరించితే ఇంకా ప్రశస్యులౌతారు.

## నాట్యము — వేదము

వేదంలో మంత్రాలు, బ్రాహ్మణములు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు ఉన్నవి. నాట్యంలో పాటలు, పద్యాలు, రంగపూజ, అభినయములు, ఈ భావనలకు వచ్చే భావాలు, రసాలు ఉన్నవి. మంత్రవేదం దేవతలను స్తవం చేస్తుంది; గుణకీర్తనం చేస్తుంది; తత్త్వమును వెలిబుచ్చుతుంది. నాట్యంలో పద్యాలు, పాటలు మొదలైన వాచికవ్యవహార మంతా మంత్రకార్యమును నెరవేర్చుచున్నది. బ్రాహ్మణ భాగాలు మంత్రాలకు క్రియావినియోగమును చెప్పుతున్నవి. క్రియలద్వారా అపూర్వమును బోధించుచున్నవి. నాట్యంలోని రంగపూజ యజ్ఞయాగాదులవంటిది. ఇందులోని నానావిధాభినయాలు, చారిమండలాదులన్నీ రసభావరూపమైన అపూర్వతత్త్వాన్ని బోధించు

చున్నవి. ఇక ఆరణ్యక భాగ మంతా ఉపాసనాత్మకము. నాట్యంలో ఉపాసనకు లోటు ఏమి ఉన్నది? నిరంతరము భావనకు ఉత్తేజము నిచ్చే చిత్ర విచిత్ర భావాలు అన్నీ కూడా ఉపాసనాతత్వమునే వ్యక్తము చేస్తున్నవి. చివరివి అనబడే ఉపనిషత్తులు పరబ్రహ్మను ప్రతిపాదించుతూ ధన్యము లౌతున్నవి. వాద్యమంతా కూడా రసబ్రహ్మ ముపపాదించుతూ ధన్యమవుతున్నది. కాబట్టి నాట్యమును వేదమని వ్యవహరించుట సముచితంగా ఉంటుందని భావకులు గ్రహించాలి.

## మన విధి

నాట్యశాస్త్రమును తెలుగుభాషలోనికి త్వరలో అనువాదం చేయించాలి. నాట్యశాస్త్ర విధులను చూడకపోయినా జన్మాంతరానుభవాన్ని బట్టి కమ్మగా అభినయించే సిద్ధనటు లున్నారు. వారి అనుభవ లాలిత్యమును లోకానికి విశదపరచాలి. ఆయా అభినయాలను నిరూపించే ప్రఘట్టాలలో అభినయకోవిదుల అభినయచాతుర్యమును చూపే చిత్రములను ప్రకటించాలి. నాట్యశాస్త్రంలోని విషయ సర్వస్వమంతా అవసరము కాదని అనుకొంటే అవసరమైన ౬౧౦౦ శ్లోకాలనైనా విపులంగా తెలిసేటట్లు ప్రకటింప చేయాలి. నేటికాలంలో వారూ వీరూ అక్కడి నుంచీ, ఇక్కడినుంచీ వచ్చి ఏమో అభినయించుతూ ఇది భరతనాట్యం అంటున్నారు. ఆ మాటను వారు పలికిన తరువాత అదే అది కాబోలు అనుకుంటున్నాము. వారభినయించే దంతా ఒక భావ.గా ఉన్నది. సౌక్కటు మాస్టరుగారి అభినయానికీ, దీనికీ తేడా ఏమిటని ఎవరైనా అడిగితే కోపపడరాదు. అస లిదంతా భరతనాట్యం కాదనిపించుతున్నది. అవునో కాదో నిర్ణయించటానికి భరతనాట్య విజ్ఞానమును అందుబాటులో ఉంచాలి. కావలసినంతవరకూ నాట్యశాస్త్రమును ప్రకటిస్తాం. ఈ సమయంలో అభినవగుప్తుడి అభినవ భారతిని మనము మరచిపోరాదు. అతడు ఎన్నో విషయాలను ఆకళించుకొన్నాడు. అతడు ప్రసరింప చేసిన నాట్యవిజ్ఞానాన్ని అనుబంధంగా ఆంధ్రంలోకి తీసుకొనిరావాలి. ఇంకా మనవిధులు చాలా ఉన్నవి. ఆదర్శప్రాయమైన రంగం మనకు లేదు. రంగమంటప నిర్మాణ విషయంలో భరతుడు చాలా శ్రద్ధను ప్రదర్శించాడు. భరతుడు చెప్పినట్లుగా చేస్తే రంగమండపం బాగుండ దని అనటంకంటే అతడు నిరూపించినట్లుగా త్రివిధరంగ నిర్మాణం చేయించి చూడండి. బాగుంటుందో, బాగుండదో లోకం నిర్ణయించుతుంది. బాగుండదే అనుకోండి, భరతుడి విధంగా ఉంటుంది అని తెలుసుకోవటాని కయినా రంగశాలా నిర్మాణం చేయించకతప్పదు. రూపకాలు పదిరకాలుగా ఉన్నవి. ఉపరూపకాలు దాదాపు ౩౦ దాకా ఉన్నవి. ముప్పది రకాల రూపకాలనూ శారదా తనయుడు స్మరించుచున్నాడు. వాని వాని యథోక్త లక్షణానుసారంగా సంధి సంధ్యంగ సహితంగా రూపకాలను మంచికవులచే నిర్మాణం చేయించాలి. నాట్యానికి ఎన్ని ఫలాలున్నవని భరతుడు చెప్పుచున్నాడో అన్ని ఫలాలూ కనపడేటట్లుగా తగిన వస్తువును తీసుకొని రూపకాలను సిద్ధం చేయించాలి. నాట్యవేదం అంటే లోకానికి సరిగా తెలియకుండా ఉన్నది. కాబట్టి నాట్యవేద ప్రబోధ, ప్రచారములను చేయించాలి. నాటకరచయితనూ, నటుని, శిల్పిని, భరత విద్యాప్రవీణుని, విమర్శకుని, విషయశోధకుని ప్రోత్సహించి తగినట్లుగా బహుమానించాలి. నాటక ప్రదర్శనంలో నాట్యనృత్త్య నృత్త ప్రదర్శనం చేయించాలి. అపుడు నాట్యవిద్యోపన్యాసాలు పెట్టించాలి. ఇంకా ఏమేమి చేయాలో ఊహించాలి. మన ఊహలకు భరతుడు బాగా అవకాశం ఇచ్చాడు. వీటిని దుర్వినియోగం చేయరాదు.

నాట్యవేదసారమునైనా బాగా తెలుసుకోకుండా, బాగుండదనీ బాగులేదనీ అంటే సహించేవారుండరు. బాగుందో లేదో అన్నీ బాగా తెలిసి, తిట్టవలెనని అనుకుంటే తిట్టండి. తెలిస్తే తిట్టరని ధైర్యం. ఒకప్పు డది అక్కరలేదని అనుకోవచ్చు. అయినా ప్రాచీనకళను పోషించాలి. మన తరువాత వచ్చే వాళ్లకు అవసరమవుతవేమో? ఒకప్పుడు ధార్మికసంప్రదాయం తెలియకపోగా ధర్మసముద్ధారమును చేయటానికి నాట్య సంప్రదాయం వచ్చింది. నాట్య సంప్రదాయము లలితమైనదనీ, సుకుమారమైనదనీ అందరి భావన. ఇప్పుడు నాట్యసంప్రదాయంకూడా తెలియకుండా పోతున్నది. ఈ భరతభూమిలో పుట్టిన నాట్యకళ ఈ భరతభూమిలో క్షీణించుచున్నది. సహించుతారా? పాశ్చాత్యపు రంగులన్నీ దీనిమీద పడి దీని సహజ స్వరూప సౌకుమార్యాన్ని ధ్వంసంచేస్తుంటే క్షమించుతారా? సరియైన సంప్రదాయాభినయాలు మాసిపోతున్నవి. ఊరుకుంటారా? మహానటుడు పరమశివుడు మహారసస్వరూప విజ్ఞాన సంవేదన సంపద కలుగ చేయటానికి నాట్యం చేస్తున్నాడు.

" నమో రసాత్మనే. "



# విమర్శనము

ఛాయ

[ఇతర నాటికలు]

కర్త: ముద్దా విశ్వనాథంగారు. ప్రకాశకులు: ఆంధ్రభూమి బుక్ డిపో, వేపేరి, మద్రాసు. వెల మూడణాలు.

ఈ చిన్న పుస్తకంలో 'ఛాయ', 'ఘాత', 'రిక్షావాలా', 'నేనే రాజునయితే' అనే నాలుగు నాటికలున్నవి. ఇందులో మొదటి రెండు నాటికలున్నూ ఆల్ ఇండియా రేడియోవారిచేత మద్రాసు కేంద్రము నుండి బ్రాడ్‌కాస్టు కాబడినవి.

'ఛాయ' మానవ హృదయంలోని ఔన్నత్యాన్నీ, 'ఘాత' మానవ హృదయ దౌర్బల్యాన్నీ మిక్కిలి సహజంగా చూపిస్తున్నవి. మొదటిది అసాధారణము, రెండవది సాధారణము. మొదటి కథలో ఛాయ అను అనాథబాలికను సహృదయుడొకడు చేరదీయడమేకాక, ఆమె సుగుణములకు మెచ్చి కోడలుగా జేసికొనినాడు. కట్నములు, కానుకలు మొదలగు పటాటోపాడంబరములతో నిత్యమూ జరిగే వివాహాలను చూసే మనకన్నులకు ఈ వివాహం ఆదర్శప్రాయంగా కనబడుతుంది. వివాహం నిజంగా ఈ పద్ధతులలో జరుగవలెనని మనలో చాలామంది కాంక్షించుతారు కాని, ఎవరికివారు స్వవిషయంలో చల్లగా జారుకొంటారు.

రెండవది 'ఘాత'. అసలీ మాటను గోదావరి జిల్లావారు 'ఘోర' మనే అర్థంలో ఉపయోగిస్తారు. ఇందులో గోపాలంగారు మిల్లువ్యాపారంలో లాభం గడించి మూడంతస్తుల మేడ కట్టించుకొంటే, ఆయనతో పోటీవ్యాపారం పెట్టి గెలవలేక దివాలాతీసిన కోటయ్య, ఇతరులు బాగుపడుతుంటే చూడలేని పెద్దమనుష్యులను పోగుచేసి, గోపాలంగారు గృహప్రవేశం నాడు నరబలి ఇవ్వబోతున్నాడని పుకారు పుట్టిస్తాడు. ఆనోటా ఈనోటా ఈవార్త గాలికబుర్లనమ్మే పల్లెటూరి జనుల్లో సులభంగా ప్రాకిపోతుంది. సమయానుకూలంగా నలుగురినీ పోగుచేసి కోటయ్య గోపాలంగారిని మెత్తగా తన్నడమేకాక, అతనిమీద కోర్టులో కూనీకేసు పెట్టించాడు. కాని విచారణ సమయంలో కోటయ్యకుట్ర బయటపడిపోతుంది. ఏమాత్రం ఆలోచనాజ్ఞానం లేక చెప్పుడుమాటలు విని గోపాలంగారిని హింసించిన గ్రామీణులే కోటయ్యను తన్నడానికి సిద్ధపడతారు. కవిగారు విద్యాశూన్యులైన ప్రజాబాహుళ్యపు చిత్తవృత్తి (**Mob mentality**) ని సంభాషణలవలన చక్కగా చిత్రించారు. ఈ నాటికలలోని సంభాషణలు చదువుతుంటే షేక్స్పియరు నాటకములలోని జూలియస్ సీజర్, హామ్లెట్ సంభాషణలు స్మృతిపథంలోనికి వస్తున్నవి. తక్కిన రెండుకథలు సామాన్యములు.

కథలు చాలా పొంకంగా ఉన్నవి. కథలలోని భాష చక్కని వ్యావహారికము. భాషలో కాని, భావంలో కాని అసహజత్వం ఒకచోటకూ గానకపడదు. సంభాషణలు ఎంతో రుచిగా ఉన్నవి.

వెం. శ్రీ.

## ఉద్యానం

కర్త: పురాణం కుమారరాఘవశాస్త్రిగారు, బి. ఏ. వాడపల్లి హౌస్, బ్రాహ్మణవీధి, బెజవాడ. వెల అయిదణాలు.

ఈ కథా సంపుటిలో 'మాంగల్యం', 'ఈరయ్య ప్రేమ', 'క్రిస్టమస్ సెలవుల్లో', 'నేనూవస్తున్నా' 'ఫోటో' అను అయిదుకథ లున్నవి. ఒక్కొక్క కథలో ఒక్కొక్క నీతిని బయలుపరచడం కవిగారి ఉద్దేశ్యం. అన్నిటిలోనూ సాధారణంగా త్యాగం ప్రదర్శితమైంది. 'నేనూ వస్తున్నా' అన్నిటిలో హృదయంగమంగా ఉన్నది. మామగారు అలక కానుక తీర్చలేదనే కోపంవలన అల్లుడు భార్యను పుట్టింటికి పంపడానికి నిరాకరిస్తాడు. తల్లి బెంగ పెట్టుకొని మంచ మెక్కింది. ఈ సంగతి తెలిసి కూతురుకూడ జబ్బున పడుతుంది. ఆ జబ్బులో కల. కలలో తనకోసం పరి తపిస్తూ తల్లి మరణించినట్లు కనబడుతుంది. వెంబడే "నేనూ వస్తున్నా, అమ్మా" అని అరచి కూతురు ప్రాణం వాయువులో అంతర్లీనమై పోతుంది. ఆఖరి కథ 'ఫోటో' కూడ బాగానే వున్నది. కథలలో బిగువు తక్కువగా నున్నది. భావకూడ కొంచెము అభివృద్ధి కావలసి యున్నది.

వెం. శ్రీ.

---

## వీర తానాజీ

కర్త: చక్కభొట్ల సత్యనారాయణమూర్తి గారు, రాజమండ్రి. వెల ఒకరూపాయి.

ఇది ఐదంకముల నాటకము. దీనిలోని ఇతివృత్తము శివాజీసేనానియగు తానాజీకి సంబంధించినది. త్రిశతాబ్దములవరకు అవిచ్ఛిన్నముగా ప్రజ్వలించిన మొగలు సామ్రాజ్యమునకు ఔరంగజేబు పరిపాలన ఆఖరువెలుగు. ఇతనికాలమున హిందూజాతి పునరుజ్జీవితమై తన శృంఖలమును తెగకొట్టుకొనుటకు నలువైపుల ప్రయత్నించినది. ఉత్తరమున రాజపుత్రులు, దక్షిణమున మహారాష్ట్రులు విజృంభించి ఇంచుమించుగా ఆసేతుహిమాచలపర్యంతము వ్యాపించిన మొగలు సామ్రాజ్యమును ఛిన్నాభిన్న మొనర్చినారు. ఈ విప్లవములో శివాజీకి కుడిభుజముగా పని చేసినవాడు తానాజీ. అతని చరిత్రమే ఈ నాటకము.

ఉదయసింహు డను రాజపుత్రుడు తోటి రాజపుత్రులపై పగదీర్చుకొను నుద్దేశ్యముతో మహమ్మదీయమతమున కలిసి, ఔరంగజేబువద్ద ఒక సేనానియైనాడు. పద్మయను రాజపుత్రస్త్రీ మహమ్మదీయులతో పోరాడి మరణించిన భర్తతో సహగమనము చేయబోవుచుండగా, ఉదయసింహుడు పూర్వము తా నామెను వలచినకారణముచేత చెరబట్టి ఔరంగజేబువద్దకు గొంపోయినాడు. ఔరంగజే బాతనిని మహారాష్ట్రులవశమందున్న కొండాణగడమును స్వాధీనపరచుకొని, మూడునెలల తరువాత పద్మను వివాహ మాడ నాజ్ఞాపించును. ఈ సమాచారము తెలిసికొని శివాజీ కొండాణగడములో మహమ్మదీయుల స్వాధీనమందున్న దుర్గమునుగూడ వశపరచుకొనుమని తన సేనానియైన తానాజీని నియోగించెను. తానాజీ మారువేషమున దుర్గము ప్రవేశించి దేశభక్తి పూరితములైన పాటలతో మహమ్మదీయ సేవకులైన మహారాష్ట్ర సైనికులను స్వాతంత్ర్యోత్సాహపూరితులుగా జేసి, సమయమునకు పద్మకూనభంగము నరికట్టుటయేగాక దుర్గమును మహారాష్ట్ర స్వాధీన మొనర్చినాడు. కాని యుద్ధములో నుదయసింహునితోపాటు తానాజీకూడ మరణించి వీరస్వర్గము నొందినాడు.

కవి స్వతంత్రభావపూరితుడు. కవిలోని ఉద్రేకము స్పష్టముగా కనబడుచున్నది. కాని ఉద్రేకపూరితులందరును భావస్ఫురణమునందు లొంగిపోవుట సహజము. ఈ కవివిషయములోకూడ ఆలోపమే కనబడుచున్నది. పద్యములుకాని, వచనముకాని కావలసినంత రసపోషకములుగా లేవు. కవిగా రింకను కృషి చేసి రసవంతమైన నాటకములు రచించి దేశసేవ చేయుదురని నమ్ముచున్నాను.

వెం. శ్రీ.

---

## ఆంధ్ర లాజర్నల్

ప్రీవీకౌన్సిల్, ఫెడరల్ కోర్టు, హైకోర్టులలోని ముఖ్యమైన తీర్పులను గురించియు, గ్రామ పంచాయి

తీలు, కోర్టులు లోనగువాని విధులనుసరించియు, మరియు న్యాయశాస్త్రములకు జెందిన విషయములను గూర్చియు వివరములు తెలిపి ఆంధ్రుల నందరను కోర్టువ్యవహారజ్ఞులనుగాచేయు పక్షపత్రిక. ప్రతినెలా ౧,౧౬ వ తేదీలందు వెలువడుచుండును. సంపాదకులు: శ్రీ బందా కనకరాజుగారు, జిల్లాకోర్టు వకీలు, గుడివాడ, కృష్ణాజిల్లా. సంవత్సరచందా రు. 3-0-0. విడిప్రతిక రు. ౦-౮-౦ లు.

---

## దానధర్మపద్ధతి

గ్రంథకర్త : శ్రీ నారాయణ శ్రీనివాసగారు. అనువాదకులు : శ్రీ ఎంబార్ భాష్యాచార్యులుగారు, శ్రీ నిధి ప్రెస్, ౬౮, సిపింగ్స్ రోడ్డు, బెంగుళూరు కంటోన్మెంటు. వెల 0-౮-0 తపాలా కూలిగాక.

ప్రస్తుతము భారతదేశములో ౨౦ లక్షలకు పైగా భిక్షుకవృత్తి నవలంబించినవారు గలరు. ఈ భిక్షుక సమస్యను విజదీయుటకై యుపాయముల సూచించుచు వ్రాయబడిన దీ గ్రంథము. ఇందు అయిదుఅధ్యాయములు. ప్రథమాధ్యాయమున దానము, దాత, దానగ్రహీతల ఉత్తమమధ్యమాధమ లక్షణములును, రెండవఅధ్యాయములో ప్రాచీనకాలపు దాతలగు శిబి, మయూరధ్వజ, దధీచ్యాదుల వృత్తాంతములును, మూడవయధ్యాయమున మధ్యకాలమందలి అహల్యాబాయి, సయాజీరావుగైక్వాడ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ మున్నగు దానకర్తల సమాచారములును గలవు. నాలుగవఅధ్యాయములో వర్తమానకాలమున దానధర్మములందు గావింపదగిన సంస్కారములసూచనలతో బాటు సందర్భానుసారము నానావిధభిక్షుకజాతుల వివరములును, దానము లేవిధమున గావింపవలసినదియు తెలుపబడినవి. పంచమాధ్యాయములో వివేకానందాది మహాత్ముల బోధన లున్నవి. అనుబంధములో మరియు పెక్కువిషయములు గలవు. ఈదేశమందలి భిక్షుక, నిరుద్యోగుల విషయముల దెలిసికొని వారికి ఉపకారము చేయగోరు దేశహితైషుల కిది ముఖ్యముగా చదువ వలసిన గ్రంథము.

---

## రత్నశాల

సంపాదకుడు: వారణాసి వెంకటేశ్వరులుగారు. సాహిత్యకుటీరమువారి ప్రచురణములలో మూడవది. గొట్టిపాడు, చిలకలూరిపేటపోస్టు - గుంటూరుజిల్లా. వెల సభ్యులకు రు. ౦-౪-౦ లు, ఇతరులకు రు. ౦-౬-౦

ఇది ఒక చిన్న ఖండకావ్య సంపుటి. నాటికాఖండము, గీతికాఖండ మని రెండుభాగములు. మొదటి భాగములో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, చివుకుల ఆదినారాయణ, వెంపటి కోటీశ్వరశాస్త్రిగార్లు వ్రాసిన 'కిరీటమణి', 'దేవుడికోపం', 'పల్లెటూరిబడి' యను మూడునాటికలు గలవు. ఒకానొక మణియాధారమున నేదోవిధముగా జీవనము గడపుచుండిన పురాణీల నుండి దానిని బలాత్కారముగా లాగికొన్న కురానీలను, వారినుండి లాక్కొన్న కిరానీలును ఎవరును భరించజాలక సముద్రములో పారవేసి ప్రాణాలు దక్కించుకొన్న విచిత్రగాథ మొదటిది. రెండవనాటికలో స్వార్థపరులైన అర్చకులు దేవాలయములలో చేయుఅత్యాచారములును, మూడవదానిలో పల్లెటూరి బడిపంతుళ్లుగావించు అన్యాయములును హాస్యముగా చిత్రింపబడినవి. రెండవభాగమగు గీతికాఖండములో జాషువా, శేషావతారం, సీతారామమూర్తి లోనగు ఆధునికకవులు రచించిన పద్యములు గలవు.

---

## పడకటింట్లో విజ్ఞానచర్చ

గ్రంథకర్త: శ్రీ వసంతరావువెంకటరావుగారు. రామానుజాచార్యవిద్యాసమితి (పార్కుసైడ్ విల్లా, విజయనగరము) వారి ప్రచురణములలో ౩౬-వ గ్రంథము.

సామాన్య జనుల కందరికీ సులభముగా తెలియని వైజ్ఞానికవిషయాలు చదువురాని స్త్రీలకు సహితము సుబోధము లగుటకుగాను వ్రాయబడిన దీగ్రంథము. క్లిష్టములైన భౌతికవిజ్ఞానశాస్త్ర, రాసాయనికశాస్త్ర, జ్యోతిషశాస్త్రములకు సంబంధించిన విషయము లిందు ఏడెనిమిదిప్రకరణములలో చక్కగా వివరింపబడినవి. అనుబంధములో దూరదర్శిని, సూక్ష్మదర్శిని ఇత్యాదుల చిత్రములూ, వివరణములూ, ఎలక్ట్రాన్, ప్రోటానుల గతులను దెలుపు చిత్రములూ గలవు.

# గ్రంథస్వీకారము



### కల్హారమాల

గ్రంథకర్త: శ్రీ పులివర్తి శరభాచార్యులు గారు. ప్రకాశకులు: విశ్వజ్ఞమండలి, తెనాలి. వెల రు. ౦-౧౦-౦.

### స్నేహలత

కర్త: శ్రీ నూరి రాజగోపాలము గారు, నిడదవోలు, పశ్చిమగోదావరిజిల్లా. వెల రు. ౦-౩-౬

### కృష్ణమహాస్స

గ్రంథకర్తలు: శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, ఘట్టి నరసింహశాస్త్రిగారలు. తెనాలి కళ్యాణి ప్రెస్సులో ముద్రితము.

### శ్రీ మహాభక్త విజయము

రచయిత: శ్రీ పరవస్తు జియ్యరు సూరిగారు ప్రకాశకులు: ఎంశార్ భాష్యాచార్యులుగారు. శ్రీ నిధిప్రెస్, ౩౮, స్పెంగ్సురోడ్. బెంగుళూరు కంటోన్మెంట్. వెల రు. ౬-౦-౦, తపాలకూలి రు. ౦-౧౪-౦.



పల్లీయులు